# భారతి

సాహిత్య
మాస పత్రిక

సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రణాలయము,
మద్రాసు.

సంపుటము 31 సంచిక 1
జనవరి, 1954.
విడిప్రతి వెల ఒకరూపాయి

# విషయానుక్రమణిక

జనవరి 1954


| | | |
|---|---|---|
| జన్మదివసము— | ... | 1 |
| సంక్రాంతి కన్యలు—బెళ్లూరి శ్రీనివాసమూర్తిగారు | ... | 3 |
| కవికొండల వెంకటరావుగారి కవిత్వం—సి. గణపతిశాస్త్రిగారు | ... | 4 |
| అభిసారిక—'పఠాభి' | ... | 13 |
| సుందరమ్మ అల్లుడు—ఘట్టి కృష్ణమూర్తిగారు | ... | 14 |
| తంజావూరి మహారాష్ట్రభూపతులు – ఆంధ్రసాహిత్యము— మల్లంపల్లి సోమశేఖరశర్మగారు | ... | 33 |
| అబల—వేలూరి సహజానందంగారు | ... | 42 |
| లలితాసహస్రనామములో దేవీస్వరూపము—డి. యస్. శర్మగారు | ... | 45 |
| రాక—బోయి భీమన్నగారు | ... | 57 |
| నవ్యసృష్టి—వేముగంటి నరసింహాచార్యులుగారు | ... | 58 |
| తిరుగు ప్రయాణం—పంతుల శ్రీరామశాస్త్రిగారు | ... | 59 |
| తెనుగుతోట—నోరి నరసింహశాస్త్రిగారు | ... | 69 |
| బడుగు రైతు—బొడ్డు బాపిరాజుగారు | ... | 73 |
| నన్నయ చిత్రించిన రాజరాజు—నండూరి బంగారయ్యగారు | ... | 74 |
| ఏలకానైతి!—పురిపండా అప్పలస్వామిగారు | ... | 78 |
| భావనావ్యాపారము—పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | ... | 79 |
| రెండుపరిణామాల లోకపు వింతలు—వసంతరావు వేంకటరావుగారు | | 90 |
| కలగూరగంప— | ... | 95 |
| గ్రంథవిమర్శనము— | ... | 98 |


త్రివర్ణచిత్రము: రోహిణీచంద్రవిహారము- రాగి వెంకటేశ్వరరావుగారు.



వచ్చుచున్నది

# రాజీ

నా ప్రాణం...

## జెమినీ చిత్రం







రోహిణీ చంద్రవిహారము

చిత్రకారుడు: శ్రీ రాగి వెంకటేశ్వరరావు.



విజయ
పుష్యము

# భారతి

సంపుటము 31
సంచిక 1

## జన్మదివసము

ఆంధ్రదేశం అంతటా సంక్రాంతి పండుగ సన్నాహావేశాలతో ఉవ్విళ్లూరుతున్నది. తెనుగువారి పండుగలన్నిటిలోను సంక్రాంతి పెద్దపండుగ. అందులోను ఆంధ్రరాష్ట్ర సంపాదనానంతరం అవతరించిన ఈ విజయసంక్రాంతి ఆంధ్రులకు కేవలం విజయ సంక్రమణోత్సవమే.

భారతికూడా ఈ సమయంలో జన్మదినోత్సవం జరుపుకొంటున్నది. ఈ సంచికతో భారతికి 30 సంవత్సరాలు నిండి, 31 వ సంవత్సరం ప్రారంభిస్తున్నది. ఇంత కాలంనించీ ఈవిధంగా ఆంధ్రావళి గౌరవాదరాలు చూరగొన్న భారతి వాఙ్మయ వ్రతులకు, సహృదయులైన పాఠకులకు శుభాభినందనా లందిస్తున్నది.

ఈ సమయంలో స్వీయ సంస్థాపకులు, ఆంధ్రోద్యమ నాయకులు, సారస్వత సమారాధకులు అయిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి దివ్యస్మృతికి నమోవాకా లర్పించి, వారి ఆశీర్వాదబలం అర్థిస్తున్నది.

నిరంతరము వాఙ్మయ సమారాధనలో పరిశ్రమించిన వారి సారస్వతాదర్శా లొకసారి సంస్మరించి, తిరిగీ ఒక నూతనోత్తేజంతో నిరంతరయాత్ర కుపక్రమిస్తున్నది.

భాషారాష్ట్ర ప్రారంభంతోనే మన వాఙ్మయ చరిత్రలో ఒక నూతనాధ్యాయం ప్రారంభించినది. అందులోను నూతన ప్రజాస్వామ్య పరిసరాలలో మన వాఙ్మయానికి మరింత విశిష్టత ఏర్పడుతున్నది.

ఇంతవరకు మన వాఙ్మయంలో దేశి విభాగము, మార్గవిభాగము, కొంత వేరు వేరుగా ఉండిపోయి, భిన్నభిన్న లక్ష్యాలతో పెంపొందినట్లు కనిపిస్తున్నాయి. సజీవ ప్రజాస్వామ్య వ్యవస్థలో క్రమక్రమంగా

ఈ విభేదా లంతరించి, వాఙ్మయం సమానస్థాయిలో సాగిపోవలసిన అవసరం కలుగుతున్నది.

ఈనాటి ప్రజాస్వామ్యానికీ, సారస్వతానికీ చాలాదగ్గిర సంబంధం ఉన్నది. సజీవ సారస్వతానికీ, ప్రజాస్వామ్యానికీ లక్ష్యం ఒకటే. ఇవి పరస్పరసమన్వయంతోను, సహకారంతోను పురోగమించినపుడే ప్రజానీకానికి సర్వతోముఖమైన వికాసం కలుగుతున్నది. వీటిలో ఏది కుంటుపడినా సారస్వతము, జాతి పరస్పరప్రగతికి ప్రతిబంధకాలుగా పరిణమిస్తున్నాయి.

ఇందువల్లనే నేటి సారస్వతము ఏదో ఒకప్రత్యేక వర్గానికిగాని, సంకుచిత సాహిత్య సిద్ధాంతానికిగాని ప్రతినిధిగా మారిపోకుండా సంరక్షించుకోవాలి. వాఙ్మయం దేశీయాదర్శాలకు సజీవదర్పణంగా భాసించినపుడే అది ఆదేశీయుల ఆత్మచైతన్యానికి వికాసం కలిగించగలదు.

ఈనాటి మన ప్రజాస్వామ్యంగాని, సారస్వతంగాని ఈ విషయంలో తగినంత పరిణతి పొందలేదు. ప్రజాస్వామ్యాదర్శాలకే క్లిష్టపరిస్థితు లేర్పడుతున్న వర్తమాన సమాజపరిస్థితిలో, సారస్వతం ప్రత్యేకంగా ప్రజావళికి వెలుగుదారి చూపించవలిసిన అవసరం ఎంతైనా ఉన్నది.

ఒకజాతిసంస్కృతి, ఆత్మ వ్యక్తిత్వము, సారస్వతంలో సంపూర్ణంగా ప్రతిఫలిస్తున్నాయి. ఈవిధమైన అవగాహనతో సంపూర్ణాత్మ సాక్షాత్కారం కలిగినపుడే సాహిత్యోపాసకులసృష్టి జీవచైతన్యంతో తొణికిసలాడుతున్నది. ఇలాంటిసజీవసృష్టికి సంప్రదాయము, నిత్యప్రగతి శీలమైన నూతన జీవచైతన్యము రెండు రెండునేత్రాలవంటివి.

ఈవిషయాలన్నీ సహజంగా ఆకళింపు కొన్నప్పుడే సాహితీపరులు సమాజ ధర్మ ద్రష్టలై మార్గదర్శకు లవుతున్నారు.

ఇవి గమనించలేనివా రేవో సంకుచిత రాజకీయపక్షానికో, వర్గానికో, వాఙ్మయ ధోరణికో ప్రచారచారణులుగా మారి, ఆత్మ విక్రయానికి పాల్పడుతున్నారు. ఈవిషయాలలో ఎంతమాత్రము ఏమరని వాఙ్మయ స్రష్టలే అర్హగౌరవం పొందుతున్నారు.

'నానృషిః కురుతే కావ్యం' అన్న ప్రాచీన ప్రవచనము సూక్ష్మంగా ఈ అభిప్రాయమే ధ్వనిస్తున్నది. పైవన్నీ ఏవో అందరాని సుదూరాదర్శాలని అనిపించవచ్చునుగాని, నానాటికీసాహితీపరు లీపరమార్థాలునిశితంగా గమనించవలసిన అవసరం ఏర్పడుతున్నది.

ప్రారంభంనించీ భారతి అన్ని వాఙ్మయ శాఖల్లోను, సంప్రదాయం సంరక్షించుకుంటూ యువకుల నవ్యసృష్టికి సముచితమైన దోహదం ఇచ్చి, ప్రోత్సహించింది. ఇన్నాళ్ళనించీ సాహిత్యాభిమానులు, రచయితలు, పాఠకులు ఈ పత్రికా నిర్వహణాని కనేకవిధాలుగా సహకరించి, భారతికొక ప్రత్యేక గౌరవం కలిగించారు.

ఇకముందుకూడా వీరందరు ఈవిధంగానే భారతీసంస్థాపకుల సమున్నత లక్ష్యసిద్ధికి సహరించగలరనీ, సర్వతోముఖమైన ఆంధ్ర వాఙ్మయ వికాసానికి దోహదం కలిగించగలనీ ఆశిస్తున్నాము.

# సంకాం   స్నాలు

## శ్రీ బెళ్లారి శ్రీనివాస మూర్తి

వింతగబూచె కన్నులకు విందుగగుమ్మడిపూలు, పల్లెలం
దెంతటి రామణీయకమొ, యిచ్చట నుయ్యాలలూగి యివ్వనీ
ప్రాంతములందు నాడుకొనవచ్చిన కన్నెల మందహాస సం
క్రాంత మనోహరత్వము పురాదివసంబుల నాసగొల్పెడిన్.

ఎంత ముదావహంబగుచు ప్రేక్షకులన్ దనియింపసాగ సం
క్రాంతి దినోదయ ప్రకృతి! కన్నెయొకర్తుక స్వీయ సత్కళా
కాంతుల నారజల్లి చిరకాలపుటాంధ్ర తపస్సు పండిన
ట్లెంతయు ముగ్గుదీర్చి కనుతెప్పలు వాల్పక చూచు నందమున్!

ఒకయీడేరిన కన్యకామణి, ప్రభాతోద్యచ్ఛిరస్నాత, సూ
ర్యకరాళిన్ నిజనీలకుంతలము లారన్వైచి, పూజాప్రసూ
నకముల్ పళ్లెరమందుబోసికొని బృందన్ జేరి యర్చించు గా
నకళాగర్భము జీల్చి తెన్గునుడు లందంబుల్ ప్రవర్షింపగన్.

ఒక పేదయింటి బాలిక
మొకమంతయు కనులుగా ప్రమోదించి రసో
త్సుకయయ్యె నవ్యవస్త్రా
దికములు సంక్రాంతి పర్వదినముల గనుచున్.

ఈనవ్యాంధ్ర సుపర్వవాసరము లిట్లేతేర, ప్రాచీన లీ
లానైపుణ్యములన్ స్మరించుకొని బాలల్ కూడి నిత్యోత్సవ
శ్రీనాట్యంబుల దేవకన్యకలువోలెన్ తేజరిల్లన్, ప్రభూ
తానందాభ్యుదయంబులన్ దెలుగుప్రాంతంబెల్ల శోభిల్లెడిన్!

# కవికొండల వెంకటరావుగారి కవిత్వం

శ్రీ పి. గణపతి శాస్త్రి

శ్రీ కవికొండల వెంకటరావుగారి కవిత్వం తలుచుకునేసరికి మన హృదయాలలో ఒక్కసారిగా ఉభయగోదావరీ ప్రాంతాలలో జానపదుల జీవితంఅంతా చిత్రచిత్రమైన వివిధభంగిమలతో మెరిసిపోతుంది.

కేవలం జానపదుల జీవితమేగాక ఆయా ప్రాంతాలలోని రమణీయ ప్రకృతి చిత్రాలు, కలువలతోను, తామరపువ్వులతోను, కలకలలాడే కోనేరులు, ప్రశాంతంగా ప్రవహించే గోదావరి కాలువలు, ఆ కాలవల్లో తెల్లని తెరచాపలతో చల్లగా సాగిపోయే రాదారిపడవలు, సాయంకాలవేళ ఆపడవలు లాగే జనం చేతికర్రల సవ్వడులు, వారిపాటలు, నిశ్శబ్దనిశీథంలో పడవలనంటి ప్రవహించే నీటి గలగలలు, పచ్చికబయళ్లమీద పరిగెత్తే నీరెండ సొగసులు, నీరెండలో ఎగిరే పాలపిట్టల రెక్కల తళతళలు మొదలైన మనోహర దృశ్యాలెన్నో వీరి కవితలో అడుగడుగునా ఆవిర్భవిస్తూంటాయి.

శ్రీ వెంకటరావుగారు ప్రసిద్ధ కవిగా దేశంలో ప్రఖ్యాతులైనారు. అయితే వీరు వ్రాసిన కథలు, నాటికలు, నాటకాలు, చిత్రణాలు మొదలైన వచనరచన లసంఖ్యాకంగా ఉన్నాయి. వీటిలో ఒక్కొక్క జాతి రచన పరిశీలించడానికే అధమం ఒక్కొక ప్రత్యేక వ్యాసమైనా వ్రాయవలిసి ఉంటుంది. అవి అన్నీ అటుంచి కేవలం వీరి కవిత్వం పరిశీలించినా దీనిలోని విషయవైవిధ్యము, రచనావైవిధ్యము, అనంతంగా కనిపిస్తున్నాయి.

కవికొండలవారు కేవలం సాంప్రదాయిక ధోరణిలో చంపకమాలాది వృత్తాలతో వ్రాసిన కథాకావ్యాలు, ఖండకావ్యాలు, మొత్తం వీరి కవితా రచనలలో ఇంచుమించుగా సగందాకా ఉన్నాయి. ఇవిగాక అధునాతన పద్ధతిలో వ్యావహారిక భాషలోను, వివిధములైన జానపదగేయచ్ఛందస్సులలోను, వీరు విరివిగా కవితారచనలు సాగించారు. ఇంతకుపూర్వమే వీరు ప్రకటించిన, భావమురళి, జనపదములు, కుమారకంఠము, మాతృదేశ సంకీర్తనము, కలరుతము, ప్రకృతి చందనము, ఆత్మవ్యక్తి, నెలబాలుడు, మొదలైన ఖండకావ్య సంపుటాలు, ఇటీవల ప్రచురించిన విశాలవిశ్వము, ప్రకృతి పాంచజన్యము, కలిసి మొత్తం కవికొండలవారి కావ్య సంపుటాలు 15 దాకా లెఖ్ఖకు వస్తున్నాయి. ఇవిగాక వీరు రచించిన ఖండకృతుల లింకా కొన్ని అప్రకటితంగానే ఉండిపోయాయని తెలుస్తున్నది.

## పూర్వరంగం

ఈ విధంగా ఇంత విస్తృతమైన వీరి కవిత్వం పరిశీలించేముందు వీరి కవిత్వానికిగల పూర్వరంగం అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం.

శ్రీ వెంకటరావుగారు జన్మించింది 1892 లో. ఆ కాలంలో రాజమహేంద్రవరంలో కళలకు, అధునాతన సాహిత్యానికి, నిత్యసమున్మేషం కలిగించిన కూర్మి(?)దొర దగ్గర వీ రంతేవాసులు.

శ్రీ వెంకటరావుగారు కవిత రచనకుపక్రమించే సరికే—అంటే 1912 ప్రాంతానికే-నవ్యాంధ్ర సాహితీ రాజధానులయిన గుంటూరు, బందరు, రాజమహేంద్రవరం, విజయనగరాలలో అనేక మార్గాల్లో నవ్యసాహిత్యోద్యమాలు మొలకలెత్తడం ప్రారంభించాయి.

కవికొండలవారి కవిత్వం నిశితంగా పరిశీలించిన వారికి, వీరి కవిత్వం ఆధునిక కవితా మార్గంలో ఒక విశిష్టమైన ఫణితికి చెందినదని స్పష్టంగా గోచరిస్తుంది.

అయినా ఒకటిరెండు వాఙ్మయ సిద్ధాంతాల ప్రభావాలు బలంగా వీరి కవితలో కనిపిస్తున్నాయి. వీటిలో మొదటిది జానపద కవిత్వ ప్రభావము. రెండవది అప్పటికే తెనుగుదేశంలో ఏర్పడిన నవ్యకవితోద్యమ ప్రభావము.

## జానపద కవితోద్యమము

ఈ ఉద్యమం ఆంగ్ల వాఙ్మయంలో 19 శతాబ్ది ప్రారంభంలో బయలుదేరింది. ఇది ప్రారంభించినవాడు వర్డ్స్‌వర్త్. ప్రజలు అనుదినము వ్యవహరించే భాషలో జానపదుల కష్టసుఖాలు చిత్రించడంవల్ల ఉదాత్త కవిత్వం పలికించవచ్చునని వర్డ్స్‌వర్త్ సిద్ధాంతీకరించాడు. ఇతడు తాను ప్రచురించిన (*Lyrical Ballads*) లిరికల్ బాలెడ్స్ అనే కావ్య సంపుటిపీఠికలో మొట్టమొదటగా మహోత్సాహంతో ఈ నూతన ప్రస్థానం ప్రతిపాదించాడు. దీనిమీద

(*Coleridge*) కోల్‌రిడ్జ్ కవి ఒక విపులమయిన ప్రతి విమర్శ వ్రాసి ఈ వాదంలోగల లోపాలు కొన్ని పేర్కొన్నాడు. ఆంగ్ల వాఙ్మయంలో ఆ వాద ప్రతివాదాల ఫలితా లెలాగ నడిచినా వర్డ్స్‌వర్త్ కవి రచనలు, అతని సిద్ధాంతాలు శ్రీ వెంకటరావుగారి కవిత్వపరిణతికి బాగా దోహదం కలిగించాయని చెప్పవచ్చును.

ఇక రెండవది మన నవ్యకవితోద్యమ ప్రభావము. వెంకటరావుగారు కవిత్వ రచన కుపక్రమించేసరికి గురజాడ అప్పారాయకవి రచనలు వచ్చాయి. అప్పారావు ముత్యాలసరం సరి కొత్తగా సృష్టించినా ఇది ఆనాడు జానపదుల వ్యవహారంలో ఉన్న—

"గుమ్మడేడే గోపిదేవి
గుమ్మడేడమ్మా!"

వంటి జానపదగేయాల ధోరణిలో రచించిన మాత్రా చ్ఛందస్సు. మొట్టమొదటగా వ్యావహారిక భాష కవితలో పలికించిన వైతాళికుడు గురజాడ అప్పారావు. ఈయన గేయచ్ఛందస్సు, వ్యావహారిక భాషోద్యమము కవికొండలవారి కొత్త కొత్త గేయ రచనలకు కొంతవరకు దారి చూపించాయి. ఇవిగాక వెంకట పార్వతీశ్వర కవుల నూతన కవిత్వావిర్భావం కూడా ఆనాటి ఆధునిక కవిత్వానికి తొలి ప్రొద్దు పొడుపులా భాసించింది. అదీగాక కవిత్వంలో వినూతనత్వం అనేది ఆ రోజుల్లో గాలిలోనే ఉన్నట్టు కనబడుతుంది.

ఇక్కడ ఒక విషయం ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి. కవికొండలవారి కవిత్వ ప్రాదుర్భావానికి అటు సరోవర కవుల (*Lake Poets*) కవిత్వము, ఇటు ఆంధ్ర దేశీయమైన నవ్య కవితోద్యమము, జానపదగేయాలు మొదలయినవి కొన్ని ప్రోద్బలం కలిగించిఉండవచ్చును. అంతమాత్రంచేత వీరా పాశ్చాత్య కవిత్వము, ఆ ధోరణులు మక్కికి మక్కీగా తెలుగులోకి అనువదించుకున్నారని భావించకూడదు. అవి వీరి కవితలో సుదూరప్రభావచ్ఛాయల్లాగ నిలిచిపోయి, శ్రీ వెంకటరావుగారి ముఖతః స్వచ్ఛము, సహజము, జాతీయము అయిన కవిత ఆవిర్భవింపజేశాయి.

ఈ రోజుల్లో పాశ్చాత్యధోరణులు బాగా ఆకళించుకున్నారనుకునే కొందరు కవులరచనలు పరికిస్తే వాటిలో కొన్ని కేవలం పాశ్చాత్య ధోరణులకు ప్రతిధ్వనుల్లా వినిపిస్తాయి. మరికొన్నింటిలో అస్పష్టమైన పాశ్చాత్య కవితా స్వరాల జీరలేవో వినిపిస్తూంటాయి. ఒక్కొక్కప్పుడీ కవులీ దేశంలోనే ఉన్నారా? లేక లండన్‌లోనో, పారిస్‌లోనో, మాస్కోలోనో ఉండి రచనలు సాగిస్తున్నారా? అన్న అనుమానం కూడా కలుగుతూంటుంది!

ఈనాటి కవులకు ఇటు ప్రాచీనాంధ్ర కవితా సంప్రదాయాలతోబాటు, అటు అత్యాధునాతనమైన దేశీయాంతర్దేశీయ కవితాధోరణుల అవగాహనకూడా అత్యంతావశ్యకమే.

ఇలాంటి అవగాహన ఉన్నప్పుడే ఈ రోజుల్లో సజీవకవిత చెప్పడం సాధ్యపడుతుంది. అయితే ఈ విధంగా ఆధునికమైన ప్రాచ్యపాశ్చాత్య ధోరణాల అవగాహన ఉన్నా, అచ్చమైన తెలుగు గొంతుకతో ఆధునిక కవితారచన సాగించగల శక్తివంతులు చాలా అరుదుగా ఉన్నారు.

కవికొండల వారి రచన ఏది పరిశీలించినా అడుగడుగునా ఇటువంటి అద్భుత శక్తి సాక్షాత్కరిస్తుంది. ఈ శక్తే వీరి కవితకొక ప్రత్యేక వ్యక్తిత్వం కలిగించింది.

విమర్శన సౌలభ్యంకోసం వెంకటరావుగారి కవిత్వం అంతా నాలుగువిధాలుగా విభజించుకోవచ్చును. వీటిలో మొదటిది ప్రకృతి కవనం. రెండవది జానపద కవిత. మూడవది బాల కవిత. నాలుగవది దేశభక్తి కవిత్వం. వీరి కథాకావ్యాలు కూడా వీటిల్లో ఏదో విభాగంలోకి చేరిపోతాయి.

## ప్రకృతి కవిత

మన ఆధునిక కవిత్వంలో మొట్టమొదటగా అచ్చమైన ప్రకృతి కవిత్వము, జనపద కవిత్వము వెలయించిన గౌరవం శ్రీ వెంకటరావుగారికే దక్కుతుంది. ఇక్కడ ప్రకృతి కవిత అనే పదం అచ్చంగా ప్రకృతి స్వభావము, సౌందర్యము వర్ణించే, కవిత్వమనే అర్థంలో వాడుకుంటున్నాము. చిత్రకళలో కేవలం ప్రకృతి స్వభావ సౌందర్యా లభివర్ణించే ప్రకృతి చిత్రాల (*Landscape Painting*) ధోరణిలో ప్రత్యేకంగా ప్రకృతి సౌందర్యం చిత్రించే కవిత్వం ప్రకృతి కవితగా పాశ్చాత్య వాఙ్మయంలో ప్రసిద్ధికెక్కింది.

సంస్కృతవాఙ్మయంలో ఋతుసంహారంలోనే ప్రకృతి కవితా ప్రారంభం జరిగినా సంస్కృతాంధ్ర వాఙ్మయాల్లో ఎందుచేతనో ప్రత్యేకప్రకృతి కవన సంప్రదాయం ఏర్పడలేదు. అందుచేత

నేటి అధునాతన ప్రకృతి కవితకు ఎక్కువగా పాశ్చాత్య ప్రకృతి దృశ్యవర్ణనమే ఒరవడి పెట్టిన దని అంగీకరించాలి.

కవికొండలవారి కవిత్వంలో ప్రకృతి చాలా చోట్ల, గ్రామీణ జనసామాన్యం కష్టసుఖా లభివర్ణించే జానపద కవితకు పూర్వరంగంగా ఉండిపోతుంది. అల్లాగే సుందర ప్రకృతి వర్ణనలో జానపదుల స్వభావ వర్ణనపరమైన కథాఘట్టాలుకూడా వస్తాంటాయి. ఈ క్రిందిగీతం దీనికి ఉదాహరణంగా తీసుకోవచ్చును. ఇది గోదావరి కాలవలో కంకరతో నింపిన ఇనపపడవలాగే పల్లెవారి స్వభావం నిశితంగా హృదయానికి హత్తుకునే తీరులో వర్ణించిన ఖండకృతి.

"ముసలితాత యొకడు ముందు త్రాడెంతయో
శ్రమవహించి, లాగి సాగుచుండ,
త్రాళ్లి నినుపపడవ నీళ్లకెదురు మెల్ల
బోవుచుండె గాల్వపొడుగు మరచి!
అతని చిన్నిమనుమడా వెన్కచుక్కాని
కడల గూరుచుండి, కడవనున్న,
చలిది గుడుచుచుండి, తలనెత్తి కేడముచే
ద్రిప్పుచుండె దాని నప్పుడపుడు
గాలిలేదు; చాప జాలరు వోలెను
వ్రేలుచుండె గొయ్యబెనచుకొంచు,
వెనుకముందు బడవ వేరొండు లేదియ్యో
నీటియందు దాని నీడదక్క!
ఈదుగేదెయైన ఎంచితలగిపోవు;
దాని కడ్డపడగ దలపబోదు;
పడుచొకర్తు దానివైపున జూచుచు
ముంచినట్టి బిందె ముంచుమరల!
పడవ నడకతీరు, పడవ లాగడుతీరు,
పడవ బరువుతీరు ఎడదగొల్పి,
వృద్ధు నపహసించి బిగ్గరనే నంటి
'ఇట్లు పోవజేరు లెప్పటికని!'
కుర్రవాడు పలికె గొనరెడు నగవుతో
చిటికెలోన రేవు జేరమ యని,
వృద్ధుడూచు త్రాటి విసరున నుస్సని
'ఎప్పుడైతె నేమి యేటికనియె!'"

—ప్రకృతి చందనము.

దీనిలో నెమ్మదిగా సాగిపోయే పడవనైపు పరికిస్తూ మైమరిచిన ఒక పడుచు, ముంచిన బిందే కాలవలో మళ్లీ ముంచినదని వర్ణిస్తూ కవి పాఠకులనుకూడా ఆ తన్మయతలో మైమరిపిస్తున్నాడు.

ఇక్కడ ఈ ప్రశాంత ప్రకృతి పూర్వరంగంలో ఎడతెగని దుర్భరజీవయాత్ర సాగించే వృద్ధుని ఓరిమి, సుఖదుఃఖాలను లక్ష్యపెట్టని తటస్థదృక్పథము, నిస్పృహ, ఉత్సాహపూర్ణమైన చిన్ని మనుమని చిరునగవు ఆ కాలవప్రవాహంలాగే గంభీరంగా ప్రవహిస్తున్నట్లు స్ఫురిస్తున్నాయి!

ఈ విధంగా ప్రకృతి పరిసరాలలో కష్టసుఖాలు లక్ష్యపెట్టకుండా ఎడతెగకుండా పరిశ్రమించే జానపదుల మనః ప్రవృత్తులు ప్రదర్శించడంలో ఈ కవి సిద్ధహస్తులు.

అయితే ప్రత్యేకంగా స్వచ్ఛప్రకృతి వర్ణనపరమైన ఉత్తమ ఖండకావ్యాలు కూడా వీరి కవితా సంపుటాలలో చాలా చోట్ల కనిపిస్తాయి. ఈ క్రింది గీతిక దీనికి తార్కాణము.

### శీతకాలపు సంధ్య

కొండదారిని నొక్క రెండెడ్లబండి
నే లెత్తుగా బోవనే గనుగొంటి.
తోలెడు వాడు తా దొట్టిలో నిదుర
బోవుచుండెను గాఢభావంబుగదుర.
శీతకాలపు సంధ్య! చిరుచలి సంధ్య!
ఎర్రని సంధ్య! నివ్వెరుగని సంధ్య!
ఎడ్లను నడిగితి 'నెందాక మీర
లేగువారీ తీరు నెందాకనంటి
తోలెడువానికే తొందరలేదు
నడువంగ నేటికి? నడువంగ నేల?'
శీతకాలపు సంధ్య చిరుచలి సంధ్య!
ఎర్రని సంధ్య! నివ్వెరుగని సంధ్య!
అంతలో లేచెనే యా బండి అబ్బి
దబదబ కొట్టెనే తనయెడ్లనయ్యో!
పరుగిడ జొచ్చెనే పైయూరుదాక
గంగడోళ్లాడంగ, గంటలుమ్రోయ
శీతకాలపు సంధ్య! చిరుచలి సంధ్య!
ఎర్రని సంధ్య! నివ్వెరుగని సంధ్య!
ఎందాక ననునట్టి యెరుగనా పల్కు
లవి వినకుండనే యరిగిన నెడ్లు
బండియు నరిగెను బండివాడరిగె!
ఎందాకనో నేరకే నిక్కడుంటి!
శీతకాలపు సంధ్య! చిరుచలి సంధ్య!
ఎర్రని సంధ్య! నివ్వెరుగని సంధ్య!

—భావమురళి

దీనిలో 'శీతకాలపు సంధ్య! చిరుచలిసంధ్య!' అనే మకుటం మాటిమాటికీ ఆవృత్తిమాతూ ఒక విచిత్ర

మైన సాంధ్య వాతావరణంలో పరిగెత్తే బండి ఎద్లు, కదిలే గంగడోళ్ళు, గంటలు కళ్ళకుగట్టేటట్లు స్ఫురింప జేస్తున్నది.

ఈ క్రింది గీతికకూడా ఇలాంటి ప్రకృతి చిత్రణమే.

పసుపుముందు గ్రుంకెడు ముదుసలిప్రొద్దు
... ... ల్ళలో నందగించెడిని.
చిన్నారి మాతంగి చెంగలిగడ్డి
తసుపును దులుపును దరిని బెట్టుచును
ఇద్దరి నీళ్ళలో నింపు వహించె
నీళ్ళలో వారల నీడల జూచి,
కడసంజగడియల గడిపితి వింత!
వర్చస్సు గోలిపెడు పడమటి పొద్దు,
స్వచ్ఛత జూపెడు పచ్చని గడ్డి,
అయినప్పటికి నాదు ఆత్మ అదేమొ!
నీళ్ళ నల్లాడెడు నీడల దగిలి,
చిన్నారి యల కలక కెంచె ముదంబు!

—ప్రకృతి చందనము.

ఒక మాలెత నీళ్ళలో పచ్చగడ్డి తడిపి ఒడ్డున వెయ్యడమే ఈ ఖండకృతిలో వర్ణ్య వస్తువు. కాని నీటిలో ప్రతిఫలించే నీడలు, సంజెపొద్దు కలిసి దీని నొక చక్కని ప్రకృతిచిత్రంలా మార్చివేశాయి.

నీరవ సాయంకాల సౌందర్యం స్ఫురింపజేసే ఈ క్రింది రచన కూడా ఇలాంటి స్వచ్ఛ ప్రకృతి గీతమే.

"మింట బశ్చిమమున కంటికింపగుశోభ
నెరుపులో ప్రొద్దుగ్రుంకెడిని వడిని
అంతలో నా యెగ్రనందంబు, చందంబు
పంటకాలవనీట ప్రతిఫలించు
ప్రతిఫలించెనో లేదో యతిసముంచితవృత్తి
మందమారుతము లందద, కలచు;
కలచినపాటున గడనున్న నామది
సరసకవితాభావ సౌఖ్యమూను;
సౌఖ్యమూనిన యపుడ యాశాంతమునను
తన్మయుడనౌచుగందు నస్తమయవేళను
విందు రాత్రి నిశ్శబ్దంబు విశ్రుతముగ
నీటికిని గాలికందని నియతి మెరయ!

—ప్రకృతి చందనము.

ఇలాంటి స్వచ్ఛసుందర ప్రకృతివర్ణన పరమైన ఖండకావ్యాలు కవికొండలవారి కవితలో చాలా చోట్ల కనిపిస్తాయి.

## జానపదకవిత

కేవల ఆంధ్రదేశ ప్రకృతి సౌందర్య వర్ణనలోనే గాక ఆంధ్రదేశీయులైన జానపదుల ప్రకృతి వర్ణనలో కూడా వీరనేకమైన అత్యుత్తమ ఖండకృతులు రచించారు. అయితే అనుదినము గభీరసహిష్ణుతతో జీవయాత్ర సాగించే ఈ పల్లెప్రాంత గ్రామికులలో తమ దుర్భర స్థితిని గూర్చిన దుఃఖం గాని, ఇంతకంటె ఉత్తమస్థితికి పోవాలనే తీవ్రమైన విప్లవావేశం గాని, మరో దివ్యప్రపంచం మేదో సృజించుకోవాలనే తహతహ కాని ఎంతమాత్రం కనబడవు. జీవిత దుర్భర భారంతో కుంగిపోతున్నా—ముం దుదాహరించిన ముసలితాతలాగ—వీ రలాగే జీవనయాత్ర సాగిస్తూంటారు. అయినా ఒక్కొక్కప్పుడు వారిలో ఉత్సాహావేశము, ఒకప్పుడు విషాదమిశ్రితమైన హాస్యము, మొదలైన భావాలుకూడా అగ్ని మాతూంటాయి. వారి సహనము, ఓరిమి పర మనకీ ప్రజ ఒకొక్కప్పుడు మహోన్నత మూర్తుల్లా భాసిస్తారు. అయితే కవికొండలవారి జానపద కవిత చదువుతూంటే మనకీ కవి కేవలము ఆదర్శవ్యక్తులను సృష్టించినట్లెక్కడా స్ఫురించదు. ఈ జనం అంతా మనకు నిత్యము కనిపిస్తూనే ఉన్నారనీ వీరి కవితలోనే ఆ ప్రజలో ఉన్న మహత్త్వం ప్రప్రథమంగా మన కిప్పుడే స్ఫురించినదనీ ఆశ్చర్యపడతాము!

ఈ క్రింది ఖండకృతిలో జంతికలమ్మే వృద్ధురాలు సన్నాయిసాధనచేసే మంగలి కుర్రవాణ్ణి ఉద్దేశించి పలికిన ఈ హాస్యోక్తి ఆమె జీవితానికే గాక ఆధునిక కవితా వాఙ్మయాని కంతటికీ వెలుగుదివ్వెలా మెరిసిపోతుంది!

"మంగలి కుర్రవాడొకడు
మక్కువ బ్రాత సనాయిజోడుపై
బొంగురుతంబు, సన్నసుతి
పుట్టుచు గిట్టుచు నట్టు కొట్ట,
గా లింగడు బూరటించి యొక లీలను,
బట్టమి నొక్కలీల బా
డెంగద వాని యింటి పెరటన్
నడువీథికి మారు మ్రోయగన్.

గొడుగటు లాకు లొత్తుగను
గూడిన గుజ్జుతురాయి క్రింద న
య్యోడ, నిలుపాంత పొంచి యొక
వృద్ధ వితంతువు, జంతి కొక్కట
మ్ముడువడ కట్టియుండ, దన
ముందది పెట్టుక పుట్టెడాస వే

చెదు; నొక యాతకుంచె వెడ
　　నిట్టటు సీగల దోలుకొంచు నా
దిదకు వినంబడెన్ సరస
　　బిల్లని పాట దినాంతరాగమై!
సాయము సంగెవేగ నలి
　　సన్నగ నైవను సెంగుజేర్చు కొం
చాయవ వింమువిందు మనమం
　　దది యెట్టిది కాదలంచెనో!
ఓయయ! పాడుచుంటివిర యొప్పుగ!
　　నాదగు పెండ్లివేళ స
న్నాయికి నిన్ను బిల్వవలెరా! యని
　　యాడెను! నిస్పృహా స్మృతిన్!

—ప్రకృతి చందనము.

ఈ క్రింది గీతంలో కళ్ళంలో ధాన్యపుగింజ లేరుకునే ముసలిది చెప్పిన సూక్తి, సుజాత పాయసంతో సంతృప్తుడైన గౌతమబుద్ధుని సూక్తిలాగ అతి గంభీరంగా వినిపిస్తుంది.

"ఏటికో యవ్వ! యింక నీవిందు మగలు
చున్న దాన వదేమిటో యుండియుండి
చెరగు కొనుచుంటి వూర్చి వేసిన పొలాన!
కళ్ళ మైపోయె! నేమియు గానబడదె,
నీదు దారిద్ర్య మిందు గణింప నకట!
వృథగ శ్రమపడుచుంటివో వృద్ధురాల!
బండ్లమీదను దోలించి వడ్లరాశి
దద్దళపు గాడె నిండించె పెద్దకాపు!
కోత నూర్పుడు కూలీలు జీతములని
కట్టలెల్లను, కొట్టుక యట్టె చనిరి!
మిగిలినది యింత యుండిన మెలపురుదుడిచి
యింటి మాలది కొంపోయె నుంటికంట!
దోచుకొనిపోయిన విధాన దోచుమండె
వట్టిదయి ఈ స్థలం బిందుఁగట్ట నీకు
దొరకు నది యేమి? యూరక కరకు టెండ
గాసిలుచు నుంటివి వార్ధకమున ననుచు
నొంటరిగ నొక్కచో బొల్లు నొకటజేర్చి
చేట నూడెడు ముదుసలి స్త్రీ నొకర్తు
గాంచి పలికిన, నాపె వికాసమూని,
'మాపటికినివ్వి నాపొట్ట మాత్రమునకు
జాలవా?' యంచు దనయొడి గ్రాలుచున్న
ధాన్యమునుజూపి తెలిపె బేదరికమునక:
'బాబు! నేనును నింకిందు వదలివేయు
ప్రాలుమాలిన తుక్కునా పక్షులెల్ల
ఫడయగల వాత్మభుక్తిని వలయునంత:
అమల సంతుష్టికల్పకం బలరునట్టి
నాదు జనపదఫలితి మనంతమనుచు"

—ప్రకృతి చందనము.

అయితే ఇలాగ దారిద్ర్యాది ఘోరాలతో కుంగిపోతున్న పీడితులను శ్రీ వెంకటరావుగారు నిత్య సంతుష్టులుగా చిత్రిస్తున్నారని అనుకోకూడదు. ప్రాకృత జనం కష్టాలతో చితికి జీర్ణించిపోయిన తీరులుకూడా వీరి కావ్య సంపుటాలలో అనేకచోట్ల కనిపిస్తున్నాయి. కాని ఏ తీరులో వీరి జనాన్ని చిత్రించినా వీరందరు సంపూర్ణమైన జీవచైతన్యంతోను సహనంతోను తొణికిసలాడుతూంటారు.

ఈ క్రింది గీతంలో పచ్చగడ్డిమోపు ఆంబోతు తినివేస్తూంటె అడ్డువచ్చేవారెవరూ లేక నిస్సహాయురాలై విలపించే దీనురాలి ఆక్రోశము గుండె కదిలించివేస్తుంది. ఆపైన ఆమె నోదార్చే కూలివాని అమాయికత, అతని వృథావిశ్వాసము చూస్తే మన కాశ్చర్యం వేస్తుంది.

"ప్రొద్దునే పట్టినట్టి యా పెద్దముసురు
పట్టినది పట్టినట్లుండె వదలకుండ
రాత్రిపడి చీకుచీకటి క్రమ్ముచుండె
రాజమార్గంబు బందయ్యె ప్రాముకొనెను
పచ్చగడ్డి మోపులతోడ బలువురాండ్రు
నిలువబడినార లంగడి విలుచుకొనుచు
వారిలో వృద్ధురాలొకర్తు కోరసిల్లి,
యాత్రమున నేకలిపు దాను నందరి వన
మోపు కొనబిల్చు వారి మున్ముందు కెట్టి
'మంచిమోపనుకొని యే రెంచి కొంద్రు
చీకటిక బడె వాన చీకాకు హెచ్చె
నేరి గొనువారి గాంచదా వృద్ధురాలు
ఆపె మున్ముందు మోపుతో నాసకొద్ది
వేచియుండెను కడసారి జూచిపోవ.

అంతలో పెద్దయాబోతు మంతనమున
వచ్చి మోపును గొరికి కొమ్ముమ్రచ్చుపడగ
మేసిపోయె; నెవ్వరు కల్గజేసికోరు!
వృద్ధురాల్ సుంతయు న్నేరదే మరల్ప.
చిమ్మపార వేసిన చినిచిన్ని కట్లు
చేతబట్టుక చీకటి రాత్రి, వాన,
నేడ్చుచింటికి బోయె నా వృద్ధురాలు!
'ఓసి సింహోదరప్పన్నె! ఊరుకోవె!'
యంచు వెన్గూలివాడనె! నారున ఝుష?"

వ్యావహారిక భాషలో రచించి 'దాసి గొడవ' అనే ఈ క్రింది గీతంలో ఛందస్సు, భాష ఒకదానికి

ఒకటి తోడై అంట్లు తోముకుని జీవించే దాసి దీన జీవితము, ఆమె నిస్సహాయ పరిస్థితి, ఆమెలోని అనురాగ గాంభీర్యము విస్పష్టంగా వ్యక్తీకరిస్తాయి.

### దాసి గొడవ

అరి కీరి కంట్లుతోమి,
    అప్పలమ్మ అసురసంజ
ఇంటికేగ కంటిఎరసు
    గుప్పుకంపు కొట్టుకొను
    జోగులన్న సాక్షి నిల్లు!
"ఒసి! అప్పి! ఒసి ఒలె!
    ఇల్లరాయె! గుల్లలేవె?
నేను ఖైదు కేగితేను,
    నీకు మగని సోకువట్టె!
కంకణాల కనకమేదె?
    తీగయేదె? వేగతేవె!
నేను ఖైదు కేగితేను?
    నీకు మగని సోకువట్టె?
అప్పలాము, అమీనయ్యా
    అరుగుమీద అరుగో సూడె!
నాకు సంకె లేసితేను
    నీకు మగని సోకువట్టె."
అనుచు వాడు అడిగెనాలి

    చప్పుచపున సన్నసన్న
తీగ తీసి తీర్చెనప్పు,
    అప్పికెంత అధిక ప్రేమొ!
తీగపోతె పోయెగాని
    మగడు దక్కెననుచు పొంగె
తీగె యేదె యంచు నడుగ
    దిస్సమొసె మరునా డెప్పి
అంట్లు తోముువారి ఇంట
    చెప్పినదిగ 'అమ్మగారు!
జూదమాట త్రాగుడెప్పు
    డన్నియున్నవాడు వచ్చి
ఖైదుకెల్ల? ఒలెయన్న
    కరిగి మనసు కాసుతీగ
ఇచ్చివేసి తీర్చినాను.
    ఇచ్చివేసి తీర్చినాను'
అనుచు చెప్పె నట్టె కంట
    తొణకె సిగ్గు! తొరగె నీరు!

—కలరుతము.

ఇలాగ శ్రామికజనం దైన్యావస్థ చిత్రించే గీతిక లెన్నైనా వీరి ఖండకావ్య సంపుటాల్లోనించి ఉదాహరించవచ్చును.

ప్రకృతి కవిత్వము, జానపద కవిత్వము వెంకటరావుగారు ఆధునిక కవితామార్గంలో తీసుకునివచ్చిన వినూతన ప్రస్థానాలు. ఆధునికకవులలో దువ్వూరి రామిరెడ్డి, సత్యనారాయణగారు, రాయప్రోలు సుబ్బారావుగారు ప్రకృతి పరమైన కావ్యాలు కొన్ని రచించారు. ఇంకా కొందరు అధునాతనులు అప్పుడప్పుడు ప్రకృతిపరమైన ఖండకావ్యాలు కొన్ని వ్రాశారు. అయితే కవికొండల వారి ప్రకృతి కవితలో ఉన్నంత విషయ వైవిధ్యం గాని, విస్తృతి గాని, సహజత గాని మిగిలినవారిలో కనబడవు. అధునాతనకవితా వాఙ్మయంలో ప్రకృతి కవితకొక ప్రత్యేకస్థితి, గౌరవము కల్పించి ప్రత్యేకంగా 'ప్రకృతి కవిగా' గణ్యత పొందినవారు వీరొక్కరే.

### ప్రజాకవిత

ఈ రోజుల్లో మార్క్సిస్టు దృక్పథంతో శ్రామి గురించి వ్రాసే కవితకు ప్రజాకవిత్వమనే పేరొకటి వచ్చింది. ఈ తరహా కవిత్వంలో శ్రామికులలో వర్గచైతన్యం కలిగించి, తద్వారా వర్గరహిత సమాజ స్థాపనమే ఒక ప్రధానవిషయంగా స్ఫురిస్తుంది. అయితే ఈ తరహా రచనలలో కవిత్వస్థాయికి వచ్చిన రచనలు చాలా స్వల్పంగా కనిపిస్తున్నాయి.

వీటిలోనైనా శ్రామికుల దైనందిన జీవితంలోని కష్టసుఖాలతినిశితంగా అవగాహన చేసుకున్న రచనలు చాలా తక్కువ. ఈ తరహా కవితలో ఇద్దరు ముగ్గురు కవుల ఉత్తమ రచనలు విడిచివేస్తే, మిగిలిన వారి శ్రామిక కవిత్వం అంతా వట్టి ఏకతార ధోరణిలో పడి నానాటికీ దిగనారుకు పోతున్నది.

కవికొండల వారు శ్రామికులను, జానపదులను గురించి వ్రాసిన కవితలో మార్క్సిస్టు దృక్పథం లేకపోవచ్చును. నిజానికి ఈ విషయంలో వీరికి ప్రత్యేకమైన రాజకీయ, సాంఘిక సిద్ధాంతాలేమీ లేవు. సహజము, సరళము అయిన శ్రామికుల దైనందిన జీవన దృక్పథమే వీరి కవితలో ప్రతిఫలిస్తుంది. వీరి శ్రామికులలో నేటి పారిశ్రామిక కార్మికులు (*Industrial Proletariat*) చాలా తక్కువ. వీరయినా తమ దైనందిన కష్టసుఖాలు యాదృచ్ఛికంగా స్వీకరిస్తూ శ్రమిస్తున్నట్లే కనిపిస్తారుగాని మరి వీరిలో వర్గ కలహ సిద్ధాంతాలు గాని, తద్వారా వచ్చిన అశాంతి గాని, అలజడి గాని ఎక్కడా కనిపించవు.

కాని పల్లెవారు, కోతకూలీలు, రోజు చాకిరిజేసే జనము, కర్షకులు, పడవసరంగులు మొదలైన గ్రామికులెందరో తమ కష్టసుఖాలతో మాటిమాటికీ వీరి కవితలో ప్రత్యక్షమౌతుంటారు. నిజానికి సామాన్య గ్రామికజనంతో తాదాత్మ్యం పొంది వారి కష్టసుఖాలు అతి సన్నిహితంగా తమ కవితలో చిత్రించిన కవులలో శ్రీ వెంకటరావుగారు ప్రప్రథములు. అయితే ఈనాటి అభిరుచులు కొన్ని అతివిచిత్రమార్గాలలో నడుస్తూండడంవల్ల, ప్రజాకవిత అనే పదానికి చాలా సంకుచితమయిన అర్థం ఒకటి స్థిరపడిపోయింది.

ఈ క్రింది గీతం పరిశీలిస్తే తెలుగుదేశంలో జీవించే ప్రాణికోటి 'బ్రతుకుసందడి' ఇంత సన్నిహితంగా వినగల అద్భుతశక్తి ఈ కవి కొక్కరికే లభించిందా అనిపిస్తుంది!

### ప్రాణికోటి బ్రదుకుసందడి

'పడవ నీటిచీలి నడువ
పడవలోన బండుకొంటి
కూర్కులోన గోర్కె వింటి
పడవ క్రిందనీటి రుతము!
బండి బాట వడిగ దోల
గడు కొయ్యను జేర్లబడుచు
ఒక్క కునుకుపాటులోన
వింత వింటి జక్రరవము!
లోకయాత్రలోన సతము
ఆకసంబు నరసికొనుచు
శాంత తన్మయుండనుగా
చెవులపండువుగను వింటి
ప్రాణికోటి బ్రదుకు సందడి!'

-కలరుతము

### బాలకవిత

వీరి కవితలో కుమారకంఠము, నెలబాలుడు, చదువుల దుత్త, చిట్టికైత అనే ఖండకావ్య సంపుటాలు నాలుగు ప్రత్యేకంగా చిన్నపిల్లల కవిత్వానికి సంబంధించినవి. పెద్దతరంవారిలో ప్రత్యేకంగా చిన్నపిల్లల నుద్దేశించిన కవిత్వం విరివిగా వ్రాసినవారు వీరొక్కరే. వీటిలో కొన్ని చిన్నపిల్లల మానసికస్థితి ననుసరించి ఆయా విషయాలపై వ్రాసినవి. మరికొన్ని శిశువుల నుద్దేశించి వ్రాసినవి. మిగిలిన కవిత్వంలోలాగే దీనిలోకూడా విషయవైవిధ్యం ఎక్కువే. దీనిలో వీరి ప్రకృతి కవితలోను, జనపద కవితలోను వచ్చినంత ఉత్తమ కవిత ఎక్కువగా కనిపించకపోవచ్చును.

కాని ఈ పాటలలో చిన్నపిల్లలు సులభంగా పాడుకోడానికి అనువయిన పాటలు, పురాణగాథలు మొదలుకొని, ఆయా తరగతులలో చదువుకొనే పిల్లలదాకా, అందరు చదువుకోడానికి వీలయిన [illegible] ఎన్నో కనిపిస్తాయి.

ఇవిగాక ఈ కవి స్వయంగా శిశు స్వభావం చిత్రించిన రచనలుకూడా ఈ ఖండకావ్యాలలో ఎక్కువగా దొరకుతున్నాయి. ఈ సందర్భంలో ఈ క్రింది గీతికనుబట్టి వీరి శిశుకవితాస్వభావం గ్రహించవచ్చును.

'ఆకలినివార్వ బిచ్చగాడని తలంత్రో!
ఒక్క గ్రుక్కెడుపాలకై యక్క సేరి
మాతృహృదయ వాత్సల్య విభూతి నెల్ల
కొల్లలాడంగ వచ్చిన కొంటెపాప!

మైని వలి బెట్టుటను దిగంబరిగ నెంత్రో!
జీర్ణవసనంపు సెజ్జకై చెంతబండి
తల్లిచేతి చలువనెల్ల తా హరింప
బొంచి నిదురించు చిన్నరి పుట్టుగ్రుడ్డు!

పలుక నేరమి మూగంగ బరిహసింత్రో!
ఉత్తమొడిలోన గులుకుచునుండి యించు
కడుగకయె యమ్మదయనెల్ల బడయజాలు
వింత మాహాత్మ్యముగలట్టి పిన్నవాని!'

—నెల బాలుడు.

### దేశభక్తి

ఈ కవి దేశభక్తి ధోరణిలో వ్రాసిన రచనలన్నీ మాతృదేశ సంకీర్తనములో కనిపిస్తున్నాయి. వీటిలో 1919 లోనే వీ రాంధ్రరాష్ట్రంమీద రచించిన గీతం ఒకటి కనిపిస్తున్నది. దీనిలో మొట్టమొదటి చరణంలో వీరిలాగ అంటున్నారు.

'ఎవ్వరెవ్వరికెట్టె కలిసిన
తెనుగు నుడువులు తీయమారెడు
తెనుగు పాటలు తేనెగారెడు
తెనుగు తలపులు తేటదేరెడు
వారివారి నివాస భూముల
కేకనామం బిడ దగున్
ఆంధ్రరాష్ట్రం బనదగున్.'

—మాతృదేశ సంకీర్తనము.

ఆంధ్రరాష్ట్రం వచ్చినా ఈ కవి ఈ గీతికలో ఆశించిన విశాలాంధ్రం ఇంకా దూరదూరంగా ఉన్నట్టే కనిపిస్తున్నది. ఇలాగే వీరు శాంతి, భారతాంబ, జాతీయ పతాకము, మొదలైన శీర్షికలలో

ఆయా ఆవేశ సమయాలలో ప్రబోధ ప్రధానమయిన గీతిక లెన్నో రచించారు. ఈ గీతికలన్నీ ఈవేళ తిరిగి చదువుతూంటే చాలావర కివి ప్రచారాత్మకంగానే వినిపిస్తాయిగాని వీటిలో కవిత్వస్థాయికి వచ్చిన రచనలు చాలా తక్కువ.

కాని వీరి ప్రకృతికావ్యాలు, జానపద గీతికలు చదువుతూన్నప్పుడు మనలో ఆంధ్రదేశ ప్రకృతి పరిసరాలమీద, జానపదులమీద, మాతృదేశంమీద గౌరవాదరా లినుమడిస్తున్నాయి. నిజానికి ప్రత్యక్షంగా ప్రబోధించే వీరి దేశభక్తి గీతికలకంటె ఈ కావ్యాలే వ్యంగ్యంగా మన మనస్సుల్లో ఉత్తమ దేశభక్తి గౌరవా లుద్భవింప జేస్తున్నాయి.

## శిల్ప దృక్పథము

ఈ కవి శిల్ప దృక్పథం విమర్శన చేసే ముందు దీనికి గల పూర్వరంగం కూడా కొంతవరకు అవగాహన చేసుకోవడం అవసరం. శిల్పదృష్ట్యా పరిశీలిస్తే గురజాడ కవి మొదలుకొని నేటిదాకా వచ్చిన కవిత్వం అంతా రెండు విధాలుగా విభజించవచ్చును. సాంకేతికంగా దీనిలో మొదటిదానిని మార్గశిల్పమనీ రెండవదానిని దేశిశిల్పమనీ అనవచ్చును.

గురజాడ అప్పారావు, బసవరాజు అప్పారావు, అడివి బాపిరాజు, కవికొండలవారు, నండూరి సుబ్బారావుగారు, ఇటీవల అభ్యుదయ కవులు రచించిన కవిత్వం అంతా ఈ దేశి శిల్ప పరిగణనలోనికి వస్తుంది. వేంకటపార్వతీశ్వర కవులు, తిరుపతి వేంకటకవులు, రాయప్రోలు సుబ్బారావుగారు, కాటూరి వెంకటేశ్వరరావుగారు, పింగళి లక్ష్మీకాంతంగారు మొదలైనవారి కవిత మార్గ శిల్పంలో చేరుతుంది.

ఈకవులందరు ఒక్కొక్కప్పుడు దేశిమార్గంలోగాని, మార్గధోరణిలోగాని కొన్ని కృతులు రచించి ఉండవచ్చును. కాని కొంత నిదానంగా పరిశీలిస్తే వీరి శిల్ప దృక్పథం నిర్ణయించడం సుకరమే. కాలపరిణతిని బట్టి వీరి వర్ణ్యవిషయాలు బాగా మారిపోయి ఉండవచ్చును. గురజాడ అప్పారావు రచనలకు, నేటి అభ్యుదయ రచనలకు వర్ణ్య వస్తు విషయంలో చాలా భేదం కనిపిస్తుంది. కాని శిల్పదృష్ట్యా వివేచిస్తే నేటి అభ్యుదయ కవులందరికీ గురజాడకవి కొంతవరకు ఒరవడిపెట్టారని చెప్పవచ్చును.

కవికొండలవారు మార్గ కవితాధోరణిలో వృత్తాలు, జాతులు మొదలయిన సాంప్రదాయిక చ్ఛందస్సులు, కథావస్తువులు తీసుకుని చేసిన రచనలు చాలా ఉన్నాయి. కాని, వీరి కవిత్వం అంతా చదివితే వీరి దేశీశిల్పదృక్పథం విస్పష్టంగా కనిపిస్తుంది.

ఈ దేశీ శిల్పధోరణిలో కొన్ని ముఖ్య లక్షణాలున్నాయి. దీనిలో భాష, ఛందస్సు చాలావరకు జానపదుల భాషాచ్ఛందో మార్గాల్లో నడుస్తాయి. పలుకుబడిలో సాంప్రదాయకమయిన అలంకార విన్యాసం చాలా తక్కువ. భాషా చ్ఛందస్సుల ననుసరించి వర్ణ్యవిషయాలుకూడా జానపదులు, గ్రామికులు మొదలయినవారి జీవిత పరిసరాలకు సన్నిహితంగా వెళ్ళిపోతాయి. కవిత లలిత పద బంధాలు సంతరించుకొని, సూటిగా వెచ్చవెచ్చగా హృదయానికి హత్తుకున్నట్లు ధ్వనిస్తుంది. ఈ గుణాలవల్లనే ఈకవిత మార్గ కవితకన్న ప్రజాసామాన్యానికి బాగా దగ్గరగా ఉంటుంది. గురజాడకవి మొదలుకొని నేటి వరకు వచ్చిన దేశి కవులందరిలోను చాలావర కీలక్షణాలు కనిపిస్తున్నాయి. కవికొండల వెంకటరావుగారు రచించిన జానపద ప్రకృతి కవితావిభాగాలలో పైన చెప్పిన లక్షణాలన్నీ కనిపిస్తున్నాయి.

వెంకటరావుగారు సాంప్రదాయిక చ్ఛందస్సులు, వివిధములైన మాత్రాచ్ఛందస్సులు వాడారని అనుకున్నాము. ఈ మాత్రాచ్ఛందస్సులలో కొన్ని సహజంగా ప్రాకృతజనం వాడుకునే ఏలపాటలు, జోలపాటలు మొదలైన గీతికల ధోరణిలో నడుస్తాయి. మరికొన్ని వర్ణ్యవిషయాన్ని బట్టి, స్వయంగా కవి సృష్టించిన నూతన చ్ఛందస్సులు. ఈ విధంగా నూతన చ్ఛందస్సు లుపయోగించడంలో వీరు చాలా జాగ్రత్త తీసుకుంటారు.

అయితే వీరి రచనలలో వృత్తాలు, గేయాలు మొదలైన చ్ఛందస్సులు నడిపించడంలో శిల్పదృష్టి చాలా తక్కువ. నేటికాలంలో కొందరి కవుల రచనలలో శిల్పం విషయంలో చాలా నిశితదృష్టి కనిపిస్తుంది. ఈ దృష్టి ఒకొక్కప్పుడు వెర్రితలలు వేసి, వీరి రచనలు వట్టి మాటల గారడీల ధోరణిలోనికి దిగనారుకు పోతూంటాయి. కవికొండలవారి కవితలో, స్ఫుటంగా కనిపించే శిల్పవిన్యాసం లేని సరళత్వమే వీరి కవిత్వాని కొక మహత్తరగుణంగా స్ఫురిస్తుంది. కాని కొన్నిచోట్ల ఈసరళత్వం బాగా సడలిపోయి, పాఠకులకు వీరి రచనలు పేలవంగా వినిపిస్తాయి.

అల్లాగే ఆయా విషయాలు, ప్రకృతి పరిసరాలు వర్ణించే ఘట్టాలలో కొన్నిచోట్ల, వర్ణనలోను, కథనంలోను జిగి బాగా తక్కువై రచనలు చాలా సామాన్యమైన ధోరణిలోకి దిగిపోతాయి.

వీరి ఖండకావ్య సంపుటాల కూర్పులో కూడా నిశితమైన విమర్శదృష్టి కనబడదు. అందుచేతనే వీటిలో అతి సామాన్య రచనలు మొదలుకొని, అత్యుత్తమ రచనలవరకు అన్ని రకాల ఖండకావ్యాలు కలగాపులగంగా కలిసిపోతూంటాయి. ఒక్క ప్రకృతిచందనంలో మాత్రం ఉన్నవన్నీ చాలావరకు ఉత్తమరచనలే. మిగిలిన సంపుటాలలో కొన్నిటిలో చాలా రచనలు సామాన్యంగా ఉంటాయి. కాని వాటి మధ్యన కనులు మిరుమిట్లుగొలిపే ఖండకావ్య రత్నాలు మెరుస్తూంటాయి!

ఈ రత్నాలన్నీ ప్రత్యేకంగా చేర్చి ప్రకటిస్తే ఇవి మొత్తం వీరి రచనలలో మూడో వంతు దాకా వస్తాయి. సామాన్యపాఠకులనేకులీ విషయం గమనించలేక వీరి రచనలన్నింటికి ఒకే విధంగా విలువ కడుతూంటారు. రచనా బాహుళ్యమున్న కవులందరిలోను కొద్దిగానో గొప్పగానో కవితలో ఇలాంటి తారతమ్యం కనిపిస్తూనే ఉంటుంది. అయితే కవికొండలవారిలో ఈ తారతమ్యం బాగా స్పష్టంగా కనిపించిపోతుంది. ఈ కారణం వల్ల ఉత్తమ రచనలనీ, సేకరించి, ప్రత్యేక సంపుటంగా ప్రచురించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

విషయ వైవిధ్యము, రచనా బాహుళ్యము, సారళ్యము, గభీరత మొదలైన ఉదాత్త కవితా శక్తులను బట్టి పరిశీలిస్తే వీరు పెద్దతరం కవులలో అత్యుత్తమ శ్రేణిలోకి వస్తారు.

వీరి కవితా హృదయం 'మాంసలాంసమున జొనిపిన మహతి' వంటిది. విశాల విశ్వంలోని చిన్న గడ్డిపరక మొదలు, శివతాండవం వరకు సమస్త విషయాలు వీరి కవిత్వావధుల్లోకి వచ్చివేస్తాయి. వీరు తమ కవితా సంపుటి కొక దానికి ప్రత్యేకంగా విశాల విశ్వమనే పేరుకూడా పెట్టారు. ఈ కవి జీవిత దృక్పథము, ఆధ్యాత్మిక దృక్పథము విశాలవిశ్వంలా విస్తరించడం వల్లనే వీరింతటి ఉత్తమ కవిత్వసృష్టి చెయ్యగలిగారనిపిస్తుంది.

వెంకటరావుగారిలో విషయవైవిధ్యం విస్తారంగా ఉండడంవల్ల, ఎంతగా ఎన్ని విషయాలు స్పృశించినా, ఇంకా కొన్ని ముఖ్యవిషయాలేవో విడిచివేసినట్టే అనిపిస్తుంది.

ఈ మధ్యన మన కవితావాహిని ఇరుకుదారుల్లో పడి, ఎండిపోతున్నదేమోననే అనుమానం కలుగుతున్నది. కవికొండలవారి మార్గంలో విస్తృతమైన కవిత్వ ప్రగతికి వలసిన సూచన లెన్నో కనిపిస్తున్నాయి. ముఖ్యంగా యువకవులకు వీరి రచన లెన్నో విధాలుగా వెలుగుదారులు చూపిస్తున్నాయి. అవి యువకవు లనుసరించినా, అనుసరించకపోయినా వీరి కవిత్వ పరిపూర్ణత పరిశీలిస్తే అదే హృదయానికొక నవనవోన్మేషం కలిగిస్తుంది!

సహజంగా ఈ నవనవోన్మేషదృష్టితో జీవితం పరిశీలించడంవల్లనే ఉత్తమ కవిత్వం ఆవిర్భవిస్తున్నదని కవికొండలవారి క్రింది గీతికలో ప్రవచిస్తున్నారు.

### రాగోదంతము

"ఈ ప్రపంచమునంతను నెర్రని జిగి
పూసిపూరించి తన లేత పొద్దుపొడుపు
సొగసు చూపింపవలెనన్న సూర్యుడు మును
తనదు బింబంబు సర్వస్వమును జిగిర్చి
వెలయగావలె, లేకున్న కలుగదు జిగి;
సాధుసర్వంసహా చక్రజైత్రశోభ
రాగ మొలికింప సమకట్టి, రాగమెత్తు
కవియు నంతేను; అతగాని ప్రవిమలహృది
సర్వ మనురాగ భరిత నిగర్వసూక్తి
నిండిపోవలె మునుముందు, నెగడు పిదప
జగము తనయంత నలసూక్తి చక్కని సిరి!"

—ప్రకృతి పాంచజన్యము.

దిఙ్మాత్రంగా చేసిన వీరి కవిత్వ పరిశీలన పాఠకులలో కవికొండలవారి కవితయెడల ఆదరాభిమానాలు పెంపొందించగలదనీ తద్ద్వారా ఆధునిక కవిత నవనవోన్మేషంతో రేకెత్తగలదనీ ఆశిస్తున్నాను.

# అభిసారిక

'పఠాభి'

ప్రియునిగలియు కోరిక
లాగగ సుడిరీతిని,
రయమున నభిసారిక
పోవు రాజవీథిని !

అతి నీరవము నిశీథము,
నిలిచింది విహాగ గీతము,
భయదమ్మౌ రజనిభూతము.
అయినను, నిలుప వచ్చినాతిని,
రయమునపోవ రాజవీథిని,
ప్రియునిగలయుకోరిక లాగగసుడిరీతిని !

పాటలువిని యామిని
పరుగులిడు భుజంగము
లాగ, చనును కామిని,
కోరి సఖుని సంగము.

అలసింది మందపవనము
నిదురిల్లు సర్వభువనము,
రవములజేయు హృదిమృదంగము,
జరజర, పరుగులిడు భుజంగము
లాగున చనకామిని, కోరి సఖునిసంగము!

కామమటుల చీకటి
క్రమ్మియుంది భూమిని.
పోవు, వలపుటాకటి
త్రోపున, జవగామిని.

పదకంకణములుఘల్లన,
పులకించి తనువుఝల్లన,
విడిపింపబడిన విల్లన,
చవిగొన, ప్రియునిపెదవి ఆమని,
పరుగులుదీయును జవగామిని,
కామమటుల చీకటి, క్రమ్మియుండభూమిని.

యౌవన మధుపూర్ణము
తన మనోహరాస్యము.
అధర రక్తిమార్ణము
పయిన శ్వేతహాస్యము.
కని, గాలి పిల్లలందరు
వివశత్వమందియుం, దరు
తతిసందుల పడియుందురు.
ప్రకటనజేయ, హృద్రహాస్యము
తనదు కనన్మనోహరాస్యము,
అధరరక్తిమార్ణము, పయినశ్వేతహాస్యము.

# సుందరమ్మ అల్లుడు

శ్రీ షట్టి కృష్ణమూర్తి

## రాముం కథనం:

రాధకూ నాకూ చిన్నప్పుడే పెళ్ళయింది. అదే తడవుగా మా నాన్న నన్ను వాళ్ళపరం చేశాడు. అప్పట్నించీ వారింట్లోనే బ్రతికాను. అయితే చదువును చిన్నచూపు చూసిన వాణ్ణి కాదు గనుక ఆయేటి కాయేడు అడుగుముందుకు వేస్తూనే బి. ఏ. దాకా చేరాను. ఈ కాలంలో నా క్రింద ఖర్చైన డబ్బంతా—రాధ తల్లి—అంటే మా అత్తగారే—వాడేసేది.

అప్పట్లో వ్యక్తిత్వం అంటే ఏమిటో నాకు బొత్తిగా తెలియదనే చెప్పాలి. ఈ విషయమయ్యే అప్పుడప్పుడు నా మిత్రులు కొంత ఘాటుగా ప్రస్తావించినా, నే నంతగా పట్టించుకొనేవాడను కాదు. ఆ సంగతి చదువు పూర్తయి ఒక్కసారి జీవితంలోకి పర్యాలోకించిన తరువాతగాని నాకు పూర్తిగా ఆకలింపుకు రాలేదు.

ఆ క్షణంలోనే తెలిసికొన్నాను. ఈ యింట్లో రాధకున్న స్వాతంత్ర్యంకూడా నాకులేదనీ, తల్లీ కూతుళ్లిద్దరూ కలసి నన్నొక కీలుబొమ్మగా తమ చేతులందుంచుకొని ఆడింపజూస్తున్నారనీను.

ఆర్థికస్వాతంత్ర్యంలేని వ్యక్తి ఎంత అధముడుగా పరిగణింపబడతాడో నాకు రోజులు గడచినకొలదీ నెమరుకు రాసాగింది. కాస్తో కూస్తో చదువుకొన్నవాడినేమో ... నాకు సందేహంగా తోచిన ప్రతి విషయాన్నిగురించీ తీవ్రంగా ఆలోచించడం మొదలెట్టాను. నాటినించీ నా మిత్రులు చేసిన హెచ్చరికలన్నీ వాస్తవానికి యెంతమాత్రమూ దూరంకావని లోతుగా అర్థంచేసుకొన్నాను.

రోజులు గడచినకొలదీ నా వైఖరిలో, నా ప్రవర్తనలో క్రమంగా మార్పులు రాసాగినై. అతి తీవ్రరూపంకూడా ధరించాయేమో...

ఇది గ్రహించిన తల్లీ కూతుళ్లిద్దరిలోను, ప్రారంభమైన గుసగుసలు తీవ్ర ఆలోచనారూపం అధిగమించి ఆచరణలో అడుగు పెట్టసాగినై. నేను అంటే అంటనట్లు, ముట్టీముట్టనట్లు ప్రవర్తింప సాగాను.

ఘడియైనా ఆ కొంపలో స్థిమితంగా కూర్చొని ఆలోచించుకోవాలంటే నా చుట్టూ యేవో ఉక్కు తెరలు కమ్ముకొంటున్నట్లు దింముకుపోయేవాడిని. లేనిపోని పనులు కల్పించుకొని నే నక్కడున్న ఘడియలో నే కనీసం వందసార్లయినా తిరిగినట్లుండేది రాధ తల్లి.

ఆమె నా కళ్లబడగానే వొళ్ళంతా కారం రాచుకొన్నట్లయేది. చూపులతోను సంజ్ఞలతోను వారించుదామని యెంత ప్రయత్నించినా అదంతా వృథా అయిపోయేది. ఆ పాటి సూక్ష్మగ్రహణ శక్తి వారిద్దరిలో యెవ్వరికీ లేదు.

నేనాగదినుండి బైటపడి లక్ష్యం అంటూ వొకటిలేకుండా యే రైలుగోడ్డుకో పోయి ఒంటరిగా కూర్చొని యెంతకాలమో తల పగలగొట్టుకొనేవాడిని.

ఈవిధాన మూగబాధతో కొన్ని నెలలు గడిచాక పరిసరాలను పరిస్థితులను అర్థంచేసుకుని ఆకళింపుకు తెచ్చుకోవడం మొదలుపెట్టాను.

నాకు తెలిసినంతలో సైకాలజీని గురించి చాలా పుస్తకాలు తిరగవేసి చూశాను. అవసరం పట్టినప్పుడు కొన్ని కొన్ని విషయాలను సవిమర్శకంగానే చదివాను. అది నేటి ప్రభావమునైనా అనండి. నాలో పెద్దమార్పు వచ్చిందనిమాత్రం చెప్పగలను. నాకుగా నేను చెప్పుకోవాలంటే పుస్తకాలనించిగాక వాస్తవ ప్రపంచంనించే చాలా విషయాలు తెలుసుకోగలిగాను.

మధ్యమధ్య ఎవరేనా అనుకోవచ్చు; నా కింత కాలం రాధతో యెలా పొత్తుకుదిరింది? అని. నేనూ ఆ ప్రస్తావనలోకే దిగుతాను.

ఇంతవరకూ రాధతో నేనుకాని, ఆమె నాతో కాని మాట్లాడుకొని యెరగం. అంటే నేను పేరుకు గృహస్థును గాని నాదంతా నాతిగల బ్రహ్మచర్యం మాత్రమే.

అందుకే మాటామంతీ లేకపోయినా, నాను గురించి చాటునా, మాటునా, తల్లితో గుసగుసలాడుతున్నదనే నాలో మరింత అహంభావం పెచ్చుపెరిగిపోయింది.

రాధవిషయంలో నాకు మరొక అనుమానం కూడా సొడగట్టింది: తను ఆస్తిమీద అధికారం చలాయించినట్లు నామీదను స్వారిచేయడానికి తగిన ప్రాతిపదిక యీ గుసగుసల్లో యిమిడివున్నది, అని.

నేను గ్రహించినట్లే వాళ్ళూ పసిగట్టినట్టున్నారు. ఆ మరుక్షణంనించే వల పన్నడం ప్రారంభించేశారు. అది దారాలతో అల్లబడింది కాదు, అందులో ఉక్కుతీగల పనితనం యెంతైనా వున్నదని గ్రహించడానికి ఆట్టేకాలం పట్టలేదు నాకు.

ఇక్కడే మరో సంగతికూడా చెబుతాను. ఈ కలవరం ప్రారంభం కానంతవరకూ మా భావిజీవితాన్ని గురించి ఏవో బంగారు కలలు కంటూ వుండేవాడిని. రాధ నా సర్వస్వం, అనుకొన్నరోజులు నా జీవితంలో లెక్కకు తక్కువైనా కొన్ని లేకపోలేదు. అయితే ఇప్పటికు అప్పటి నాభావనా ప్రపంచమే లేదు.

ఏ విధమైన స్థైర్యమూ లేక పాదరసంలా పాకిపోయే మనసును సాక్ష్యంగా యెన్నుకోవడం సమంజసం కాదేమో...ఒక్కమాటలో చెప్పాలంటే 'పరాధీనబుద్ధి' అనే మాట నాపట్ల నూటికి నూరుపాళ్ళు సత్యమే. స్వంతంగా ఆలోచించి వివేచన చేసుకోగలశక్తి యెప్పుడు లేదో మనసు వశంలో లేదనటానికిదే ప్రబల సాక్ష్యం.

ఒక్కమాట—కాకిగోల, కాకిమూక...అనే మాటలు మన తెలుగు భూమిలో అఖండ ప్రచారాన్ని ఆర్జించుకొన్నాయనుకుంటాను. ఒకడు సుఖంగా కాలక్షేపం చేస్తూంటే యెవ్వడికీ గిట్టదు. కవ్వంతో మజ్జిగ చిలికిన చందంగా యెక్కడో, యే మూలనో, యెవ్వడి హృదయమో కల్లోలితం చెయ్యాలని కొందరు నిరీక్షిస్తూ వుంటారు. వారందరికీ కలిసివచ్చేదీ, కూడివచ్చేదీ లేకపోయినా తమ కర్తవ్యాన్ని మట్టుకు యథావిధిగా నెరవేర్చుకోక మానరు.

వారందరిదీ వట్టి కాకిగోలగానే గుర్తించి వర్తించగల తాహతు ఎదటి వ్యక్తిలో లేనప్పుడు వారి ప్రభావం యెంతగానైనా ప్రసరించి తీరుతుంది. అది సక్రమమార్గంలోనా, వక్రమార్గంలోనా? అని వివేచన చేసుకోగల మనస్థైర్యం లేని నాబోటి కించిజ్ఞుడి భావనా ప్రపంచం చిలవలు పలవలు అల్లుకోలేదు ఇంకా. కల్లా కపటాలకు ఆట్టే స్థానంలేదు. కళ్లకు కనబడినదంతా యథార్థమే అనుకోగల అమాయకత్వం నాలో గూడు కట్టుకొనేవున్నది. దానికి తగినట్లు సాంప్రదాయికమైన విశ్వాసాలు కూడా ఆశ్వాసాంతంలో పడలేదు. జీవితసమస్యల విషయం అసలే అంతు చిక్కలేదు. శూన్యత అనేదానికి అపరిచితుణ్ణే కనక యిది సహజమే ననుకొంటాను.

ఇలాంటి వ్యక్తావ్యక్తమైన అవస్థలోనే రాగోదయమైనదేమోనని నా అనుమానం. లేకపోతే రాధే నా సర్వస్వం, అనుకోగల్గినంత గాఢంగా నా గుండెల్లో యెలాంటి భావమూ నాటుకుపోయేది కాదేమో...

. కాలు జారిందల్లా నేనిక్కడే. లేకపోతే నా జీవితేతిహాసం మరో విధాన పరిణమించివుండేదేమో..

నాపైన నిఘా యెక్కువైందని లోగడనే విన్నవించుకొన్నాను కదూ? నేను వారికి చెయిదాటిపోయే పరిస్థితి యెప్పుడేర్పడిందో ఆ క్షణంలోనే వారొక తీర్మానానికి వచ్చివుంటారు. ఈ భారత భూమిలో అందరూ అనుకొన్నట్లుగానే వారూ నిర్ణయించుకొన్నారు.

ఒక్క విషయంమాత్రం నాకు ఆశ్చర్యాన్ని గొల్పుతూవుంటుంది "రాధ ఇంత సాహసం యెలా చేయగల్గిందా?" అని. కాని చివరకు సమాధానం దొరకకపోలేదు.

చిన్ననాటినించీ పెంచి పెద్దచేసిన వాతావరణానికి అందరిలాగే ఆమె కూడా దాసురాలయిందని, నాకు నేను చెప్పుకొనే సమాధానం. మున్ముందు నేనీ అభిప్రాయం మార్చుకొనే విషయంలో కాలం తీర్పుమీదనే ఆధారపడి వుంటాను.

తల్లి ఏపాటి విశాల దృక్పథం కలదైనా రాధ ఇలా తయారయివుండేది కాదేమో...ప్రస్తుతం వారి తాతలనాటినుంచీ వంశానుక్రమణికను ఏకరువుపెట్టి దాని స్వరూప స్వభావాల ఆద్యంతాలను వర్ణించి

వివరించా లనుకోవడం లేదు. సర్వసాధారణంగా అందరూ అనుకొన్నట్లే నేనూ భావించడంలో వైప ం యేమున్నది?

నాకుగల కొద్దిపాటి స్వాతంత్ర్యాన్ని హరించడానికే వా రుభయులూ ముంజేతులకు కంకణాలు బంధించకపోతే, ఆ తల్లి చెప్పడం, కూతురు ఆచరించి చూపడం—ఇదంతా ఒక ప్రణాళిక జతపర్చుకొన్నట్లు జరిగేదికాదు—

జీవితం గడుస్తున్నకొలదీ అది అంతకంతకూ సుఖవంత మౌతుందనే ఆశ లేనినాడు, ఎవ్వడూ కలకాలం బ్రతకాలని కలలు కనలేడు. తనకు తానై బ్రతుకు విలువలను నిర్ణయించుకోనూ లేడు. ఈపాటి జిజ్ఞాస వారికి ఏకోశానా వుండదు; అందుకు అవకాశమూ లేదు.

ఏదో వొకవిధమైన అహంభావం వారిని మొదట్నించీ పట్టి పీడిస్తున్నదని నా విశ్వాసం. దానిని ఇతరులమీద కసి తీర్చుకోడానికి ప్రయోగించి సఫలత నందుకోగల్గిననాడే వారు జీవితంలో మహోదాత్త లక్ష్యాలు నెరవేర్చుకొన్నట్లు భావించగలరు. అప్పటి వాళ్ళ ఉత్సాహకర ప్రవర్తనలు చూస్తే పూర్వాపరాలకు గల తేడాలు స్పష్టంగా కానవస్తూవుంజాయి. ఏపాటి ధైర్యసాహసాలతో ముందడుగు వేయగల్గుతున్నారో కూడా తెల్లమౌతుంది.

పైకి కనబడే యీ నూతనోత్తేజమంతా వాళ్ళంతట వాళ్ళే సృష్టించుకొని, పెంపుచేసుకొని తమమీదకు ఆవేశింప జేసికొన్నట్లు స్పష్టమౌతుందిగాని, ఎవటి వ్యక్తిని నూటికి నూరుపాళ్ళూ గుప్పెట్లో పెట్టుకొని ఆడించగల్గారా? అంటే అది అనుమానాస్పదమే. ఈ సంగతినే లోకం అర్థంచేసికొన్నట్లు వాళ్ళూ ఆకళించుకొంటే ఇంతటి శ్రమపడే ఆవశ్యకత ఉండేది కాదేమో...

వారే ఆవిధాన చేసివుంటే నేనిదంతా యెక్కణ్ణించి తవ్వుకొచ్చి వ్రాస్తాను? దీనితో నా కలానికి పనీ వొచ్చింది; నా జీవితానికి వెలుగూ చేకూరింది.

సర్వసాధారణంగా సంసారాల్లో జరిగే సంగతులన్నీ కాగితం యెక్కినప్పుడే కొత్తవిగా భాసిస్తాయి. కాని అందులో పడి మునగానాం, తేలానాం, అయే వాడికివి అంతగా ఆలోచనను చేకూర్చిపెట్టవు. ప్రస్తుతం నేనా అవస్థను అధిగమించా ననుకొనే యీ గోడంతా వెళ్ళబోసుకోవడం ప్రారంభించాను.

అనుభవించినవాణ్ణే నేను కనుక నన్ను నేను మర్చిపోయి కొంతకాలంపాటు మీతో కలిసి చదువుకొందా మనుకొంటున్నాను. ముందు వ్రాసి తర్వాత నే నాపని తప్పకుండా చేస్తాను.

జీవితానికి లక్ష్యాలు, ఆదర్శాలు అనేవి ఖచ్చితంగా యేర్పరుచుకోలేదు నే నింకా—కాని అజ్ఞాతమైన యేదో వొక మూగబాధ మటుకు నన్ను క్షణక్షణానికీ వేధించసాగింది.

సాధారణంగా అంటూవుంటారు...అభిమానం దెబ్బతిన్నది: అని. అలాటి దేదో నాలో జరిగిందనే అనుకుంటాను. పంతా లుడిగి ప్రకృతికి అతీతమైన భావనాపటిమను అలవర్చుకొన్నవాడను కాదు కనుక అనుక్షణానికీ యేదో బలవత్తరశక్తి కళ్లెంవేసి లాగుతున్నట్లు పెనుగులాడుతూ వుండేవాడిని. అయినా వొక్క విసురుకే విముక్తి సాధించగల నేర్పు, చాకచక్యం నాలో ఒక రూపానికంటూ రాలేదనే చెప్పాలి.

ఏకాంతంలో ఆలోచించుకుంటున్నా, అంతూ పంతూ లేని జనసందోహంలో చొచ్చుకుపోతున్నా, ఒక్కగానొక్క మాటమాత్రమే నా చెవుల్లో రింగ్, అని మ్రోగుచున్నట్లుండేది. అది యెవరు, ఏ సందర్భాన అన్నారో వివరించమని ప్రశ్న వేయకండి!

నా మెదడు అట్టి బలహీనతకు లోనైనదని మాత్రం చెప్పగలను. బహుశా వొకటి నిజమై వుంటుంది, మనసులో వుండే బలహీనతను మాత్రమే ఆధారంగాగొని యీ సువిశాల ప్రకృతిని కూడా ఆ విధానే అర్థం చేసుకొంటారనేది—అయినా దానికి బాధ్యుణ్ణి నేనుమాత్రం కాదు.

“కలో గంజో త్రాగి వాడి మానాన వాడు బ్రతుకుతున్నాడు. నిజంగా అల్లుడంటే సుందరమ్మ అల్లుణ్ణే చెప్పుకోవాలి. ఎన్ని చదువులు చదివినా కొస్తంత గర్వం యెరగడు గందా. దారెపోయి దారే వచ్చేవారిలో యితగాడే మొదటివాడు” అని—

నన్నిలా లెక్కకట్టడంవలన వా రెంతటి ఘనకార్యం చేయగల్గామని అభినందించుకొన్నారో గాని నాకుమాత్రం ఆ మాటలు చెవులకు శూలాల్లా తగిలినయ్. నాలో యెట్టి మార్పూలేక ఉన్న పళానే యీ మాటలు వినివుంటే ఏమయ్యేదో ..కాని ఇప్పటి నేను అప్పటి వాడికంటే యెన్నో వందలమైళ్ళ ముందుకు ప్రయాణించాను.

లోకాపవాదును సహించి, కాకిని పొడిచినట్లు పొడుస్తున్నా "కుయ్..." అనకుండా అణగిమణగి ఒదిగి ఉండేటంత శాంతి, సహనం నాలో వశించినయ్యంటాను.

లోకం యేమనుకున్నా అది మంచి అయినా దానిని పెడమార్గాన అర్థం చేసుకోగల స్థాయికి నాలో అభిమానం రెచ్చిపోయింది.

"నే నెలాపోతే యెవడికొక్కవాలి? నా విషయంలో వేలెట్టి చూపడానికి వీళ్ళకేం హక్కువుంది..." అనేటంత మంకుపట్టులో నేవుండి ఇతరులను అర్థంచేసుకో ప్రయత్నించాను—

ఇంతకీ నాలో రేగిన తుపాను కాలం రాపిడి కొంతమాత్రమూ తగ్గకపోగా మరింత విజృంభించింది నన్ను గుప్పెట్లో పెట్టుకోడానికి వాళ్లు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి

సహజమైన సాహచర్య ధర్మాన్ని అర్థం చేసుకోలేని వాళ్ళు ఒకరి నొకరు బానిసగా చేసుకోందామనే తహతహ లాడతారు. ప్రాథమికావస్థలో అది కొంత నిగూఢంగాను, లోపాయికారీగాను సాగినా యిద్దరిలో పైచేయిగా ఉన్న వాళ్ళు ఇట్టే పసిగట్టేయవచ్చు—కాని ఇటువంటి సంకట పరిస్థితుల్లో తెగిపోయిన తంతువును ముడిపెట్టడం మాత్రం సులభసాధ్యం కాదేమో...

అందులోనూ కొన్ని తరహాల అభిప్రాయవ్యక్తీకరణలున్నా ఉండవచ్చు, కాని, అవి సహజ మనస్తత్వ చిత్రణాన్ని దాటి ఊహాప్రపంచంలోకి పరుగులు తియ్యలేవు. అది అలా సాధ్యమైతే మనసులోని ఆవేదనలన్నీ మారురూపాలతో ప్రత్యక్షం కావడమనేది కొంతవరకూ సర్దుకుంటుందేమో... దానితో పాటు కొంత రభసా తగ్గుతుంది. కాని సహజంగా,—పారంపర్యంగా—సంక్రమించిన కొన్ని శకులవలన అది సాధ్యంకావడంలేదు. ఎన్నటికైనా కాగలదనే ఆశకూడా నాకు లేదు సుమండీ! అలాగయితే అరవిందుడు కలలుగన్న ఆదర్శసంఘం సృష్టిఅయినట్లే—. జాతుల వైవిధ్యాన్నిబట్టి వారి ఆలోచనల క్రమం మారుతూవుంటుంది. అయితే ప్రస్తుతం నా లక్ష్యంలో వున్నవి రెండే రెండు—స్త్రీ, పురుష జాతులు.

రాధ స్త్రీ కనుక ఆమె సహజంగానే నాకు బానిస అయి వుండాలనుకొన్నానంటారు!—ఒక వేళ ఏ వ్యక్తావ్యక్తంలోనైనా నాలో అలాటి భావన పొటమరించివుంటే, అందుకు పూర్తిగా, రాధ, ఆమె తల్లిఅయిన సుందరమ్మ—ఇద్దరే బాధ్యురాండ్లంటాను. నాలో ఇలాటి ఉద్రేకాన్ని రెచ్చగొట్టింది వారే కనుక.

వారి ప్రయత్నాలు, ఆలోచనలు ఎంత పరిమితంగా సరిపెట్టుకోందామనుకున్నా, నా మనసిక్కడ చైతన్యంగల కెమేరాలా పనిచేయడం ప్రారంభించాక మరెక్కడ దాగిఉండగలరు?

ఇదివరకే చెప్పాను—"నేను వారి ప్రవర్తనను అర్థంచేసుకోనే తీరేలేదు" అని—ఆనాడు నా కెంత మాత్రమూ ఇష్టంలేదు రాధతోగానీ, వాళ్ల అమ్మతో గానీ మాటాడటం. కాని కవ్వించి అనుగుతుంటే మరీ మొండిగా బిగిసించుకుపోవడం నాకే పౌరుష హీనంగా తోచింది. యథార్థం గ్రహించలేని లోకం నన్నే అపార్థం చేసుకోన్నా చేసుకోవచ్చు. ఇక్కడే నా కాలు పప్పులో పడిందేమో అని భయం. అదేమిటంటారా? నిశ్చితంగా నేను ప్రకటించదల్చుకొన్న అభిప్రాయం ఆ రెండు జీవులముందరె కాకుండా, లోకంవేపుకే మళ్లించుకొంటే బాగుండేమో...

కంచంలో అన్నంపెట్టిన సుందరమ్మ రోజూలాగా నేతిగిన్నె నా దగ్గిరే పెట్టి ఏదో పనివున్నట్టుగా అవతలికి జారుకోలేదు. పైగా చేతబట్టుకొని తలుపు చాటుగా నొదిగి నొదిగి నిల్చున్నది. మొదటిముద్ద నోట్లో కెక్కాలన్నా నేతిబొట్టు పడకుండా జరిగే పనికాదు కనుక నేను అడగడమూ తప్పలేదు, ఆవిడ వడ్డించడమూ తప్పలేదు.

జాడీలోనుంచి సన్నగా ధారగా జారుతున్న నేతిలాగే ఆమె నోటినుండి ఒక మాటకూడా పెదవి జారింది; చాలా నిదానంగా, అర్థయుక్తంగా, నిర్మొహమాటంగా —"మీ నాన్నగారికి నేనే ఉత్తరం రాయిద్దామనుకుంటున్నాను వచ్చే దశమినాడో ఏకాదశినాడో బాగుంటుందంటున్నారు. ఆ ముక్క కాస్తా తీరిపోతే అక్కడికి నా బాధ్యత మరేమీ వుండదు, మీరూ మీరూ... —అని మాట మధ్యలో వుండగానే "ఇక చాల్లే యీసొద" అన్నంత ఘాటుగా సకిలించి తల పైకెత్తి చూశాను.

సుందరమ్మ మొహం అప్పుడు స్పష్టంగా కనిపించింది నాకు. అంతవరకూ పరకాయించి చూసి ఉన్నవాణ్ణి కానందున అచ్చంగా కొత్తమొహంలాగే

వుంది. నాలో వస్తూన్న భావపరివర్తనంవల్ల క్రమంగా ఆమెయెడలగల పూజ్యభావం కూడా నశించింది—ఎత్తైన కనుబొమ్మలు, వెడల్పాటి చెక్కిళ్లు, పిల్లికి పాఠం నేర్పగల ఆ కళ్ళు నన్నొక్కసారి చలింప జేసినయ్. వెన్ను ఝల్లుమన్నట్టయింది—

ఇలా అంటూనే ఆమె క్రమంగా తలుపు పక్కనున్న గోడకు చారగిలబడింది. కుచ్చెళ్ళు మాత్రం కొట్టొచ్చినట్లు కనబడుతున్నయ్.— చెప్పాను కాదూ? "వాళ్ళు అనే ప్రతిమాటకీ పెడర్థం తీయడం మొదలెట్టానని". అచ్చంగా అలాగే జరిగింది. నా సైకాలజీ పరిధికి అందినంతవరకూ తెలియవచ్చిందేమిటంటే—సుందరమ్మ మాట్లాడేమాటకు వెనక ఏదో గూఢార్థం యిమిడివున్నది. అని—

సమాధానం అంతకు భిన్నంగా యెలావస్తుంది? ఏదో చెబుదామనుకొన్నాను, అందుకు ఉద్యమించాను కూడా.

ఇంతలోనే "అమ్మా" అని పిల్చిన సవ్వడి వినబడిందినాకు. అది గొంతెత్తి పిల్చిన పిలుపు కాదు; గుసగుసలకు కాస్త హెచ్చు స్థాయిలో వున్నది. అయితే ఆ పిల్చినవ్యక్తి ఒకలా అనుకొని ఉంటుంది. ఆశబ్దం అమ్మను దాటి ఒక్క అంగుళం మేరైనా యివతలకు రాకూడదు, అని—కాని ఆమెకోరిక నెరవేరలేదు—

"ఒక్కసారి ఇలా రావే! అబ్బబ్బా! ఏం అడుగుతున్నావే—ఇటు రావే!"—ఎంత చనువు, స్వతంత్రం లేకపోతే యీతీరున తెగించి పిలవగల్గుతుందంటారు? అది ముమ్మాటికీ రాధే—

ఈ తీరున మల్లాగుల్లాలుపడుతూనే కొంత అన్నం నోట కొట్టుకొన్నాను. ఇంతలోనే సుందరమ్మ నేతిగిన్నె చెయి మార్చుకుని "వస్తున్నానుండు" అన్నట్లుగా మరొక చేతితో అదమాయించింది. రాధ కొంత తమాయించుకు నుంటుంది. వెనక్కు వెళ్ళిపోయినట్లు అడుగుల చప్పుడు అస్పష్టంగా వినబడింది.

సుందరమ్మ నా సమాధానంకోసమే నిరీక్షిస్తున్నదని వేరుగా చెప్పనవసరంలేదు.—ఒక్క విషయం—నే నిదివరకు ఆవిడతోగాని, ఆమె నాతోగాని, యీ విషయమై సంప్రదించి వుండలేదుకదా, ఇంత ముక్తసరిగా,—వ్యవహారం ఆకళింపుజేసుకొన్నవాడిని అడిగినట్లుగా—అడిగి సమాధానంకోసం ప్రశ్నార్థకంగా నిరీక్షిస్తున్నదంటే అందులో అర్థం వున్నదంటారా?—

దీని కింతకీ పెద్దకారణం ఒకటేవున్నది. నాలో రేగిన తుఫానును కొంతకు కొంతైనా వారు ఆకళించుకోవడం. దీనిమీద మరేవి సరికొత్త పరిణామాలు రాకుండా అణచివెయ్యాలనుకోవటం—

"మీరు నూరుచెప్పండి, వెయ్యి చెప్పండి—నా పరిస్థితులన్నీ వొక దారికి రానివి, అసలిక్కడ నా స్థానమేమిటో నిర్ణయం కానిది—మీ రడిగిన దానికి సమాధానం చెప్పను; అట్టి తాహతుకూడా నాకు లేదు. ఒకవేళ మీరు సాహసించి నన్ను మెడలు విరిచి ఒప్పించుదామని తలపెట్టినా మీ రనుకొన్నది అనుకొన్నట్లుగా యెన్నడూ జరుగదు, అందుకు బాధ్యుణ్ణి నేనుకాను." అనేశాను వ్యవహారం మాట్లాడుతున్న ధోరణిలోనే.

వెనువెంటనే సావిట్లోనించి [illegible] కేమన్న చప్పుడు వినబడింది. బహుశా [illegible] విన్న రాధ ఏ కిటికీ రెక్కనో [illegible] వుంటుంది.

సుందరమ్మకు ఇష్టం వున్నా లేకపోయినా తొందర తొందరగానే అన్నీ వడ్డించేసింది. నా భోజనంకూడా పూర్తయింది—

అది వొక్కటే కాదు; ఈవిధంగా జరిగిన రోజులు మరికొన్నికూడా వున్నయ్.

అర్థాంతరంగా వీళ్లలో కల్గిన యీ మార్పులను నేను గ్రహించిన పరిశోధనల సత్యం ఇది—సుందరమ్మపేరున ఉన్న ఆస్తి అంతా రెండు భాగాలుగా చెయ్యబడింది. ఒకవంతు తను యథేచ్ఛగా ఖర్చు చేసుకొనేట్లు వ్రాయించుకొని, మిగతాది రాధ పేరున వ్రాసి అట్టే పెట్టడానికి తీవ్రమైన ప్రయత్నాలుకూడా జరుగుతున్నయ్యని — ఇది నాకు లోకులు చెప్పినదేకాదు; ప్రత్యక్షంగాకూడా కొన్ని దాఖలాలవలన రుజువయ్యింది—

ఈ రాద్ధాంతాన్నంతనూ సక్రమమార్గంలో నడిపించి, విజయం చేపట్టగల వ్యక్తి రామచంద్రయ్య వొక్కడేనని నాకు తెలుసు. అందుకు తగినట్లు ఆయన కోర్టుపక్షిగా పేరు ప్రఖ్యాతులు గడించుకొన్నవాడే. కాకపోతే యీ యౌగంధరాయణమంతా కేవలం ప్రతిఫలాపేక్ష లేకుండా నిర్వర్తించుకువస్తున్నాడా అనేది విచారణీయాంశం.

మునకు తెలుగుసేత. గురు విజయమన్నది ఆనందగిరి కృతశంకర విజయమే. 'సారలౌకికాచారభృతులు,' 'చతుర చెన్నపురి చరత్సచివవరులు' ఇతనిని పిలిపించి

లీలఁ బంచనదస్థలీపురాణముఁ దెనిఁ
గించితి వారూఢకీర్తి మెఱయ (వసయ)ఁ
బరగ రామాయణ భాగవతంబులు
యక్షగానము చేసి తద్భుతముగఁ
గర మొప్పఁ బరమ భాగవత చరిత్రయన్
గృతి యొనర్చితివి యున్నతి దలిర్పఁ
జెలివొందు నిందుమతీ పరిణయనామ
కృతి రచియించితి వతులగరిమ
గురుతరోజ్జ్వల సరణితో హరికథా సు
ధారసాఖ్యకావ్య ముదారఫణితి
గారవించితి వెనలేని గద్యపద్య
తతులు లెక్కింపఁదరమె త్వత్కృతులు జగతి.

అని ప్రశంసించి యాచార్యవిజయమును దెనిగింప గోరిరట. ఈ పద్యమువలన నితడు పంచనదస్థలీ పురాణము, రామాయణ భాగవత యక్షగానములు, పరమ భాగవత చరిత్ర, ఇందుమతీ పరిణయము, హరికథా సుధారసము అను గ్రంథములు రచియించినట్లు విదిత మగుచున్నది. ఆచార్యవిజయమును, భాగవతము యక్షగానము నిప్పు డున్నవి. భాగవత యక్షగాన మునకు పార్థసారథి విజయమని నామాంతరము. రామాయణ, భాగవత యక్షగానములు రెండును చోళపురము వేంకటాచల భూవిభున కంకిత మీయ బడినవి. బమ్మెరపోతన రచించిన యాంధ్రభాగ వతములోని దశమస్కంధ కథానుసారముగా రెండు భాగములుగా నీ భాగవత యక్షగానము విరచితమయి నది. వేంకటాచల నృపతి కవిని రప్పించి

పలికె నిట్లని భవద్భవ్య సాహిత్య
కలనా చమత్కృతిఁ గాంచి కొంచియును
మఱిమఱి వినఁగ నెమ్మది నాస పొడమె
నరసి రామాయణ యక్షగానంబు
నచలితంబుగ మదీయాంకితంబుగను
రచియించి యొసఁగి తారవితారకముగఁ
గావున నీవంటి కవివరాగ్రణిని
నీవంటి మిత్రుని నే నెందుఁగానఁ
బరికింప శ్రీ మహాభాగవతంబు
హరి కతిప్రియమగు నందునను జూడ
నల దశమస్కంధ మతిచిత్ర మదియు
నలినలోచనుని కృష్ణావతారైక
చిరతర లీలా విశేష సంపదల
భరితమై యెందునుఁ బ్రతిలేక యుండుఁ
గాన సమ్మోహనీయ కథ గొల్ల యక్ష
గాన ప్రబంధంబుగా సంఘటించి
జననుతంబుగఁ బార్థసారథి విజయ
మను పేరఁ దనర మదంకితంబుగను
నొసఁగు మటంచు సమున్నత రత్న
లసిత భూషణములు లాలిత వస్తు
లతులితాంబర చతురంత యానాదు

లతిదయమీఱ నెయ్యమున నొసంగి
మన్ననచేసెనట. మిగిలిన యీతని కృతులు కానవచ్చుట లేదు.

తుళజేంద్రుని యనంతరము తంజావూరి సింహాసనము నధిష్ఠించినవాడు ఏకరాజేంద్రుడను (రెండవ) ఏకోజీ (క్రీ. శ. 1636—1637). ఇతని కాంధ్రమన్న అమితాభిమానము. ఇతడుకూడ పదములు, ప్రబంధములు రచించి పేరు కెక్కిన మహారాజు. ఇతడు విఘ్నేశ్వర కల్యాణమును నాటకముగా రచించెను. ఇది 'జయ భక్తపాలకా జయ కీర్తి దాయకా జయ శ్రీప్రదాయకా జయ ముదితలోకా' అను పాటతో ఆరంభమగును. నాటకాంతమున ఈ క్రింది ద్విపదగలదు :

రాజేంద్ర శరభోజి రాజనందనుఁడు
రాజహంసాంబికా రమ్యసుతుండు
శ్రీకరగుణములఁ జెలువొందునట్టి
యే కేంద్ర విరచిత మీ చరిత్రంబు
ఎలమితోఁ దుళజేంద్రు ఏకేంద్రునికిని
బలములు సంతాన భాగ్యసంపదలు
ప్రణవస్వరూపుఁడు భక్తపాలకుఁడు
గణనాయకుం డిచ్చు గణనమీఱఁగను.

పై ద్విపదపంక్తులలో ఏకోజి శరభరాజనందనుడని రాజహంసాంబిక సుతుడని యుండ చిట్టచివరి నాటకాంత గద్యమువంటి యీ క్రింది సూత్రధార వచనములో

"ఇతి శ్రీమద్భోసలకుల కలశాంభోధి సుధాకర తుళజ మహారాజ తనూజ ఏకమహారాజ ప్రణీత విఘ్నేశ్వర పరిణయనామ నాటకమ్ సాంబశివ ప్రీతయే విఘ్నేశ్వరప్రీతయే.........స్మదే సకల శ్రేయసేఽస్తు"

తుళజమహారాజతనూజు డనియు, నాటకారంభ మున భోసలవంశము అభివర్ణితమైన యీ క్రింది

"శ్రీమద్భోసలకులశిరోమణియైన, శాహమహారాజ తనూజుండైన, లోకైక పాకశాసనుడైన, ఏక మహారాజతనయుండైన, శాహమహారాజ సహోదరుండైన, శరభరాజన్యానుజుండైన దీపాంబికా గర్భాబ్ధి పూర్ణచంద్రుండైన, సూర్యవంశ జనపాలుండైన, శ్రీమత్తుళజ మహారాజకుల మానినీ శిరోమణియైన, రాజకుమారాంబికా నందనుండైన ఏకమహారాజ ప్రణీతంబైన విఘ్నహర గణేశ పరిణయము సకల విద్వజ్జన శ్లాఘనీయమై సాంబశివప్రీతికరమై సంతాన సంపత్ప్రదంబై ఆచంద్రతారార్కమై యుండు"

అను చూర్ణికలో గూడ నాటకకర్త తుళజమహారాజ రాజకుమారాంబికానందనుడనియు గలదు. నెల్లూరి శివరామ కవి విరచితమైన కామకళానిధి యను గ్రంథములో నయితేము ఏకరాజేంద్రుడు తుళజేంద్రునికి రాజకుమారాంబికయందు గలిగిన కుమారుడని ఈ క్రింది సీసపద్యమువలన దెలియుచున్నది.

అలయు...బాయియందు సద్గుణనిధి

జనపాలమణి హరిశ్చంద్రవిభుని
సైరైక్రకవసతి రాధాబాయియందు నృ
సింహవిక్రము జయసింహ విభుని
రమణీయ చరితయా రాజకుమారాంబ
యందు నేకోజి ధరాధినాథు
వరరూపయగు సుమాబాయియందు గుణాఢ్యు
డైన ప్రతాపసింగావనీంద్రుఁ
గాంచి నాల్గు భుజమ్ముల ఘనతఁ గాంచు
శ్రీమహావిష్ణువు కైవడి జెలగునపుడు
సేతుపతి గర్వహరణ ప్రసిద్ధకీర్తి
చారుతరమూర్తి తుళజరాట్చక్రవర్తి.

ఇందువలన విఘ్నేశ్వర కల్యాణము ద్విపదలోని రాజేంద్ర శరభోజి రాజనందను డన్నది ప్రామికముగా వ్రాయసకాని పొరపాటైయుండు ననియు, ఆచరణము 'రాజేంద్ర తుళజాజి రాజనందను' డని యుండదగు ననియు దోచుచున్నది. ఏకరాజేంద్రుని తల్లి రాజకుమారాంబికకు రాజహంసాంబిక యని నామాంతరముగ గన్పట్టును.

ఏకరాజేంద్రుడు తన తండ్రి తుళజరాజేంద్రుని మీద రచించిన పదములు, కీర్తనలు అనేకము లున్నవి. ఈతని తెలుగు రచన లన్నిటిలోను ప్రధానమైనది రామాయణ మహాకావ్యము. దీని నీతడు తన తండ్రి తుళజేంద్రుని కంకిత మొసంగెను. ఇతడు దీనిని

యతుల ప్రాసంబుల నర్థ సంగతుల
బ్రతిలేని నవరస భావముల్ దనర
నిరుపమాలంకార నియతు......

లమరునట్లు

శ్రీ గణనాథు నాశ్రిత పారిజాతు
బాగుగా నుతియించి వాక్సిద్ధి కిపుడు
శ్రీ శారదాదేవి చిత్తాంబుజమున
భాసిల్ల ప్రార్థించి భక్తితోడుతను
వాసవ ప్రముఖ గీర్వాణ వందితుని
భోసలాన్వయరాజ పూజితపదుని
ఫాలనేత్రుని భక్తపాలుని చంద్ర
మౌళీశ్వరుని దయామానసుఁ దలఁచి
ధరణి రామాయణోద్యాన సంచార
వరకోకిలంబైన వాల్మీకిఁ దలఁచి
వ్యాస శుకాదుల వర్ణించి కాళి
దాసాది కవులకుఁ దగఁ గేలు మోడ్చి
కులదైవతమ్ములఁ గొనియాడి మదిని
బొలుపొందు సత్కవి బుధుల సమ్మతిని

రచియించెను. ఈ రామాయణ మింకను అముద్రితము. ముద్రించదగిన గ్రంథము.

ఆంధ్రనాయకరాజుల ప్రభుత్వము పడిపోయిన మహారాష్ట్ర భూవరులు తంజపురాధినాథులై మరల తెనుగుకవిత నాదరించుటచేతను తెలుగు నే రాజభాషగ నుంచుటచేతను ఇంక తమకు రాజాదరణ దొరక దనుకొన్న తెలుగు కవులకు మరల ప్రాణము లేచివచ్చినది. అదివరకు తంజావూరిలో నుండెడు తెలుగు కవు లట్లుండగా ఇతర ప్రాంతములనుంచి రాజాశ్రయమును గోరి క్రొత్త కవు లానగరమునకు రాదొడగిరి. క్రొత్తగా రాజ్యమున కధిపతులైన మహారాష్ట్రరాజుల ప్రాపకముకొఱకు ప్రాకులాడుచుండిన ఏతన్నగర వాస్తవ్యులయిన కవుల కది యసూయాద్వేషములకు కారణమైనది. కాబోలు. యాచకో యాచకశ్శత్రుః అనికదా పెద్దల సూక్తి. ఆ కవులు క్రొత్తగా వచ్చినవారి నేవగించుకొనుచుండి రనుటకు ఈ క్రింది పద్యమే తార్కాణము.

"పురమున నుండే కవులే
చోరఁబడి తినఁ గూడు లేక చుంచించంగాఁ
బర కవు లేటికి వచ్చిరి
తిర మెఱుగక అరికి విరికిఁ దంజాపురికిన్."

తంజావూరిని బరిపాలించిన మహారాష్ట్ర ప్రభువు ఈయేకోజి రసికుడు వేశ్యా నాట్య గాన విలోలుడు. ఈ మహారాజు నాస్థానములో నాట్యకళా

కౌశలమునకు పేరొందిన వేశ్యామణి ముద్దుమంగ. ఈ మంగను గురించి ఎవరో యొక కవి చెప్పిన చాటు పద్య మిది

"కొద్దిగఁ జలించె నా మది
నిద్రా వాతెఱకుఁ జెఱకు నేజాసురభా
ముద్దియవా యొక తీయని
ముద్దియవా చెలి కొనంగ ముద్దుల మంగా!"

ముద్దు మంగ నాట్యములో కడు నేర్పరియట. ఈమె నాట్యకళా చాతుర్యమునకు మెచ్చి ఏకోజి భూపాలుడీమెను చాల గౌరవించి సమ్మానించినాడట. ఈ ముద్దు మంగమీద కవులు చెప్పినదే యీ క్రింది పద్యము :

"పదచాళి వినిపించు వైభవ స్ఫురణకు
గొమరొంద ముత్తెల కుచ్చు చెల్లు
ఒక్కణి వినిపించు చాతుర్య మహిమకు
రంజిల్లు వింజామరములు చెల్లు
తాళవిన్యాసభేదమున నాట్యానకు
దులలేని బిరుదుకాహళులు చెల్లు
అభినయం బొనరించు నతిశయప్రౌఢికి
నిరతంబు డవిణె మల్హరులు చెల్లు
ననుచు నేకోజి భూపాలు డనుదినంబు
మెచ్చి ముత్తెల కుచ్చు నీ కిచ్చు సభను
గలిత గుణపేటి యాశ్రిత కల్పవాటి
భావజుని ఘోటి ముద్దు మంగావధూటి.*"

ఏకరాజేంద్రుని సవతిసోదరుడు జయసింహ భూపతి. ఈ మహారాష్ట్ర భూపతి కాశ్రయుడు యాదవరాఘవ పాండవీయ కృతికర్తయగు నెల్లూరి వీరరాఘవ కవికుమారుడు నెల్లూరి శివరామకవి. ఈ శివరామకవి కొక్కోక రతిరహస్యము ననుసరించి కామకళానిధియను పేర కామశాస్త్రమును పద్యరూపమున నాలుగాశ్వాసముల గ్రంథముగా రచించి జయసింహభూపతి కంకితము కావించెను. ఈతడు తన గురువు ఆంధ్రపాణిని బిరుదాంచితుడయిన నివృత్తి శేషాచలపతిని ఇట్లు ప్రస్తుతించి యున్నాడు

"సకలాంధ్రోక్తుల కాంధ్రపాణిని
యనన్ శాస్త్రంబు గల్పించి త
త్ప్రకృతి ప్రత్యయనిర్ణయంబు కొఱకై
భాష్యంబుఁ గావించి దే
శికుఁడై రాజులచేతఁ బూజఁగొను
నా శేషాచలర్షిన్ నివృత్తి
కుల స్వామిని మద్గురున్ గొలుతు
భక్తిన్ మానసాబ్జంబునన్."

ఈ శేషాచలపతియు శాహరాజవిలాస, సరస్వతీ కల్యాణములను రచించిన శేషాచలపతియు కొంద ఱూహించునట్లు ఒకరు కారు. నాటక రచయిత శేషాచలపతి చొక్కనాథ మహామాత్య తనూభవుడు. ఆంధ్రపాణిని బిరుదాంచితుడైన శేషాచలపతి వేంకటపతి తనయుడు. కానైతే ఇరువురును భారద్వాజ గోత్రులే.

కృతిభర్తయైన జయసింహనృపతి విపంచీవాదన కుశలుడని శివరామకవి యీ క్రింది పద్యమున దెలుపుచున్నాడు :

"పంచ ద్రవిడావనితల
పంచ జనాధీశ మత్తవారణపటలీ
పంచానన బిరుదునకు వి
పంచీవాదన కళా ప్రపంచజ్ఞునికిన్."

శివరామకవి కృతిభర్తవంశావతార క్రమమును చక్కగా నభివర్ణించుటచేత తంజావూరి మహారాష్ట్ర వంశమును గురించి తెలిసికొనుట కిది యుపయోగపడును.

నెల్లూరి శివరామకవి రచియించిన వేఱొక గ్రంథము రామగీతలు. సంస్కృత భాషలోనున్న రామగీత లను పేరుగల వేదాంతగ్రంథమున కిది తెలుగుసేత. శివరామకవి యీ గ్రంథమును మట్లి కృష్ణ భూపాలుని ప్రేరణమున కృష్ణాపురములోని శ్రీరామదేవుని కర్పణముగా రచియించెను.

* ఈ ముద్దు మంగావధూటి నాదరించిన ఏకోజీ ప్రభువు శాహరాజేంద్రుని తండ్రియు, తంజావూరి మహారాష్ట్రరాజ్యస్థాపకుడును అయిన మొదటి ఏకోజీయైనను కావచ్చును. కాని మొదటి ఏకరాజేంద్రుడు తన రాజ్యమును సుస్థిరము కావించుకొనుటలోనే కాలము గడపవలసివచ్చుటచేతను, అతని కాలమున అతని కాశ్రితులైన కవులుండినట్లు వారు గ్రంథములు వ్రాసినట్లు కాని, అతని కాలమునాటి సంగీత సాహిత్య వినోదగాథలు కాని తెలియరాకపోవుటచేతను, శాహభూపాలుని నాటినుండి మహారాష్ట్ర భూపతులందరు భరత విద్యావిశారదలైన వేశ్యలను పండితులను పోషించినవారగుటచేతను, పై సీసపద్యములో ఉదాహృతుడయిన ఏకోజీ తుళజేంద్ర తనయుడైన రెండవ ఏకరాజేంద్రుడై యుండునని నేను భావించితిని.

జయసింహభూపతి సవతి సోదరుడును, తుళజాజి కుమారులలో నొక్కడు నయిన ప్రతాపసింహ రాజేంద్రుడు (క్రీ. శ. 1739 మొదలు 1763) శాహ రాజేంద్రుని యనంతరము తంజావూరి రాజ్యమును బరిపాలించిన మహారాష్ట్ర భూవరులలో కడు సమర్థుడు. ఈ మహారాజు కృపకుబాత్రురాలైన ముద్దు పళని* యను వేశ్యాంగన రాధికాసాంత్వన మను నాలు గాశ్వాసముల శృంగార ప్రబంధమును రచించెను. గ్రంథకర్త్రి నామములో ముద్దు అనునది ఉపనామము. ఈ ప్రబంధములో శ్రీకృష్ణునికి భార్య యయిన ఇళాదేవి చరిత్ర ముండుటచేత దీనికి ఇళాదేవీయ మనియు నామాంతరము కలిగినది. ప్రతాపసింహుని ఈ కావ్యమున ముద్దు పళని ఈవిధముగా నభివర్ణించుచున్నది.

తన యార్యనుత మహౌదార్య విస్ఫురణంబు
శేషేంద్రుఁ బంట్లిగిలింపఁజేయఁ
తన రామభక్తి ప్రధాన మానసవృత్తి
నారదు వెలవెలఁబోవఁజేయఁ
తన సర్వవిద్యావధాన మేధాస్ఫూర్తి
పన్నగేంద్రుని తలలొంపఁజేయఁ
తన యభేద్యగభీర తానాదతిఖ్యాతి
యంభోధి భంగపాటందఁజేయ
సమర శతాద్రిసేతు మధ్యావనీత
లాంతర నిరంతర యశోవిలాసధా
మాన భోసల తుళజరాణ్మణిసుత ప్ర
తాపసింహేంద్రమౌళి ప్రతాపహేళి.

ఈమె గురువైన వీరరాఘవ దేశికుని సన్నిధానంబున గల సకలకళావల్లభులను విద్వజ్జనంబులీ క్రింది సీసపద్యమున జేసిన ప్రశంసనుబట్టి ముద్దు పళని శక్తిసామర్థ్యములు విశదమగుచున్నవి :

ఘటియింప నేర్తువు కవనజాతు తెలుఁగు
పలుకులకల్కి నెవ్వెలనఁ బోలి
నీయఁగా నేరుతు విలఁ గోరిన వరాలు
నగరాజ సుకుమారి సగముగాఁగ
చెల్లింప నేర్తువు చెప్పిన రీతిగాఁ
గని ద్రౌపదీసతి కానకేఁగ
నటియింప నేర్తువు నవరసంబుల నంటి
తగు రంభ యనిమిషత్వము వహింప
నీదె మఱి యుక్తి పరికింప నీదె శక్తి
నీదె నెరపద్దు నరయఁగా నీదె బుద్ధి
సరసముగఁ జేసి రాధికా సాంత్వనమ్ము
భక్తి హరి కిమ్ము శ్రీముద్దు పళనిబోటి. †

ప్రతాపసింహుని కుమారుడు తుళజాజి (రెండవ తుళజేంద్రుడు) క్రీ. శ. 1763 మొదలు 1787 వరకు రాజ్యము పాలించెను. ఈ రెండవ తుళజమహారాజు కాలముననే యుదయించినాడు అఖిల వాగ్గేయకార శిరోవతంసమైన శ్రీ కాకర్ల త్యాగరాజస్వామి. త్యాగరాజు తండ్రియైన రామబ్రహ్మముగారు తుళజ రాజేంద్రుని యాశ్రితులలో ఒకరు. శొంఠి వేంకట రమణయ్యగారు ఈ తుళజేంద్రుని యాస్థాన సంగీత విద్వాంసులు. వీరివద్దనే త్యాగరాజు సంగీత

---

* ఈ ముద్దుపళనికి ముద్దు మంగావధూటికి సంబంధము లేదు. ముద్దు పళని తన గ్రంథము రాధికా సాంత్వనములో తన వంశము నభివర్ణించుకొన్నది. దానిలో ముద్దు మంగ పేరు కానరాదు. కాని ముద్దు మంగ ముద్దుపళనికి దూరబంధువైనను జ్ఞాతియైనను కావచ్చునేమో.

† విజయరంగ చొక్కనాథుని యాస్థానకవియైన సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడుకూడ రాధికా సాంత్వన మను పద్యకావ్యమును రచియించెను. ఈతని రాధికాసాంత్వనమునుగుఱించి డాక్టరు నేలటూరి వేంకట రమణయ్యగారు తమ దాక్షిణాత్యాంధ్ర సాహిత్యమున నిట్లు వ్రాయుచున్నారు :

"రాధికాసాంత్వనము "ఏకాశ్వాస క్షుద్ర ప్రబంధము" అని వేటూరి ప్రభాకరశాస్త్రులవారు నిరసించినారు. శాస్త్రులవారి కిట్టి యభిప్రాయ మేల కలిగెనో తెలుపలేదు. శృంగారగ్రంథ మగుటవలననేమొ. "కొంతకాలముక్రింద నా తాళపత్రగ్రంథమును విక్రయించుటకై యొకరు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు గొనివచ్చిరి. దానిని నేను చూచితిని. ముద్దు పళని రాధికాసాంత్వనమునం దిందలి పద్యము లన్నియు గలవు. మఱికొన్ని పద్యము లెక్కువగా చేర్పబడి నాల్గాశ్వాసములుగా ముద్దు పళని గ్రంథము విభక్తమైనట్లు కన్పట్టుచున్నది" అని శాస్త్రులవారు వ్రాసినారు. దీనినిబట్టి చూడగా ముద్దు పళని వేంకట కృష్ణప్పనాయకుని కావ్యమును దస్కరించి తాను రచియించినట్లు తన పేర ప్రకటించుకొనెనని చెప్పవలసి యున్నది. ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారమున వేంకటకృష్ణప్ప నాయకుని రాధికాసాంత్వన ప్రతి యొకటి కలదు. విషయ మవశ్యము పరిశోధనీయము."—భారతి, విజయ, భాద్రపదము; (1953, సెప్టెంబరు, పుట 285).

విద్య నభ్యసించెనట. తుళజేంద్రుడు కాలధర్మము నొందునాటికి ఇతడు పెంచుకొన్న కుమారుడు శరభోజి (రెండవ శరభరాజేంద్రుడు) బాలుడయినందున సంరక్షకుడుగా అతని పినతండ్రి అమరసింహుడు క్రీ. శ. 1787 మొదలు పదునొకండేండ్లు, అనగా క్రీ. శ. 1798 వరకు తంజావూరి రాజ్యమును బరిపాలించెను. అమరసింహుని ప్రధాని శివరాయ మంత్రి. ఈ శివరాయ మంత్రి ప్రేరణచేత మాతృభూతకవి పారిజాతాపహరణమను నాటకమును రచించి అమరసింహుని కంకితము కావించెను. ఇందు కృతికర్త తన్నుగురించి యిట్లు చెప్పుకొని యున్నాడు:

"గురుతర శాండిల్యగోత్ర పావనుఁడు
వరకవి రంగార్యవర తనూభవుఁడు
గురుకృపాసౌగంధి కుంతిశాంబవి
వరముచే జనియించి ప్రబలినవాఁడ
మాతృభూతస్వామి మహిత కటాక్ష
చాతుర్య పరిలబ్ధ సరససాహిత్య
సంగీత మధురవాగ్ఝరి గల్గువాఁడ
శృంగారరసము చెల్విన మేలువాఁడ
కవి మాతృభూతనాఖ్యను వహించి
భువిలోపలఁ బ్రసిద్ధిఁ బొందినవాఁడ
గరిమచే లోక విఖ్యాతంబుగాను
సరవి మీఱఁగఁ బారిజాతాపహరణ
మను మహానాటకం బందఱు మెచ్చ
వినిపింతు త్రైలోక్య విఖ్యాతముగను."

ఇందు పిదప కృతిపతి వంశాభివర్ణనము కూడ గలదు.

అమరసింహుని యనంతరము, అనగా క్రీ. శ. 1798 కి పిదప తంజావూరి రాజ్యమును పాలించిన వాడు (రెండవ) శరభరాజేంద్రుడు. శరభమహారాజు కాలముననే త్యాగరాజస్వామి తన దివ్యసంగీత పారిజాత సౌరభమును వెదజల్లి దశదిశలు వాసింపజేసెను. కర్ణాటక సంగీతమునకు వంకలు దిద్ది వన్నెలు చిలికి దక్షిణదేశ గానకళా ప్రపంచమునకు శోభగూర్చి శాశ్వతకీర్తి భిక్షు పెట్టిన మహానుభావుడు త్యాగరాజస్వామి. అమరగాన సుధారస వృష్టి గురిసి లోకమును దనుపుచు వచ్చిన సంతత శ్రీరామ సంకీర్తనానంద పరవశస్వాంతుని, ఆ భక్తైకశిఖామణిని దన యాస్థానమునం దుంచుకొని సత్కరించి తాను తరింపవలె నని ఆ మహారాజు ఆశించెను కాని, రాజగౌరవములు కాని, సమ్మానములు కాని, భోగములు కాని అతని నాకర్షింపలేకపోయినవి. ఆ మహారాజు నాహ్వానమును నిరాకరించి

నిధి చాలా సుఖమా రాముని స
న్నిధిసేవ సుఖమా నిజముగ బల్కు మనసా॥ ని॥
దధి నవనీత క్షీరములు రుచో
దాశరథీ ధ్యానభజన సుధారసము రుచో॥ ని॥
శమ దమమను గంగాస్నానము సుఖమా క
ర్దమ దుర్విషయ కూపస్నానము సుఖమా॥ ని॥
మమత బంధనయుత నరస్తుతి సుఖమా
సుమతి త్యాగరాజనుతుని కీర్తన సుఖమా॥ ని॥

అని పాడుకొనుచుబోయిన త్యాగరాజు గీతము అతని మనస్సునే కాదు, ఇప్పటికి నెల్లరి మానసములను ప్రశ్నించుచునే యున్నది. లోకమునకే పెద్ద ప్రశ్నార్థక మది.

శరభరాజేంద్రుని కుమారుడు శివాజి (క్రీ. శ. 1833 మొదటి 1855) తంజావూరి రాజ్యము నేలిన కడపటి మహారాష్ట్ర నృపతి. ఇతని యనంతరము ఇంగ్లీషువారు ఈ తంజావూరి రాజ్యమును స్వాధీనము చేసికొనిరి.

శివాజీ రాజేంద్రునికికూడ తెలుగన్న చాల అభిమానము. ఈ మహారాజు అన్నపూర్ణా పరిణయ మను పేర ఒక తెనుగు నాటకమును రచియించెను. ఏతన్నాటకారంభవిధాన మిట్లున్నది: మొదట ప్రార్థన గీతము; తరువాత తంజాపుర వర్ణనము. అటుతరువాత సూత్రధార, పారిపార్శ్వక సంభాషణము. చూడుడు:

సూత్ర: వ॥ ఇటువంటి పట్టణంబునందు సకల విద్యాప్రవీణులయిన సభ్యులు కూడియున్నారు గనుక నీ సభ కుచితంబయిన అన్నపూర్ణా పరిణయంబను నూతన నాటకంబు నటియింపఁజేసి ఆత్మసుకృతార్థత చెందవలెనని యిచ్ఛయిస్తున్నాను.

పారి: వ॥ ఎవరయ్యా యీ దివ్యప్రబంధ నిర్మాత?

సూత్ర:
వివిధాలంకృతిఁ గలిగియు
భువి జనులను ప్రేమఁ బ్రోచు పుణ్యాత్ముఁడై
అవిరళదాన ఘనుండై
కవినుతుఁడు శివాజిరాజు ఘనసద్గుణుఁడై.

పారి: వ॥ సకలకళాప్రవీణుండయిన శ్రీశివాజి రాజేంద్రుఁడా యీ గ్రంథనిర్మాత? అయితే మన

మనోరథంబు లన్నియు సఫలమగును. అతని గుణాతిశయంబులు వినవలెనని యిచ్ఛయిస్తున్నాను.

సూత్ర : వ॥ చెప్పెదవినుమా.

గయచేసి ధారుణీతలముఁ బాలించుచోఁ
ప్రతిలేని శ్రీరామభద్రుఁ డనఁగ
సుదమంది సుదతుల మోహింపఁజేయుచో
బాగైన నవపుష్పబాణుఁ డనఁగ
బెదరించి రిపులను భేదింపఁజేయుచో
మురునైన శ్రీకృష్ణమూర్తి యనఁగఁ
గవిజనంబుల నెల్లఁ గాచి రక్షించుచో
రహిమించు శ్రీభోజరా జనంగ
వెలసెను శివాజి చంద్రుని విమలగుణము
లెవ్వరికినైనఁ గల్గునే యెంచి చూడ
ననుచు సకల జనంబులు నభినుతింప
వెలయుఁ దంజాపురంబున వేడ్కమీఱ.

ఆ విభువద్దను నమరియున్నట్టి
శ్రీవిల సత్సదాశివరాయ ఘనుఁడు *
అతుల సౌభాగ్యంబు లమరినవాఁడు
మతిమంతుఁడైనట్టి మంత్రివర్యుండు
అతని సోదరుఁడైన యద్భుతగుణాఢ్యుఁడు
మతిశాలియైనట్టి మాన్యుఁడు జగతి
వితత భుజాబల విఖ్యాతయశుఁడు
ప్రతిలేని సేనాధిపతియైనవాఁడు
ఆర్తజనులఁ బ్రోచు నల కల్పకంబు
కీర్తి గల్గినయట్టి కృష్ణరాయండు
బహు ఉపకారియు భాగ్యపూర్ణుండు
మహనీయ గుణశాలి మంచిసత్ప్రభువు

*   *   *   *

గానవిద్యలలోన ఘనుఁడైనవాఁడు
సేనా ధురంధరశ్రీ గల్గువాఁడు
వరయోగశాలియౌ వరహేంద్ర ఘనుఁడు
పరిపూర్ణ విద్యలఁ బ్రబలినవాఁడు
ఇటువంటి మిత్రులు ఇరువంకఁ గొలువఁ
బటువుగా విలసిల్లు భాగ్య మబ్బంగ
శ్రీ శివాజేంద్రుండు శెలఁగు సద్విభుఁడు
ఆశాంతభూపుల ననువుగాఁ బ్రోచి
ధీచమత్కృతులచేఁ దేజరిల్వాఁడు
భూచక్రవర్తియై పొల్పొందువాఁడు

పారి : వ॥ ఓయీ! సూత్రధారా! ఇటువంటి మహారాజు వంశక్రమంబుఁ దెలుపవోయి.

సూత్ర : వ॥ ఆర్గురు చక్రవర్తులు పదార్గురు రాజులం బోలి రాజ్యంబు చేయుచునుండు శ్రీ శివాజి రాజేంద్రుని వంశక్రమంబు విస్తరంబుగాఁ దెలిపెదను వినుము”

అని తత్క్రమంబును వినిపించును. అటుపిదప కథాక్రమము. తంజపురమున నుండు కొంకణేశ్వర అన్నపూర్ణల పూర్వోదంతము, వారి పరిణయము అను నది యీ నాటకమునందలి ఇతివృత్తము. ఈ గ్రంథము చివర ఈ నాటకమునందు వచ్చు పాత్రలు, ఆ పాత్రధారుల పేర్లుకూడ వ్రాయఁబడి యుండుటచేత ఈ నాటకములు తంజావూరి కోటలో ఇప్పటికి వంద సంవత్సరముల క్రిందటివఱకు ప్రదర్శింపబడుచు వచ్చినట్లు ఊహింపవచ్చును. వీటిని ప్రదర్శించుటకు వేర్వేరు భాగవత మేళము లుండినట్లు తెలియుచున్నది.

ఎవరు రచియించినవో తెలియదు కాని శివాజి సీసములను పేర చాల సీసపద్యములు శివాజి ప్రభువు నభినుతించుచు రచించినవి కలవు.

శివాజి రాజేంద్రుని యాస్థానమున నుండిన జెట్టి (మల్లు) వంశజుడైన వెంకప్పయను కవి శివపారిజాతమను నాటకమును వ్రాసెను. ఇతడు తన్ను గురించి గ్రంథారంభమున నిట్లు చెప్పికొనెను :

మల్లువంశంబున మాత నింబజచేత
చెల్వులై వెలసిన మల్లులందు
కనకయ్య పుత్రుఁడై గమలాక్షు సేవ్యుఁడై
ఘన వనిష్ఠకులుండఁ గవుల బంట
వెంకప్ప యనుకవి చెప్పిన శివకథల్
పుంఖాను పుంఖమై ప్రబలుచుండ
పసిబాలుఁడను నేను పశుపతిం బొగడఁగ
రసికులెల్లను విని రమ్యమొంద

* ఆపస్తంబసూత్రుడు, కౌండిన్యగోత్రుడు, ఓబయామాత్య పుత్రుడు అయిన పోలూరి గోవింద కవి రాగతాళ చింతామణి, తాళదశాప్రాణదీపిక, పర్వత నారదోపాఖ్యానము అను గ్రంథములను రచించెను. రాగ తాళ చింతామణి నతడు కట్టమూరి బుస్సభూపాలశేఖరుని నియోగమున రామచంద్రాంకితముగా రచించెను. తాళ దశా ప్రాణదీపికను సదా శివరాయ నృపతికి అంకిత మిచ్చెను. అతడు పర్వత నారదోపాఖ్యానమును ఈ వంశజుల ప్రోత్సాహమున రచించినదే. తాళ దశాప్రాణదీపిక కృతిభర్త సదాశివరాయ నృపతియు, శివాజి రాజేంద్రుని మంత్రివర్యుడు సదాశివరాయలును ఒక్కరే యగుచో గోవిందన మంత్రి శివాజి రాజేంద్రుని కాలమువాడగును.

వేదములయందు దాగిన వింత యొకటి
హరియుఁ జెప్పంగ నపురూపు హరునికథలు
నారదునిచేతఁ దెలిసెను నాణ్యముగను
ధరణిలో నేను బొగడెద ధర్మనిపుణ.

ఈ నాటకములోని యాశ్వాసాంత గద్యమున నీ శివపారిజాతము "శ్రీరాజమాన్య రాజరాజరాజశ్రీ శివాజి మహీపాలుని తెలుగు కవి వెంకటకృష్ణాజెట్టి కనకాజెట్టి చేసిన" దని యున్నది. పై సీసపద్యములో చెప్పిన దానికి దీనికి వ్యత్యాసమున్నది. మంగళగీతములో నయితము గ్రంథకర్త తాను వేంకప్ప యనియే చెప్పికొనెను. చూడుడు :

"శ్రీ జయము కలుగునని శ్రీ వేంకటుప నేను
శ్రీ వెలయఁ జెప్పితిని శివకథను
జయ మంగళము, నిత్య శుభమంగళము."

ఈ శివపారిజాతమును సావధానముగను సావకాశముగను పరిశీలించిన గాని గ్రంథకర్తను గురించిన విషయము తేటపడదు.

ఈ మహారాష్ట్ర మహీపతుల కాలములో ద్విపద ప్రబంధములు, పద్య ప్రబంధములు, యక్షగానములు నాటకములు, పదములు, కీర్తనలు మాత్రమే కాక ఇంక ననేకవిధములైన గేయ వాఙ్మయము వచ్చినది. నలుగుపాటలు, తలుపు దగ్గర పాటలు, శోభనము పాటలు, ఊయెల పాటలు, బువ్వుబంతిపాటలు, ధవళములు, లాలి పాటలు, జోలపాటలు మంగళము పాటలు,— మొదలైనవి ఎన్ని రకముల పాటలో చాల వచ్చినవి. ఇప్పటికిని ద్రవిడ దేశములోని తెలుగు కుటుంబములలో ఈ పాటల రకములు కొన్ని వాడుకలో నున్నవి. వివాహాది శుభకార్యముల సందర్భమున ఇట్టివి పాడుచుందురు. తెలుగువారితో గల సంసర్గము కారణమున తమిళులుకూడ కొంద రీపాటలు పాడుట కలదు. నేటికిని తమిళ బ్రాహ్మణుల యిండ్లలో వివాహములు జరిగినప్పుడు విధిగా గౌరీకల్యాణముపాట పాడుదురు. ఈపాట పాడినగాని విధ్యుక్తమైన వివాహపు తంతు ముగిసినట్లు కాదు.

మహారాష్ట్ర భూపతుల యాదరణమున వచ్చిన తెలుగు వాఙ్మయమునుగురించి మాత్రమే ఈ వ్యాసమున పరామర్శించినాను. సంస్కృతమున వచ్చిన వాఙ్మయము ఇంతకంటెను అధికముగ నున్నది. కావ్యములు, వ్యాకరణములు, నాటకములు, నిఘంటువులు, అద్వైత వేదాంతమునకు భక్తికి సంగీతమునకు నాట్యమునకు న్యాయమునకు ధర్మశాస్త్రమునకు సంబంధించిన గ్రంథము లనేకము లున్నవి. కాని తెలుగులో నెక్కువగా వచ్చినది గేయ, నాటక వాఙ్మయమే. కావ్యములు ఈకాలములో రాకపోలేదు. కాని సాధారణముగా ఇవి రాను రాను నీరసములైనవి; నేలవములైనవి. రచనలో బిగువు, పటిష్ఠత, జటిలత కొరవడినవి. కాని తెలుగు సాహిత్యములో వచ్చిన యీ లోపమును గేయవాఙ్మయములోని వైవిధ్యము కొంతవరకు పూరించినది. ఈ మహారాష్ట్రుల కాలములో వచ్చిన యక్షగానములు నాటకములు అయినను రచనలో కాని కావ్యగుణములలో గాని ప్రౌఢమయినవి కావు. ఆకాల మెట్టిదో ఆ ప్రబంధములును అట్టివే. కాని ఆంధ్రదేశములో కవులు చేసిన వర్ణనలనే చేయుచు, పూర్వకవులు పోయిన పోకడలనె పోవుచు పాడినదే పాటగా ఒకదాని కొకటి నకలుగా ప్రబంధములు తయారుచేయుచుండిన కాలములో దాక్షిణాత్యాంధ్ర కవులు సాహిత్యమునకు సంగీతమును జతపరిచి యక్షగానాది వివిధవిధములైన గేయప్రబంధములను నిర్మించి ఆంధ్ర సాహిత్య నందనారామమున క్రొత్త కుసుమవాటికలను దీర్చి దానికి నూతనశోభ నొడగూర్చిరి. ఈ నాటకగేయ ప్రబంధ వాఙ్మయ మంతయు చక్కగా పరిశోధింపవలసి యున్నది. తంజావూరి ఆంధ్రనాయకరాజ, మహారాష్ట్ర రాజులకాలములో ఆంధ్రనాగరిక జీవితమును సురభిళము కావించి క్రొత్త సౌందర్యపు వెలుగుతో రంజింపజేసినవి ఈ గేయ ప్రబంధ కుసుమరాజములే.

# అబల

శ్రీ వేలూరి సహజానందం

ఆది కేవలం ఒక విచిత్రమైన ఆలోచనే కాదు. అత్యంత ఘోరమైన ఆలోచన. ఆ అశనిఘాతానికి ఆమె క్షణంసేపు విపరీత భయంతో ఇంచుమించు కొయ్యబారింది. మానసిక వీధిలో ఆ ఆలోచన రేపిన గాలిదుమారం నల్దిక్కులా కమ్మివేసింది.

నిశిరేయి హంతకుని పదధ్వనిలా ఆ ఆలోచన నరనరాల్లో ప్రతిధ్వనిస్తోంది.

దారుణం!

ఈక్షణంలో, ఈ ఒక్క క్షణంలో ఆకసమంతా ఎలా చీకటి తరంగాలతో హోరెత్తింది! మిణుకుమనే నక్షత్రం ఒక్కటి కూడా కనపడ్లేదు.

వందల మైళ్ళ దూరంలో లేడు భర్త. కీకారణ్యంలో చిక్కుకుపోయి లేడు. వ్యాధిగ్రస్తుడై వైద్యులకు, మృత్యుదూతలకు మధ్య దోబూచులాడటం లేదు. ఎదురుగా కుర్చీలో కూర్చొని ఏదో పుస్తకం చదువుతున్నాడు.

అవును. కాని తన ఎడదలో పిడుగుపాటులా పడిన ఆలోచన అతనికి తెలియదు. అతని ధ్యాస భగ్నం కాకుండానే ఉన్నది. చదువుకుపోతూనే ఉన్నాడు.

ఏ మహాభయంకరచ్ఛాయను చూసి తాను జడుసుకుందో, ఆ ఛాయ అతనిపై సోకినట్లే లేదు. ఎంత అమాయకుడు! ఎంత నిర్భీతి! మెడ చుట్టూ ఉచ్చు బిగిస్తున్నా కదలక మెదలక కూర్చున్నాడు.

అతనికేసి తేరిపార చూసింది.

జీవించే ఉన్నాడు.

కాని తనకు దౌర్భాగ్యపు ఆలోచన ఎలా తట్టింది? ఉన్నట్టుఉండి మనస్సుకు ఈ దారుణ స్పృహ ఎలా కలిగింది తన భర్త చనిపోయినట్టు! హఠాత్తుగా ఎవ్వరో వచ్చి తనకు ఆ మరణవార్త విన్పించినట్టు...ఒక్కసారి ప్రపంచమంతా చిమ్మ చీకట్లు కమ్మినట్టు అయింది.

తన ఊహ ఎంత భయంకరమైనదైనా, అది కేవలం అయథార్థం. అయినప్పటికీ ఆమె ముఖంలో దాని ముద్ర ఇంకా చెరిగిపోలేదు అయథార్థం గదా అన్న నిబ్బరం ఆమె మనస్సుకింకా నిలకడ నివ్వలేదు అయథార్థం అనేది బహుశః ప్రస్తుతానికి మటుకే! అంతే! ఇప్పుడది కేవలం ఊహే కావచ్చును కాని ఎప్పటికైనా నిరోధించలేని నిజమే కదా అది? పాపం! భర్తకూ మృత్యువుకూ మధ్య తానెన్నాళ్ళు అడ్డంగా నిలిచి ఉండగలదు? ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళు అని సమ్ముఖంలో కూర్చొని, మృత్యువును రానీకుండా కాపలా కాస్తుంది? అయినా మృత్యువుకు రెండు మార్గాలు. ఒకటి శరీరావస్థ. రెండవది హఠాత్ ప్రమాదం. ఈ రెండు పాశాల్లో ఏ ఒకట్లో తప్పదు ప్రతివాడికి.

అతనింకా చదువుకుపోతూనే ఉన్నాడు. చీమ కుట్టినట్టుకూడా లేదు. తనుమటుకు ఉక్కిరిబిక్కిరి అవుతోంది. మృత్యువు వెంట భర్త నడిచాక, తన గతి ఏంకాను? ఈ క్రూరప్రశ్న ప్రచ్ఛన్నంగా తన నిప్పుడు ఇంతవరకు క్షోభ పెట్టింది.

తన గతి ఏంకాను?

ఇన్నాళ్ళలో ఎప్పుడూ తనకు 'తన గతి' గురించి అసలు ఏమీ పట్టనేలేదు. ప్రవాహంలో హాయిగా సాగిపోతున్న పడవ హఠాత్తుగా ఏ రాతిబండలకో కొట్టుకొని, మునిగిపోవచ్చుననీ, అప్పుడా సుడిగుండాల్లోంచి తనెలా ఒడ్డుకు ఈదుకురావటం అని ఆమె కింతవరకు ఎప్పుడూ ప్రశ్న కలగలేదు.

“తనగతి?”

ఏమిటా గతి?

అదంతా పూర్తిగా అయోమయం. భర్త ఉన్నంతకాలం తనగతి ఏమిటి? ఆ ప్రశ్నకు అసలు అర్థం ఉందో లేదో ఆమెకు తెలియదు. కాని భర్త కనులుమూశాక తనగతి ఏమిటి? ఈ ప్రశ్నకు అసలు అర్థం స్పష్టంగా గోచరించినా, గోచరించక

పోయినా, దాని ప్రతిధ్వనిమటుకు అత్యంత భయంకరంగా ఉంది.

"తనగతి" ఏమిటి?

ఈ ప్రశ్న ఈ ప్రచండమైన ఊహావల్లనే కలిగింది ఇప్పుడు. ఇంతవఱకు ఆ స్పృహలేదు. భర్తతోపాటు జీవిస్తూ ఉండటమే తప్ప, వేఱే 'గతి' ఒకటి ఉంటుందనిగాని, ఉండాలనిగాని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. అనుకోవలసిన అవసరమూ కన్పించలేదు. సంప్రదాయమూ లేదు.

ముత్తవతల్లి ఎప్పుడూ అనేది. "అమ్మాయి! పసుపు కుంకుమతో చనిపోయే అదృష్టం నాకు లేకపోయింది" అని. నిజానికి మృత్యువు ఈ కాస్త ఉపకారం స్త్రీకి చేస్తే, అసలు వేఱే భయంకర ఊహలకు, దైన్యానికి తావుండదు. ఈ మాత్రపు కనికరం మృత్యువుకు ఉంటే, తన ముత్తవతల్లి అలా ప్రతిక్షణం కుమిలిపోతూ ఉండేదికాదు. తనూ ఇలా ఈ హఠాత్తు ఆలోచనతో కంపించిపోయేదికాదు. వేలాది స్త్రీల వేదనలు చెవిలో గింగురుమంటున్నా, మృత్యువు మటుకు ఈ కొద్దిపాటి వరాన్ని ప్రసాదించటంలేదు. సత్యవంతుడిమీదికి పాశం విసరేముందు, సావిత్రి కనులను తన శీతలహస్తాలతో మూస్తే చాలు మృత్యువు. ఇంతకన్న స్త్రీజాతికి వేఱే ఏ కోరిక అక్కరలేదు. కాని మృత్యువు అందు కొప్పుకోదు.

వసంతంలో పుష్పలత తానిప్పుడు. కాని భర్త అనంతరం శిశిరంలో ఆకులు రాలిన మోడు! లోకపు గౌరవాదరాలు తనను సత్కరించవు. ఇక ఉపాధి! కేవలం నిర్ధనికులు కాదు కాబట్టి ఆకలిసమస్య లేదు. అసలు చాలామంది భర్తమృతి తర్వాత జీవికకోసమే పడుతున్న అగచాట్లు దుర్భరం! ఆ నరకయాతన తనకు లేదు. కాని అది లేదన్నంతమాత్రానే లోటు పూర్తికాలేదు. ఉపాధికి లోటు లేకపోయినా, ఆ అనంతర జీవితమంతా అయోమయంగా, సుదీర్ఘ నిశీథంలా వుంది. ఏమిటా అయోమయం! ఏమిటా సుదీర్ఘ నిశీథం! చెఱిగిపోయిన భర్త పదచిహ్నాంలోంచి కనపడే ఆ అగాధమైన లోటులోయ ఏమిటి? గుండెను భగ్గుభగ్గున మండించే ఆ జ్వాల ఏమిటి?

భర్త! అయిదేళ్ళక్రితం అతను పూర్తిగా అపరిచితుడు. ఎట్టి చుట్టరికం కూడా లేదు. ఈ హఠాత్తు ఊహ నిజమే అయితే తదనంతరం అతను మళ్ళీ అపరిచితుడుగానే ఉండిపోతాడు. ఈ అయిదేళ్ల సహజీవితం ఎంత పరవశ మాధుర్యం సేకరించిపెట్టిందో, మళ్ళీ అంత దుఃఖాన్ని, బహుశః అంతకుమించిన దుఃఖాన్ని కూడబెట్టుతోంది. ఈ మాధుర్యానికి, ఆ దుఃఖానికి కారణభూతమైనదేమిటి? కేవల పురుష సాంగత్యమా? లేక మరేమిటి?

తన కొద్దిపాటి చదువుతో కొన్ని పుస్తకాలు చదివింది. పునర్వివాహం, దాని ఆవశ్యకత గురించి తనకు తెలుసు. కాని కేవలం పునర్వివాహం వల్లనే ఈ అయోమయం, అగాధం తొలగిపోతవా? లేక అమావాస్యను మరొక పక్షంవరకూ వాయిదా వేయటమేనా?

పునర్వివాహం? వివాహం?

పీల్చే గాలిగురించి ఏమీ ఆలోచన ఎలా కలగదో, వీటిని గురించీ అంతే. మానసికంగా, అభిప్రాయ రంగంలో సంస్కార ధ్వజంతో పునర్వివాహం అనే భావం జయించినా, నిజానికి ఆదారి తొక్కినవారు బహు కొద్దిమంది. గ్రామాల్లో అసలే లేరనవచ్చును. పునర్వివాహం పునః పురుష సాంగత్యాన్ని చేకూర్చినా, బహుశః ఆ అంతర విషాదాన్ని ఓదార్చలేదేమో. అందుకేనేమో, మైనా ఎవరూ మంగళసూత్రాన్ని ముట్టటానికి మోజుపడటంలేదు మళ్ళీ ధర్మపత్నిగా సంధ్యాదీపం వెలిగించవచ్చు. కాని ఆ లోని చీకటి అలానే గుండెను కుంగదీస్తూ ఉంటుంది. తుపానులో ఇల్లు శిథిలంకాగా, కొత్త ఇంట్లో ప్రవేశించి, ఆ ఖామందు కిటికీవద్ద కూర్చొని అదృశ్య శిథిలగృహం గురించి తలపోసే విధంగానే, కొత్త బాహువులమధ్య పాత పుస్తకాన్నే తిరగవేస్తూ ఉంటుంది మనస్సు. బహుశః అది ప్రథమ పరిచయపు మహిమ ఏమో? ప్రథమ పరిచయ మాధుర్యం తదనంతర పరిచయాలలో ఉండదేమో! మరొక పరిచయంలో తన పవిత్ర నగ్నత ప్రదర్శితమైనట్లు ఉంటుంది. ఆంతర్యమంతా ఆచ్ఛాదన తొలగి నగ్నమై, మూడవకంటికి కనపడిపోతుంది. ఆ లజ్జాభరం దుర్భరంగానే ఉంటుంది. ప్రథమ పరిచయంలోని ఆవేశ తీవ్రత విలీనవేగం, తన్మయత సహజంగా, స్వాభావికంగా సిద్ధిస్తయ్. తర్వాత...తర్వాత...పమిట తొలగిన పడతి తడబాటులా ఉంటుంది.

తన స్నేహితురాలుంది. దురదృష్టవంతురాలు. భర్త మూర్ఖుడు. పశువు. దెబ్బలతో కన్నుమూయని రేయి ఉండదు. ఆమెకు ప్రథమ పరిచయం విష

పాత్ర అయింది. జీవితమంతా ఆమెకు చేదుగానే తోస్తుంది. బహుశః అలాంటి అభాగినులకు మరొక పరిచయం ముక్తిదాయకం కావచ్చు—వారి ఎడదలో తేనె ఇంకిపోకుండా ఉంటేను. కాని తనలాంటి సుభాగినులకు కొత్త దిక్కులకేసి చూడవలసిన అవసరం లేదు. తన ఆకాశంలో ఎప్పుడూ విషాదమేఘం వేలంతకూడా ఆవరించలేదు. భర్త సాహచర్యం తనకెప్పుడూ వేదనను కల్గించలేదు. భర్తలు మూఢులు, పశువులు కాకపోయినా, హృదయస్పందాన్ని ఎరుగని బధిరులుగా ఉన్నవారూ ఉన్నారు. వారి భార్యలు ప్రియుల పరిచయంకై పరితపించవచ్చు. తనకలాంటి బధిర భర్త ప్రాప్తించలేదు. తనకు తీగె వేఱు, కుసుమం వేఱుకాదు. తన పందిరిపై పెనవేసుకొని, అల్లుకున్నది సుపరిమళ సుమభరితమైన సన్నజాజి.

ఆ ఘోరసంఘటనానంతరం ఆ అగాధ అయోమయాన్ని ఏ పరచ్ఛాయ నింపివేయలేదు. మరెలా తను బతికేది? ఒహ్! తనగతి ఏంకాను?

అదే! అవును...తనగతి?

తనగతి?

ఏమిటది?

తన జీవితం ఎంత డోలుగా ఓటిగా ఉంది? ఎందుకని జీవించటం? ఎందుకని మరణించకుండా ఉండాలి? ఊహు...ఈ చైతన్యం తనలో ఇంతవఱకూ మేల్కొనలేదు. మేల్కొన్నాక ఊపిరి సలపనివ్వటంలేదు. తనూ, భర్త ఎన్నెన్ని విషయాల గురించో తర్కించారుగాని, ఈ తులసికోటచుట్టూ ఎప్పుడూ ప్రదక్షిణం చేయలేదు. జీవించిఉండగానే భర్తనుంచి ఈ రహస్యం, తెలుసుకోవాలి. తన గతి రూపురేఖ లనేవి ఏమిటో అతని వెలుసండగానే చూసుకోవాలి. అతనికి తెలుసునో లేదో? తెలిసి ఉంటే ఎప్పుడైనా మాటవరసకైనా ఆ ఊసు ఎత్తేవాడు.

వెనకనుంచి దీర్ఘమైన,ఉద్రిక్త నిశ్వాసం వినబడి అతను వెనక్కు చూశాడు. కుర్చీలోంచి తొట్రుపాటుగా లేచివచ్చి, నుంచొనిఉన్న ఆమె కళ్ళలోకి చూశాడు. తుపానుగాలి కక్కడ తెఱచాప చినిగి చినిగి చీలికలు పేలికలు అయిపోతోంది. అక్కడి ఇంటి నడికప్పుకు నిప్పు అంటుకుంది.

భయసంభ్రమాలతో అతను ఆమెను తన ప్రేమభరిత హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు— ఊయ్యాలలో ఉలిక్కిపడిన పసిశిశువును తల్లి వక్షస్సుకు అదుముకున్నట్టు. కాని ఉండేలు దెబ్బ తిన్న పిట్టవలె ఆమె గుండె ఎందుకు కొట్టుకుంటోందో అతనికి తెలియదు.

“దేని కంతె భయం?” అని కంపిత స్వరంతో అడిగాడు. ఆమె కళ్ళలోకి చూశాడు. ఆమె నిశ్వాసాల్లోంచి జవాబేమీ వినబడలేదు.

తన బాహువుల మధ్యకూడా ఆమె ఇంకా అల్లల్లాడుతూనే ఉంది. కాని క్రమంగా అతని శరీరం ఇచ్చే అభయంలో ఆమె భయం తీరిపోయింది!

క్షణకాలంలో ఆమె పెదవులపై చిన్ని చిరునవ్వు మొలకెత్తింది. భయ ఝంఝామారుతాల మధ్య నిశ్చలంగా వెలిగే ప్రేమజ్యోతి ఆమె కళ్ళలో నిశ్చల దీపకళికలా మెరిసింది. ఆ ఆనంద తన్మయత ఆమెకొక దివ్యానుభూతిగా భాసించింది!

# లలితాసహస్రనామములలో దేవీ స్వరూపము

శ్రీ డి. యస్. శర్మ

(గత సంచిక తరవాయి)

## 11

వేదాంత, సాంఖ్య, శైవ సిద్ధాంతములనుండి దాని ఉద్దేశముల కనుకూలమగు అభిప్రాయములను తాంత్రికతత్వశాస్త్ర మేరీతిని గ్రహించినదో, అట్లే మీమాంస, యోగ, దర్శనములనుండికూడ గ్రహించినది. శబ్దము, అర్థము—మాటలు, వాటి భావములు—నిత్యములని మీమాంసకులు విశ్వసించిరి. ఒక మాటకు గల అర్థము వారి మతరీత్యా లోకసాంకేతికముపై నాధారపడదు. దాని స్వధర్మమునకు చెందియుండును. మాట నిత్యముగాన దాని నిర్వచనము కూడ నిత్యమే. మాటలోని యక్షరములను చేర్చి యుచ్చరించునప్పుడు అందలి వివిధములగు అక్షరముల శబ్ద సమ్మేళనమే మనకు వినిపించును; మాటకును మాటలోని అక్షరములకును ఏ భేదము లేదు. శబ్దార్థములు అచేతనములని మీమాంసకుల నమ్మకము. శబ్దార్థములు నిత్యములను మీమాంసకుల సిద్ధాంతము తాంత్రికులంగీకరించిరి కాని, ప్రపంచ మెట్లు శివశక్తుల స్వరూపమో, శబ్దార్థములు కూడ అట్టి స్వరూపములే యని నొక్కి వక్కాణించిరి. వారి సిద్ధాంతమందలి పరాబిందువును శబ్దబ్రహ్మమని మాత్రమే అనక శబ్దార్థ బ్రహ్మమన్నారు. ఏమనగా, అది శబ్దములకు అర్థములకు మూలకారణము కనుక. శబ్దము, అర్థము—మాటలు, పదార్థములు—రెండును శక్తి స్వరూపములే. శబ్దము వర్ణాత్మకము గాన, వర్ణమాలయందలి అక్షరములయందు ప్రపంచముయొక్క నిర్మాణ శక్తి ఇమిడియుండెనని తాంత్రికులు నిశ్చయించిరి. నిర్మాణ శక్తియొక్క వివిధ వ్యాపారములకు వివిధాక్షరములు సంజ్ఞలు. మాతృక, లేక, సంగ్రహరూపముగ మాత, యని ఆ యక్షరముల కూడికకు పేరు. అందుచేత మంత్ర మనునది కేవలము శబ్దములయొక్క కూడిక మాత్రమే కాదని, మంత్రాధి దేవతయొక్క సూక్ష్మరూపమని, చెప్పునట్టి ప్రసిద్ధ సిద్ధాంతము పుట్టుచున్నది. మరియు మంత్రాధి దేవతతో నైక్యమును పొందుటయే మంత్ర ధ్యానోద్దేశ్యము. సృష్టి సంకల్పము నిర్మాణశక్తి రూపమును పొందుటకు పూర్వము ఎన్నో స్థితులను దాటవలసినట్లే, చెవికి వినిపించుటకు పూర్వము శబ్దము కూడ అనేకావస్థలను దాటవలెను. ఈ యవస్థలకు పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ, యని పేళ్ళు. ప్రపంచ పరిణామమందు పరాశక్తికి కలుగు వివిధ స్థితులవంటివే ఈ యవస్థలని విశ్వసించబడినది. శబ్దముయొక్క, అర్థముయొక్క, నిత్యత్వ సిద్ధాంతమును మీమాంసకులనుండి తంత్రములు గ్రహించి, చైతన్యమయమగు శక్తి సిద్ధాంతముచేత దానిని మార్చివేసినవి. ఈ మార్పు మన మంత్రశాస్త్రముయొక్క యసాధారణమైన యభివృద్ధికి కారణమైనది; అనుష్ఠానమందు అద్భుతమైన ఫలితములను కలిగించినది.

దేవీ పూజా విధానమందు మిక్కిలి ప్రసిద్ధమైన మంత్రము, పంచదశాక్షరీ మంత్రము. పేరులో సూచింపబడినట్లుగా పదియేను బీజాక్షరములా మంత్రమందు గలవు. అగ్ని అధిష్ఠాన దేవతయైన వాగ్భటకూటము, సూర్యుడధిదేవతయగు కామరాజ కూటము, సోము డధిష్ఠాతయైన శక్తికూటము, అను మూడుకూటములుగా ఆ మంత్రము విభజింపబడినది. ఈ మంత్రము సూత్రమువంటిది కాదు. దీనిని పదేపదే ఉచ్చారణ చేయకూడదు. మంత్రము సూక్ష్మరూపిణియైన దేవియే. దీనిని శాక్తేయులయొక్క గాయత్రి యని చెప్పవచ్చును. గాయత్రితోను, దేవితోను, తత్వములతోను, శ్రీచక్రముతోను, ఇంకను మరి కొన్నింటితోను ఈ మంత్రమునకుగల యవినాభావమును పదిహేను వివిధమార్గములచేత స్థాపించుటకై, లలితా సహస్రనామమునకు సుప్రసిద్ధ వ్యాఖ్యానమైన వరివస్యారహస్యమను గ్రంథమునకు కర్తయైన భాస్కరాచార్యుడు చాలా శ్రమతీసుకున్నాడు.

త్రిపాదా—మూడు పాదములు కలది—యని సాధారణముగా చెప్పబడు గాయత్రియందు, రహస్యముగా దాచబడి, కొద్దిమంది నిపుణులకు మాత్రము ఉపదేశింపబడే నాల్గవపాదముకూడ ఉన్నట్టుగానే, ఈ పదిహేను బీజాక్షరముల మంత్రమునకుకూడ రహస్యముగా దాచబడిన పదియారవ బీజాక్షరము కలదు. ఈ పదియారవ బీజాక్షరమునుకూడ చేర్చినప్పుడు దీనిని షోడశాక్షరీ మంత్ర మందురు. ఈ ప్రాతిపదికల నాధారము చేసికొనినచో, లలితా సహస్రనామమందలి — 'మాతృకావర్ణరూపిణీ', 'పంచాశత్పీఠరూపిణీ', 'సర్వమంత్ర స్వరూపిణీ' వంటి నామములయొక్క, 'పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపా' యను పదములయొక్క భావమును తెలిసికొనుటకు తగిన స్థితి ఏర్పడగలదు.

పంచదశాక్షరీ మంత్రములోని బీజాక్షరములు స్పష్టముగా గాని, గూఢముగా గాని సహస్రనామములో చెప్పబడలేదు. కాని మూడు కూటములు చెప్పబడినవి. దేవియొక్క ముఖమునకును, శరీర మధ్యభాగమునకును, అవయవములకును, ఆ మూడు కూటములకును గల ఏకత్వము ఈ క్రిందినామములలో చెప్పబడినది ఇవి:—'శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖ పంకజా', 'కంఠాద్య కటి పర్యంత మధ్య కూట స్వరూపిణీ', 'మూల మంత్రాత్మికా', 'మూల కూట త్రయ కళేబరా', 'శ్రీ షోడశాక్షరీ విద్యాత్రికూటా', మొదలైనవి. ప్రసంగవశాత్తు ఒక విషయము చెప్పవలసి యున్నది. లలితా సహస్రనామము పంచదశాక్షరీ బీజములను చెప్పకున్నను మూడువందల నామములు మాత్రముగల లలితాత్రిశతిలో ఒక్కొక్క బీజాక్షరముతో ప్రారంభమైన ఇరువది నామములుద్వారా మంత్ర బీజములు వింతమార్గమున సూచింపబడినవి.

## 12

స్పష్టోచ్చారణగల భాషోత్పత్తియందే గాక, మానవశరీరమందుగూడ నిర్మాణాత్మకమగు ప్రపంచ విధానము గోచరించుచున్నదని తాంత్రిక తత్త్వ శాస్త్రము చెప్పుచున్నది. మానవుడు విశ్వముయొక్క సంగ్రహరూపమని, సూక్ష్మప్రపంచమునను, విశ్వమునకును, సరియైన సామ్యమున్నదని, పిండాండ బ్రహ్మాండములయొక్క నియమములు సమానములని, ప్రాచీనుల యభిప్రాయము. ఇదే అనేకరీతులుగా ఉపనిషత్తులలో చెప్పబడినది. దీనినే, ఉపాసనా పద్ధతికి పునాదిగా తంత్రములు ఏర్పాటు చేసికొన్నవి. వర్ణమాలయందు ఇమిడియున్నదని భావింపబడు నిర్మాణ శక్తి, మానవశరీరమందలి నరములయొక్క కేంద్రముల యందుకూడ నున్నదని భావింపబడినది. బాహ్య ప్రపంచ సృష్టిక్రమము, స్పష్టోచ్చారణ గల భాషోత్పత్తి, నరముల కేంద్రములతో కూడిన మానవశరీర నిర్మాణము, ఇవన్నియు, తాంత్రిక మతరీత్యా, ఆదిశక్తియొక్క వ్యక్తరూపములే. విశ్వమూలముల యందు, మాటలధ్వనియందు, కలవిద్యచ్ఛక్తే, మానవ శరీరమందుకూడ నిస్సంశయముగా కలదు. తాను ఏరుకపరచిన మంత్రములయందు, తాను సృజించిన ప్రపంచములయందు, ఎటుల నిండియున్నదో, అట్లే మనయందుకూడ, దేవి నిస్సంశయముగా ఉన్నది. అందుచేత, మానవదేహమందలి నరముల ప్రోగుల అల్లికలు అనే చక్రములయందు లక్ష్యమునిడి ధ్యానించి, మనయందు దణగియున్న దివ్యశక్తిని ప్రజ్వలింప జేయుటయే, దేవిని తెలిసికొను మార్గములలో ఒకటియై యున్నది.

ఈ చక్రములను సాంకేతికముగా పద్మములతో పోల్చుదురు. ప్రతిచక్రమునకును నియమిత సంఖ్య గల దళములు, అధిష్ఠానదేవత, [౧]తత్త్వము, వర్ణము, భావము కలవు. ఈ పద్మములయందు ముఖ్యమైనవి, మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ అనునవి. సాధారణముగా వీటిని మూడుగుంపులుక్రింద విభజింతురు.

(1) అగ్నిఖండము:— వెన్నెముకకు తుదిభాగమందు, కటిప్రదేశములో కల మూలాధారము, జననేంద్రియములకు కొంచెముపైగానున్న స్వాధిష్ఠానము చేరిన గుంపునకు అగ్నిఖండమని పేరు. ఈ గుంపునకు పైన బ్రహ్మగ్రంథి కలదు.

(2) సూర్యఖండము:—బొడ్డు దగ్గరగా ఉన్న మణిపూరము, హృదయమునకు దగ్గరగానున్న అనాహతము చేరిన గుంపునకు సూర్యఖండమని పేరు. వీటిపైని విష్ణుగ్రంథి కలదు.

(3) చంద్రఖండము:—గొంతుకదగ్గర గల విశుద్ధము, భ్రూమధ్యమందు గల ఆజ్ఞ కలసిన గుంపునకు చంద్రఖండమని పేరు. వీటిపైని రుద్రగ్రంథి కలదు.

౧. తత్త్వముల విషయములో అభిప్రాయ భేదముకలదు. మణిపూర చక్రము తేజస్సంబంధమని షట్చక్రనిరూపణమందు, అప్సంబంధమని సౌందర్య లహరియందు చెప్పబడినది.

దినదినమునకు
ఇంక మృదువైన
టువంటియు,
ఇంక మనోహరమై
నటువంటియునైన
చర్మము





రెక్సోనాలోని **కేడిల్‌తో** ఈ
అద్భుతమైన మార్పును మీరు తెచ్చుకొంటారు.

కేడిల్‌తోగూడిన రెక్సోనా సబ్బును ప్రతిదినము వాడండి. అది దినదినము మీ చర్మమునకు క్రొత్త ఆరోగ్యమును, క్రొత్త మనోహరత్వమును తెచ్చును.




# రెక్సోనా

ఇది ఒక్కటే కేడిల్*తో గూడిన సబ్బు

* చర్మమును పోషించేటటువంటియు, చర్మమును మెత్తగాచేయునటువంటియునైన నూనెల ఒక ప్రత్యేక మిశ్రమమునకు రిజిస్టర్డ్ పేరు.



రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్‌వారికై ఇండియాలో తయారుచేయబడినది

ముఖ్యమైన ఈ ఆరుచక్రములపైన నెత్తి మీదను, సహస్రార చక్రము కలదు. ఇది సహస్రదళ పద్మము. ఇదే శివ-శక్తిస్థానము. పృథివి, అప్పు, తేజస్సు, వాయువులకు సంబంధించిన ఏ తత్త్వమందైనను మనస్సును లగ్నము చేసి ధ్యానించినచో, సాధకుడా తత్త్వముతో ఐక్యము పొంది మనోబలముచేత పైనున్న తత్త్వములతో ఐక్యమును క్రమముగా పొంది, తుదకు ప్రకృతి బంధ విముక్తుడగునని యోగదర్శనము చెప్పుచున్నది. ఈ శిక్షాక్రమమునే తంత్రము లవలంబించినవి. మూలాధారమందు చుట్టలు చుట్టుకుని యున్న కుండలినీ శక్తిని మేలుకొలిపి, ఒక తత్త్వమునుండి ఇంకొక తత్త్వమునకు క్రమముగా దాటుచు, మూడు గ్రంథులను భేదించుకొని, తుదకు సహస్రార చక్రమును చేరి శివైక్యము పొందునట్లు, ఉచితరీతిని సాధకు డభ్యసించవలెనని తంత్రము లుపదేశించుచున్నవి. సాధన పరమావధియైన ఆత్మసాక్షాత్కారమును ఈవిధమున సాధకుడు పొందగలడు.1

ఇక్కడ ఒక విషయము గమనించవలసి యున్నది. ఈ చక్రములను నరములయొక్క కేంద్రములని అనుచుంటిమి కాని నవీన శారీరక నిర్మాణశాస్త్రమందు గాని అట్టివి కానరావు. అందుచేత వాటిని మానసిక తత్త్వమందలి అంతరములుగా చెప్పవలెను. కాని శారీరకముగ నరముల అల్లికలని చెప్పవీలులేదు. అందుచేత కుండలినీ యోగసాధనను వేరు రీతిని వివరించవలసియున్నది. ఎట్లనగా — ఏకాగ్రచిత్తుడైన సాధకునియొక్క ఎఱుక, ఒక అంతరమునుండి పై యంతరమును క్రమక్రమముగా పొందుచు వృద్ధి చెందును. ఈ క్రియలో ఆధ్యాత్మికములగు విషమస్థితులను కొన్నిటిని దాటవలసి వచ్చును. దీనినే గ్రంథులను భేదించుటయని చెప్పుచున్నాము. ఈ సాధనక్రమము సాగిన తరువాత సాధకుడు పూర్ణమైన ఎఱుక కలవాడగును, సర్వజ్ఞుడగును. దీనినిబట్టి షట్చక్ర భేదమతమునకును పంచదశాక్షరీ మంత్రోపాసనకును సామ్యమున్నదని గ్రహించవలసియున్నది. ఏమనగా, చక్రములయొక్క మూడు ఖండములు, మంత్రముయొక్క మూడు కూటములకు సరిపోవుచున్నవి.

1. సహస్రారమందు సంభవించే ఈ జీవాత్మ, పరమాత్మలయొక్క శాశ్వత సంయోగమునే, సప్తమ స్థితిని పొందుట యందురు. (శ్రీరామ కృష్ణ.)

లలితా సహస్రనామములో కుండలినీ యోగ సంబంధములగు నామములను గ్రంథకర్త విరివిగా పేర్కొనియున్నాడు. అందుచేత కుండలినీ యోగమును గురించిన వివరములను తెలిసికొను నవసరము మనకు కలిగినది. చక్రములకు, గ్రంథులకు సంబంధించిన నామములు ఉదాహరణ నిమిత్తము (99 నుండి 110 వరకు గల నామములు) క్రింద నివ్వబడినవి.

మూలాధారైక నిలయా, బ్రహ్మగ్రంథి విభేదినీ, మణిపూరాంతరుదితా, విష్ణుగ్రంథి విభేదినీ, ఆజ్ఞాచక్రాంతరాలస్థా, రుద్రగ్రంథి విభేదినీ, సహస్రాంబుజారూఢా, సుధాసారాభివర్షిణీ, మొదలైనవి.

వీటితో తృప్తిచెందక సుమారు అరువది నామములను (సంఖ్య 475 నుండి 534 సంఖ్య వరకు) గ్రంథకర్త చెప్పియున్నాడు. సప్తచక్రములయందు నివసించు, ఢాకినీ, రాకినీ, మొదలగు సప్తశక్తుల గురించి అనేక వివరములను, విసుగు కలిగించేటట్లుగా ఆ శక్తులయొక్క ఆకారములను, వర్ణనములను, రుచులను, ఆయుధములను, పరిచారకులను, గురించి చెప్పినాడు.

ఈ శక్తులన్నియు పరమేశ్వరియొక్క వివిధ స్వరూపములుగానే భావింపబడినవి.

## 13

ప్రపంచమును దివ్యముగా పరిపాలించుటకై వివిధ తరగతుల నేర్పరచి, ఆ తరగతులకు ప్రతినిధులుగా దేవతలను ఏర్పరచి, వారికి తగినట్లుగా లోకములను, వాహనములను, ఆయుధములను కల్పించినట్టి ఒక విశిష్టమగు సాంకేతిక విధానము మన పురాణములయందు సర్వసామాన్యమై యున్నది. దీనిమీదనె మనశిల్పము, చిత్రకళ ఆధారపడి యున్నవి. ఒక్కొక్కసారి ఈ సాంకేతిక విధానము మితిమీరి వెఱ్ఱి తలలుకూడ వేయుచుండును. ఈ బాహ్యప్రపంచము వలెనే మనయందొక అంతరప్రపంచము కలదు. దానిని పరిపాలించుటకై ప్రతినిధుల నేర్పాటు చేయుటలోను, భగవంతుని తెలిసికొనుటకై ఏర్పరచిన మానసిక సంబంధమైన వివిధాంతరములను సూచించుటలోను తంత్రము లీమార్గమునే అవలంబించుచున్నవని మనమెరిగినదే. ఇంతేకాదు, శక్తులకు ప్రతినిధులుగా యంత్రములనే రేఖాచిత్రములను తంత్రశాస్త్ర ముపయోగించుచున్నది. బల, సత్వములు స్వభావముగా గల శక్తిని, సరళ, వక్రరేఖల

తోను, నాటి సంపుటులతోను చిత్రించుట యుక్తమే. ఏమన, నిరాడంబరమైన రేఖలు, బిందువులు కల చిత్రమే, మానవాకృతి ఘనరూపమున చెక్కబడిన విగ్రహముకంటెను, రంగుల చిత్రముకంటెను, నిస్సందేహముగా మేలైన ఆధ్యాత్మిక చిహ్నము. ఇందుచేతనే ప్రాచీనము ప్రతీకోపాసనకంటె, యంత్రోపాసనమే, మేలైనదని తంత్రములు పాటించుచున్నవి. తాంత్రిక మతరీత్యా, ఇతరయంత్రము లన్నింటికంటె ప్రసిద్ధమైన శ్రీచక్రము శ్రేష్ఠమైనది. శ్రీవిద్యోపాసనలో ఇదే ముఖ్యమైన వస్తువు.

మరియు, పంచదశాక్షరీ మంత్రమువలెనే శ్రీచక్రముకూడ ఒక దేవీస్వరూపిణిగా భావింపబడినది.* దివ్యమాతయొక్క మహత్తును శబ్దరూపమున వెల్లడిచేయు మంత్రమువంటిదే ఆ మహత్తును రేఖారూపమున వెల్లడిచేయునట్టి యంత్రము. శివ-శక్త్యాత్మకమగు దేవియొక్క నిజస్వరూపమునకేగాక, మానురూపములుగా పైకి కనిపించునట్టి, సూక్ష్మప్రపంచము లగు మానవశరీరవర్ణమాలలకు, మహాభూతయుతమగు విశ్వమునకు, కూడ శ్రీచక్రము ఒకగుర్తు.

శ్రీచక్రమునుగురించి మనకందరకు కొంతకొంత తెలుసును. ఒకదానిలో ఒకటి చిక్కుకొనియున్న త్రికోణములతో అది నిండియుండును. అది వలయాకారము కలది. కేంద్రమందు బిందువుండును. అధోముఖముగానున్న యైదు త్రికోణముల మొనలు, ఊర్ధ్వముఖముగానున్న నాల్గు త్రికోణముల మొనలు, ఈ వలయములో నిలువుగానున్న వ్యాసమందమర్పబడి యుండును. మొదటి యైదుత్రికోణములను శక్తిని, రెండవ నాల్గు త్రికోణములును శివుని సూచించును. వీటికి శివయుతులని, శ్రీకాంతులని యథాక్రమముగా పేరు. ఒకదానితో ఒకటి చిక్కుకొనియున్న ఈ తొమ్మిది త్రికోణములు గల వలయమునుచుట్టి ఏకకేంద్రవలయములు రెండు కలవు. వీటిని, సాంకేతికముగా పద్మములందురు. లోపలి వలయము అష్టదళపద్మము, పై వలయము షోడశదళ పద్మము. పై వలయముయొక్క పరిధి ఏకరేఖగాక దగ్గరగానున్న మూడురేఖలుగా గుర్తింపబడినది. ఈ బొమ్మయంతయు చతుర్భుజముచేత చుట్టబడి యున్నది. దీని నాల్గు వైపులయందు దగ్గరగా వ్రాయబడిన మూడు సమాంతర రేఖలు కలవు. మరియు, నాల్గుప్రక్కలయొక్క మధ్యభాగములయందు నాల్గుద్వారము లున్నవి. ఇట్లేర్పడిన చిత్రమందు తొమ్మిదిభాగములు కలవు. వీటిని సాంకేతికముగా చక్రములందురు. లయక్రమముగా, అనగా పైనుండి కేంద్రమువైపుగా లెక్కించినచో, అవి ఈ క్రిందిక్రమమున నుండును:—

(1) భూగృహమనే మూడురేఖలుగల చతుర్భుజము.

(2) షోడశదళ పద్మము.

(3) అష్టదళ పద్మము.

(4) చతుర్దశారమను పదినాల్గు త్రికోణములు గల చక్రము.

(5) బహిర్దశారమను పైనున్న దశత్రికోణ చక్రము.

(6) అంతర్దశారమను లోపలనున్న దశత్రికోణ చక్రము.

(7) అష్టకోణ చక్రము.

(8) లోపలయున్న త్రికోణము.

(9) కేంద్రమందలి బిందువు.

ఈ భాగముల కన్నింటికిని సాంకేతిక నామములు కలవు. ప్రతి భాగమునకును ప్రత్యేకమగు రంగు కలదు. ఇక్కడ ఈ వివరముల నియ్య నవసరములేదు కాని, కేంద్రమందలి బిందువు సర్వానందమయ నామము కలదని, దాని రంగు ఎరుపని మాత్రము చెప్పవలసియున్నది. ఇది కామేశ్వరీ—కామేశ్వరుల కలయికను దెల్పునట్టి త్రిపురసుందరి, లేక, లలితాంబికా నామము కలది.

ప్రపంచముయొక్క తత్వములకును, అక్షరమాలయొక్క వర్ణములకును, మానవశరీరముయొక్క చక్రములకును, చివరకు మాసముయొక్క తిథులకును, సంవత్సరముయొక్క దినములకును, ఈ శ్రీ చక్రముయొక్క తొమ్మిది భాగములకును, కల సామ్యములను చాలా శ్రమతీసుకుని విమర్శకులు చెప్పియున్నారు. మరియు, ప్రత్యేక కార్యనిర్వహణ ధర్మము గలిగి, పరాశక్తి కనువర్తులైనట్టి వివిధ ఆవరణ దేవతలచేత ఒక్కొక్క భాగము కాపలా కాయబడుచున్నట్లు

* చక్రశ్యాపి మహేశాన్య న
భేదలేశోపి భావ్యతే విబుధైః:—కామకళావిలాసము.

చెప్పబడినది. ఉదాహరణకు—బిందువులో, దేవిని చుట్టుకుని పదిహేనుగురు నిత్యలు కలరు. శ్రీ చక్రము లోని భాగములయం దధిష్ఠించియున్న దేవతలను, ప్రత్యేక దేవతలక్రింద పరిగణించవలయునని ప్రారంభ దశనున్న సాధకునికి బోధింపబడినది. ప్రపంచమును, మానవుని, అతని వాక్కును సృజించి వాటియందు నిండియున్న ఆదిశక్తిలో ఈ దేవతలందరు అంతర్భూతులని తరువాతి దశలోను, సాధకుడే శ స్వరూపుడని, ఆఖరు దశయందు, చెప్పబడినది.

తాంత్రిక తత్వశాస్త్రముయొక్క మూలసూత్రములకు శ్రీచక్రము చిహ్నమని పర్యవసానము. తాంత్రిక పూజావిధానమందు దీనికిగల నిరుపమానమైన స్థానమున కిదే కారణము. లలితా సహస్రనామమందలి ఈ క్రిందినామములు ఈ విషయమును తెలుపుచున్నవి—శ్రీ చక్రరాజ నిలయా, చక్రరాజ నికేతనా, త్రికోణాంగా, త్రికోణాంతర దీపికా.

## 14

పంచదశాక్షర మంత్రోపాసన, కుండలినీ యోగాభ్యాసము, శ్రీచక్రముయొక్క పూజా భావనలు, తాంత్రిక సాధనలో ప్రధానాంగములైనను, సర్వసాధారణమై, నిష్కాపట్యమైన భక్తిభావమునకుకూడ ఒక విశిష్టమైనస్థానము తాంత్రిక విధానమందు కలదు. దీనికి ప్రమాణమును దేవీభాగవతమందలి యేడవభాగమున 37వ ప్రకరణములో చూడవచ్చును. లలితా సహస్రనామమందలి ఈ క్రింది నామములు ఈ విషయమునకు తార్కాణములై యున్నవి.

భక్తిప్రియా, భక్తిగమ్యా, భక్తిమత్కల్పలతికా, భక్తమానసహంసికా, భక్తచిత్తకేకిఘనాఘనా మొదలైనవి.

నిజభక్తిపూరితములై, నిష్కపటము లగు ఇట్టి నామములే సర్వే సర్వత్ర ఆదరణీయములై యున్నవి. సహేతుకముకాని సిద్ధాంతములను, ఏదో ఒక పురాణ గాథా వివరములను, తెలుపుడుచేయు నామములు ఏదో ఒక తెగవారికే మోదమును గూర్చును. లలితా సహస్రమందలి భక్తియుక్తమైన నామములు శాశ్వతమగు విలువ గల భాగముగా అందుచేతనే చెప్పబడుచున్నవి. అన్ని దేశములకు, అన్ని కాలములకు చెందిన భక్తులయొక్క అనుభవములను సూచించునట్టి నామములు శుద్ధమైన, పదారువన్నె బంగారువంటివి. కుండలినీయోగచక్రములకు కాపలా గాయునట్టి మూడు, నాలుగు, తలలు గలిగినట్టి రాకినీ, లాకినీ శక్తులతోను, భండాసురునితోను, జరిగిన యుద్ధసంబంధములగు నామములును, దేవియొక్క శారీరిక సౌందర్యమును వర్ణించు నామములునుకూడ, ఎంత వినసొంపుగానున్నను కాకి బంగారుతో పోల్చతగినవే. ఇవి శ్రేష్ఠతరమైనట్టియు మొదటి తరగతికి చెందినట్టియు నామములు క్రింద పేర్కొనబడినవి.

అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖసుదుర్లభా, అభ్యాసాతిశయజ్ఞాతా, అవ్యాజ కరుణామూర్తిః, కరుణారససాగరా, వందారుజనవత్సలా, సద్యఃప్రసాదినీ, విశ్వసాక్షిణీ, సాక్షివర్జితా, ప్రేమరూపా, ప్రియంకరీ, స్వర్గాపవర్గదా, భావజ్ఞా, భవరోగఘ్నీ, భవచక్రప్రవర్తినీ, మొదలైనవి.

## 15

తాంత్రికసాధనలో మంచి, చెడ్డకూడ గలవని అంగీకరించి తీరవలెను. శక్తి పూజావిధానములలో కొన్నిటియందు మనుష్య బలులు, సిగ్గుమాలిన కర్మకాండ, నీతిమాలిన ఉన్మత్తతాండవములు ఉన్నట్టుగా సారస్వతము, చరిత్ర, నిస్సందేహమైన సాక్ష్యమిచ్చుచున్నవి. తాను రచించిన హైందవ సారస్వత చరిత్రలో విన్టర్ నిట్జు చక్కగా చెప్పినాడు:—

“పరదేవతను గురించిన యుదాత్త భావములు, నిగూఢములగు తత్వశాస్త్రసంబంధము లగు యోచనలుగాక, దుర్భరములగు మూఢ విశ్వాసములు, మిక్కిలి అయోమయమగు రహస్య మత విషయములు కూడ, శాక్తేయమందు, దానియొక్క యుద్గ్రంథము లగు తంత్రములయందు కానవచ్చును. మరియు, నిష్కళంకములైన సాంఘిక ధర్మములు, కర్కశమైన వైరాగ్యముతోపాటు, మిక్కిలి హేయమైన అవినీతిని బోధించునట్టి దుర్భరమగు మధుపానమత్తులై ఒడలెరుగకచేయు చేష్టలతో వికారము జెందిన మతసిద్ధాంతములు కూడ, ప్రక్కప్రక్కనే మనకు గోచరించును.”

దేవియొక్క పూజావిధానములో, వివిధ జాతుల వారి పూజావిధులు కలసియున్నవని మన మిదివరలో గ్రహించియున్నాము. మనదేశమందలి కొన్ని కొన్ని ప్రాంతములయం దింకను, ప్రామాణికమైన వేదమతములోనికి ఆ విధానములన్నియు లీనముకాలేదు. వేదమత సమ్మతములు కాకున్నను ఆయాచారములు,

అభ్యాసములు నిరాటంకముగా సాగజొచ్చినవి. సంఘమందలి పై తరగతులవారు కూడ వీటి నభ్యసించుట తటస్థించగానే, వేదవాఙ్మయములో అక్కడక్కడ చెదరియున్న కొన్ని వాక్యములయాధారముతో నిర్మించిన అసత్య తత్వశాస్త్ర సిద్ధాంతముల ద్వారా అవి సమర్థింపబడజొచ్చినవి. శక్తినవారందరు, అధికారభేదమును హైందవ సిద్ధాంతానుసారముగా, యీ సమర్థనలను సహించిరి. దేవీభాగవతములో నొకచోట ఇలా చెప్పియున్నది చూడండి. "వేదవిరుద్ధములగు తంత్ర గ్రంథములకు బ్రాహ్మణా లధికారులు కారు. వేదములయందెట్టి హక్కులేని వారే ఆ గ్రంథముల కధికారులుగా ఉండగలరు."[1] ఇంకొకచోట ఇట్లున్నది. "వైదికులు తంత్రనిబంధనల ననుసరించకూడదు. తాంత్రికులు వైదికనిబంధనల ననుసరించకూడదు."[2]

అందుచేత, శక్తిపూజ చేయువారిలో రెండు పెద్ద తెగ లేర్పడినవి—వేదమతాచారముల నవలంబించువారని, వేదవిరుద్ధమైన తాంత్రిక కర్మకాండల నవలంబించువారని. మొదటివారు దక్షిణాచారమునకు రెండవవారు వామాచారమునకు, సంబంధించినవారుగా భావింపబడిరి.[3] శబ్దకల్పద్రుమములో "వామో విపరీతో వేదవిరుద్ధో వా ఆచారః" అని, వామాచారము నిర్వచించబడినది. సిద్ధాంత సంబంధమైనట్టివే గాక, ఆచారకాండకు సంబంధించినట్టి విభేదములు కూడ ఈ రెండు తెగల శాక్తేయుల మధ్య గలవు.

(i) శివశక్తులకు విశుద్ధమైన సామ్యము కలదని దక్షిణాచారావలంబులు నమ్మెదరు. (i) అనుష్ఠాన (ii) అధిష్ఠాన (iii) అవస్థా (iv) నామ—రూప, సామ్యములను నాల్గింటిక్రింద వారీ సామ్యమును విభజించుకొనిరి. అందుచేత వీరి మతమునకు సామ్యమతమని పేరు. సౌందర్యలహరిలోని 34 శ్లోక మీ సామ్యమును సంగ్రహముగా చెప్పుచున్నది. శేషి శేష సంబంధము శివశక్తుల మధ్య పరస్పరము నున్నదని అది చెప్పుచున్నది.[4] ప్రపంచముయొక్క సృష్టిస్థితుల యందు శక్త్యంశ ప్రబలముగా నుండును. కాని, ప్రళయానంతరము పునఃసృష్టికి పూర్వము, శివాంశ ప్రబలముగా నుండును. ఎల్లప్పుడు శక్తికే ప్రాబల్యమని, వామాచారులు నమ్మెదరు. శక్తి తత్వములోనే శివతత్వము కలసియున్నదని వారందురు. ప్రత్యేక శివతత్వమును వా రంగీకరించరు. శక్తి విగ్రహముయొక్క పాదములక్రింద శవ విగ్రహమును చిత్రించుటలో వారి యభిప్రాయమును వ్యక్తపరచుచున్నారు.

(2) కుండలినీయోగమునందు సహస్రారము గమ్యస్థానమని సమయినులు నమ్ముచుండగా, సహస్రారమునకువెళ్ళి, సాధకునికి బ్రహ్మానందమునిచ్చి, మూలాధారమునకు తిరిగివచ్చి కుండలినీశక్తి, అచ్చట తిరిగి నిద్రించునని వామాచారులు నమ్ముచున్నారు. అందుచేత సహస్రారములోపల స్థాపితమైయున్నట్టు భావించి, సమయినులు దేవిని పూజించెదరు. మూలాధార, స్వాధిష్ఠాన చక్రముల రెండింటియందు నలుపలగా స్థాపితమైనట్టుగా భావించి, వామాచారులు దేవిని పూజించెదరు. మూలాధారమునకు కులము అని ఇంకొక పేరు. అందుచేత కౌళినీయని దేవి పిలువబడుచున్నది. ఈమెను పూజించువారు కౌళులని పిలువబడుచున్నారు.

(3) శుభాగము పంచకమని పేరొందిన సనక, సనందన, సనత్కుమార, శుక, వసిష్ఠ సంహితలు సమయినులయొక్క ప్రమాణ మతగ్రంథములు. పరశురామ సూత్రములు, అరువదినాల్గు తంత్రములు కౌళుల ప్రమాణ గ్రంథములు.

(4) సమయినుల ఋషి దక్షిణామూర్తి; వారి దేవతలు కామేశ్వరీ, కామేశ్వరులు. కౌళుల ఋషి భైరవుడు; వారి దేవతలు ఆనందభైరవి, ఆనందభైరవులు.

(5) సమయినుల బాహ్యపూజ, వేదసంప్రదాయమైన కల్పసూత్రానుసారమైనది; పాలు, పండ్లు వారు నివేదించు వస్తువులు. కౌళుల పూజావిధానము స్వతంత్రములైన తంత్రములయొక్క ఆచారకాండ ననుసరించును; అందు యౌవనవతులైన స్త్రీలయొక్క, నగ్నస్త్రీలయొక్క పూజకూడ కలదు. పంచమకారములని దుష్ప్రతీతి చెందిన, మత్స్య, మాంస, మద్య, ముద్రా, మైథునములు వారి నివేదన వస్తువులు.

సమయమతము విశుద్ధమై, సత్సంప్రదాయమైనది. పూజ్యులగు శ్రీ శంకర భగవత్పాదులతో

1. దేవీభాగవతము *VIII*. 39. 31—32.

2. 　　,, 　　*XII*. 7. 149—150.

3. 'సంప్రదాయకమైన' 'స్వతంత్రమైన' యని ఈ పదములకు తర్జుమా చేయుట ఉత్తమము.

4. అతః శేషః 　　య ముభయ సాధారణతయా స్థితః సంబన్ధో వాం...

సహా సంబంధము కలది. కౌళమతముకూడ అనేకము గా నిరుపద్రవమైనదే. ఏమనగా, పంచమకారముల ప్రత్యామ్నాయము గా నిర్వాహకకరములగు ఇతరవస్తువులు సాధారణముగా ఉపయోగించ బడుచుండును. మద్యము బదులు తేనెను, అల్లమును, వాడుదురు. కొన్ని యజ్ఞములయందలి పిష్టపశువువంటి మాంసము బదులు గుమ్మడికాయనుగాని, బెంకాయనుగాని, వాడెదరు వీరిలో అతివాదులైన ఉత్తరకౌళులలో మాత్రము, క్షేయమును దుష్ప్రఖ్యాతిలోనికి దెచ్చిన దౌర్భాగ్యములన్నియు అనుష్ఠానములై యున్నవి

ఒక మతములో రెండు తెగలున్నపుడు ఒకరి కంటె ఒకరు అధికులమని రొంముకొనుట సహజము. అందుచేత సమయినులకంటె అధికులమని, వారిని పురోగమించితిమని కౌళులు భావించుటలోను, కౌళ మతము తక్కువదని సమయినులనుకొనుటలోను ఆశ్చర్యమేమియునులేదు. ఒక ఉదాహరణ చూడండి. తాంత్రిక శిక్షలోని, ముఖ్యదశలను ఈ క్రింది వృద్ధి క్రమములలో కులార్ణవ తంత్ర మేర్పాటు చేయు చున్నది:.

1. సర్వేభ్యశ్చోత్తమా వేదా, వేదేభ్యో వైష్ణవం మహత్ |
వైష్ణవా దుత్తమం శైవం, శైవాద్దక్షిణ ముత్తమమ్||
దక్షిణాదుత్తమమ్ వామమ్ వామా స్సిద్ధాంత ముత్తమమ్ |
సిద్ధాంతా దుత్తమః కౌళమ్ కౌళా త్పరతరమ్ నహి||

(1) వేదాచారము (2) వైష్ణవాచారము (3) శైవాచారము (4) దక్షిణాచారము (5) వామాచారము (6) సిద్ధాంతాచారము (7) కౌళాచారము.

మొదటి మూడుదశలును నాల్గవదియగు దక్షిణాచారమున కుపోద్ఘాతములుగా చెప్పబడినవి. ఇందలి వేదాచారమునకు తంత్రముచే సంస్కరింపబడిన వైదికాచారకాండ యని యర్థము. దీనికి పైపై యోగ్యతమాత్రమే కలదు. రెండవదియగు వైష్ణవాచారము భక్తిమార్గము. మూడవదియగు శైవాచారము జ్ఞానమార్గము. కర్మ, భక్తి, జ్ఞానములను ఈ మూడు ప్రారంభదశలు పూర్తిచేసిన తరువాత దక్షిణాచారమను దశలో సాధకుడు ప్రవేశించును. పై సాధనను నెరవేర్చుకొనుట కనుకూలమగు ఆచారముగా, దక్షిణాచారమున కర్మము చెప్పబడినది. ఈ నాల్గుదశలు ప్రవృత్తి మార్గమునకు చెందినవి. వీటిని పూర్తి చేసుకున్న తరువాత నివృత్తి మార్గములోనికి సాధకుడు ప్రవేశించును. ఈ మార్గములో మొదటిది వామాచారము. అయినను, ఒక గురువు సహాయము వలన ప్రత్యేకముగ ఉపదేశమును పొంది, కోర్కెలను జయించుటకై సాధకుడు ప్రయత్నించును. దీనిని పరిత్యాగ మార్గమునగాక, విరుద్ధ, సముచ్చయముల మార్గమున సాధింపవలెను. ఏవైతే సాధారణులకు పతన కారణములో వాటినే సాధించి పైకు వచ్చవలెను. “యైరేవ పతనమ్ ద్రవ్యైః సిద్ధి స్తైరేవ చోదితా” అని, కులార్ణవ తంత్రము చెప్పుచున్నది. ఇదియే, మతమును వేషములో నానావిధ భ్రష్టవిహారములకును దారిని చూపించునట్టియు, తంత్రములయొక్క నిజ స్వభావమును తెలుపునట్టియు, సిద్ధాంతము. ఆకలి, దప్పిక, స్త్రీవాంఛ మొదలైనవాటికై కలుగు ఉద్రేకములను భక్తియుక్తముగా శాంతిపరచుకొనుటయే ఆ వాంఛలను స్వాధీనము జేసికొనుట కుత్తమమగు మార్గమని చెప్పు బోధనలు, నిత్యానుభవములో ఎట్టి పరిణామములకు దారితీయునో మనకు విశదమే.

వామాచారముతో ప్రారంభమైన [illegible] సిద్ధాంతము, కౌళము అను తరువాతి రెండు దశల యందు క్రమముగా సాధకుడు సంసారబంధ విముక్తుడగునని భావింపబడుచున్నది. రాగద్వేషములు, లజ్జాభయములు అతని నంటవు. సంసార, మలి, సాంసారిక బంధములనుండి యతడు ముక్తుడగును. మహానిర్వాణ తంత్రము చెప్పుచున్నట్లుగా “మానుషాకృతిని మాత్రము [illegible]గి, బోధచేసి ప్రపంచమును తరింప జేయుటకుగాను, అతడు భూసంచారము చేయు చుండును. అనగా అతడు జీవన్ముక్తుడగును.”

సత్వరజస్తమో గుణములనుబట్టి దివ్య, వీర, పశు తరగతులకు చెందినవారిగా తంత్రములు, మానవులను విభజించుచున్నవి. పైన పేర్కొన్న మొదటి నాల్గు ఆచారదశలయందు సాధకుడు పశుత్వ స్థితియందుండునని చెప్పబడినది. వామాచారదశలో సాధకుడు ప్రవేశించును. సిద్ధాంతదశలో తన స్థితిని వృద్ధిచేసికొని తుదకు కౌళాచారదశయందు దివ్యస్థితిలోనికి ప్రవేశించును. ఇదంతయు వట్టి భ్రమయని త్రోసివేయుటకు పూర్వము, శ్రీరామకృష్ణ పరమహంస ఈ తాంత్రికసాధన మార్గమునే పట్టి ఆత్మసాక్షాత్కారమును పొందిరని మాత్రము జ్ఞాపకముంచుకొనవలసియున్నది ఈ పరమహంసయొక్క

ఆత్మచరిత్రములోని తాంత్రిక, సాధనమను యధ్యాయము నీ సందర్భములో మనము జాగ్రత్తగా చదువవలసియున్నది. వామాచారమునే అభ్యసించినట్లు వారియొక్క ఈ క్రిందివాక్యములవలన స్పష్టమగుచున్నది:-

"అరువదినాలుగు ముఖ్య తంత్ర గ్రంథములలో చెప్పబడిన అభ్యాసము లన్నిటిని నాచేత బ్రాహ్మణి అభ్యసింపజేసిరి. ఇందలి చాలా సాధనములు మిక్కిలి కష్టమైనవి. అందులో కొన్ని, స్థానభ్రష్టత్వము నొనరించి నైతికముగా సాధకుని హీనస్థితిలో ముంచివేయునంత యపాయకరములైనవి. కాని, జగన్మాత యొక్క యనుగ్రహమే నన్ను నిరపాయముగా వాటినుండి లాగుకొని వచ్చినది."

శ్రీరామకృష్ణ పరమహంస యంతటి సాధకుడే ఈ యభ్యాసము లెంతో యపాయకరములని తెలిసికొన్నప్పుడు, వాటిని సాధన చేసిన సాధారణు లెందరో అందు తగులుకొని శీలాంకురము లన్నింటిని కోల్పోవుటలో నాశ్చర్యము లేదు. బెంగాలు, బీహారు, అస్సాములలో వామాచారము బహువ్యాప్తి పొందినది. ఆ దేశములయం దొకకాలమందు, ఈ వామాచార మెంత వినాశన మొనరించినదో వంగదేశ పుత్రులలో మిక్కిలి కులీనులైనవారిలో నొకరగు స్వామి వివేకానందుని తీవ్రవిమర్శన వాక్యములవలన తెలిసికొనవచ్చును. అమెరికానుండి తిరిగి వచ్చినవెంటనే, 1897 లో, కలకత్తాలో ఇచ్చిన ఒక యుపన్యాసములో స్వామి యిట్లు చెప్పెను:

"మీ దేశమును నాశనము చేయుచున్న ఈ హేయమైన వామాచారమును విడిచిపెట్టండి. హిందూదేశములోని ఇతరభాగములను మీరు చూచిలేదు. మన సంఘమందు వామాచార మెంతవరకు వ్యాపించినదో పరిశీలించినచో, ఎంతో సంస్కృతి కలిగినదని బడాయి కొట్టుకునే యీ ప్రాంతమునకేనా మిక్కిలి అవమానకరమగు యీస్థితి సంభవించినదని నాకు తట్టుచున్నది. బంగాళములోపల ఈ వామాచారపు తెగలవారు తేనెపట్టువలె వ్యాపించి సంఘమును దొలిచివేయుచున్నారు. బిడ్డలకన్న కలకత్తాలోని తండ్రులారా, ఈ వామాచార తంత్రములనే ఘోరమైన చెత్తను, వాటి తర్జుమాలతో సహా, మీ బాలబాలికల చేతులనిడి, వారి మనస్సులను విషపూరితము లొనరించి, ఇవియే హిందూశాస్త్రగ్రంథములని భ్రమ కలిగించి, వారిని పెంచి పెద్దవారిని చేయుచున్నారే. ఇది యవమానకరమని మీకు తోచుటలేదా? అవమానకరమే యందురా, వాటిని పిల్లలవద్దనుండి లాగి పారవేయ్యండి. వేదములు, భగవద్గీత, ఉపనిషత్తులు అను నిజమైన శాస్త్రగ్రంథములను వారిచే చదివించండి."

హీనమైన తాంత్రికాచారకాంపుచే దుర్గంధపూరితమైనట్టి వాతావరణములోనికి సుఖముగా ఊపిరి తీసికొనుటకు వీలుగా ప్రవేశించు చల్లనిపిల్ల గాలులవలె, ఈమాట లెంత హాయిని గొల్పుచున్నవి! మేలురకమైన తంత్రములయొక్క గుణములను స్వామి గుర్తించలేదని ఈ యాక్షేపణనుబట్టి నిశ్చయించకూడదు. ఏమనగా 1901 మార్చి 31 తేదిని ఢక్కాలో చేసిన ప్రసంగములో ఇలా అన్నట్లు కనపడుచున్నది:—

"వామాచారమువంటి వానిలోని కొన్ని అసహ్యములగు విషయములను మినహాయించినచో, తక్కిన తంత్రములు, అందరు అనుకునేటంత చెడ్డవి కావు. ఉత్కృష్టములైన గొప్ప వేదాంత భావములు వాటియందు చాల కలవు. నిజానికి, వేదములలోని బ్రాహ్మణములయందలి భాగములే సవరింపబడి తంత్రగ్రంథములలోనికి చేర్పబడినవి. మన పూజా విధానములన్నియును నేటి వ్రతాది సంస్కారముల యందలి కర్మకాండయంతయు తాంత్రిక విధానమునే అనుసరించుచున్నది."

## 16

సమయాచారావలంబకులు, కౌలాచారావలంబకులు అను శాక్తేయులలోని రెండు తెగలనుగూర్చి లలితాసహస్రనామములలో చెప్పిన విషయములను తెలిసికొనగలస్థితి మన కిప్పుడు కలిగినది. శివశక్తులను కామేశ్వరీకామేశ్వరులుగా స్తోత్రములో పేర్కొనుట చేతను, సమయాచారతత్పరా, సమయాంతస్థా, సామరస్యపరాయణా, దక్షిణామూర్తిస్వరూపిణీ, అను పేర్లతో దేవిని పిలుచుటచేతను, గ్రంథకర్త దక్షిణాచారపక్షమును వహించినాడని నిశ్చయమగుచున్నది. కాని రెండవపక్షముయొక్క గణ్యతను పూర్తిగా అమోదించుటచేత త్రాసు ఎటూ మొగ్గకుండునట్లు గ్రంథకర్త ప్రయత్నించినాడు. అనేక నామములద్వారా కౌళులయొక్క పూజకూడ దేవి కంగీకారమేయని సూచించినాడు. కౌళమార్గ తత్పరసేవితా, కులసంకేతపాలినీ, కౌళినీ కేవలా, వీరారాధ్యా, వీరగోష్ఠీ

ప్రియా, మొదలగు నామముతో దేవిని పేర్కొన్నాడు. మరియు, రహోయోగ క్రమారాధ్యా, రహస్తర్పణ తర్పితా యను రెండు నామముల చేత కౌళుల రహస్యాచారములతో బహుశః అన్వయింప జూచుచున్నాడు. దక్షిణా దక్షిణారాధ్యా, సవ్యాపసవ్య మార్గస్థా, యను నామములలో రెండాచారములను కలిపి స్మరించుట చేత, రెండు మార్గముల చేత దేవిని చేరవచ్చునని సూచించుచున్నాడు. కాని, దురాచారశమనీ, దుష్టదూరా, యని దేవిని పిలుచుటలో సర్వవిధములైన దుష్టమార్గములను, దుష్టులను, న్యాయ రీతిని గర్హించుచున్నాడు.

## 17

చండీ మాహాత్మ్యముతో లలితా సహస్రనామమును పోల్చిచూచినచో, తాంత్రికభావముల ప్రాబల్యము చేత దేవీపూజలో ఎంత గొప్పమార్పు వచ్చినది మనకు తెలియగలదు. చండీ మాహాత్మ్యములో వలెనే లలితా కావ్యమందుకూడ దేవికిని నసురునకును జరిగిన పోరాటమును చెప్పు విషయములు కలవు. కాని, కారెనుబోతు తల గలిగిన మహిషాసురుని కంటె భండుడు నాగరికు డగుటచేత లలితోపాఖ్యానములోని గుడ్డగు నాగరకతలో పై మెట్టులోనున్నది. మరియు, దేవియొక్క శాంతత్వము లలితయందు, ఉగ్రత్వము చండియందు వ్యక్తమగుచున్నవని ఆనామములే సూచించుచున్నవి. బహుశః ఈ రెండు పోరాటములుకూడ విషయాంతర సూచకములు గా ఉద్దేశింపబడియుండవచ్చును. అట్లగుచో, మానవునియందలి పశుత్వమును మహిషునిగాను, అహంకారమును భండునిగాను, దేవిని దివ్యజ్యోతిగాను భావించవచ్చును. మనుజుడు తనలోని దేవత్వమును తెలిసికొనవలెనన్న, మొదట తనలోని పశుత్వమును, తరువాత అహంకారములు జయించవలసి యున్నది. రెండవ పోరాటము మొదటిదానికంటె మేలుతరగతికి చెందినది. శస్త్రములతో గాక అంతకంటె శ్రేష్ఠములైన అస్త్రములతో చేయబడినది. మొదటిపోరులో న్యాయములను, నిబంధనలను అసురు డనుసరించును. రెండవ పోరులో ప్రార్థన, ధ్యానముల మార్గమునుబట్టును. నిజానికి, ఈ రెండు ముఖములయందలి యుద్ధము అంతులేనిది. ఏమనగా, ఈ యసురు లెన్నటికీ నశించునట్టివారు కారు. ఒక రూపములో నిహతులయ్యును ఇంకొక రూపములో పొడజూపి తిరిగి పైబడుచుందురు. ఒక ఉదాహరణ చూడండి. వామాచారముపై వ్యతిరేకముగా చెప్పినదంతయు నిజమే యైనచో, మహిషాసురుడు మృత్యులోకమునుండి యుద్భవించి దేవియొక్క యనుచరుని రూపమును దాల్చి, ద్రోహియై వెనుకవైపునుంచి నామెపై తలపడుచున్నాడని మనము భావించవచ్చునేమో?

కాని అదృష్టవశాత్తు తంత్రములయందలి మంచి భాగములే లలితాసహస్రనామ కావ్యమును ప్రేరేపించినవి. ఈ కావ్యప్రారంభమందే దేవియొక్క స్వరూపమునుగూర్చి గ్రంథకర్త చాలా వర్ణించినాడు. స్తోత్రమందంతటను యామె దివ్యసౌందర్యమును పేర్కొని యున్నాడు. దేవి ధరించునట్టి నగలు, పువ్వులు, ఆమె లేనగవులు, చల్లని చూపులు, ఇష్టానిష్టములు ఎంతో ప్రశస్తమైన నైపుణ్యముతో — దయామయియగు దేవి ప్రత్యక్షమైనదా యన్నట్లు, "మహా లావణ్యశేవధిః" యని ఒక మహాలావణ్యరాశిగా ఆమెను కవి వర్ణించినది నిజమేయని నమ్మక కలుగునట్లు—స్పష్టీకరింపబడినవి. ప్రశస్త కవితా రీతినిబట్టి చూడగా ఈ సహస్రనామ

మిక్కిలి కళాత్మకముగా కన్పట్టును. లలితా కావ్యమును పఠించుట అందలి భక్తినిగూర్చి గాని కవిత్వ విశేషమును గూర్చి గాదు. చండీ, మాహాత్మ్యమందలి స్తోత్రములను లలితా స్తోత్రముతో భక్తిభావ విషయకముగా సరిపోల్చి చూచినచో, విషయభేదమందు, విషయ వైశాల్య, గాంభీర్యముల యందు లలితాకావ్యముయొక్క ఆధిక్యత తప్పక స్ఫురింపగలదు. మొదటి గ్రంథములో దేవియొక్క అంతస్థితత్త్వము నొక్కి వక్కాణింపబడినది. అంతస్థితత్త్వమే కాక ప్రపంచాతీతమగు మహత్త్వముకూడ లలితా కావ్యములో వక్కాణింపబడినది. సద్రూపధారిణీ, సత్యజ్ఞానానందరూపా, సచ్చిదానందరూపిణీ, నిత్యశుద్ధా, నిత్యబుద్ధా అను నామముల యందు, నిరవద్యా, నిరంతరా అనెడు వ్యతిరేకార్థ సూచకమగు నివర్ణముతో ప్రారంభించే (నేతి, నేతి యని చెప్పే) సుమారు నలుబదియైదు నామముల యందు, వేదాంతాభిప్రాయము లెంత లోతుగా ప్రవేశించియున్నవో మనము తెలిసికొనగలము. నిర్ద్వైతా, ద్వైతవర్జితా, బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ, తత్త్వమర్థ స్వరూపిణీ, జ్ఞాతృజ్ఞేయ స్వరూపిణీ, మిథ్యాజగదధిష్ఠానా మొదలైన నామములలో బలీయమైన అద్వైతధోరణి కనపడును. దేవీమాహాత్మ్యము మొద

లను చేసి స్తోత్రపరములను పూర్వగ్రంథములను, లలితా సహస్రనామ స్తోత్రమునకుగల సంపూర్ణ వ్యత్యాసమునకు గల కారణము, తాంత్రికతత్త్వ శాస్త్రముయొక్కయు, సాధనయొక్కయు అధిక ప్రాబల్యమే. శ్రీమాతా, శ్రీ మహారాజ్ఞీ, శ్రీమత్సింహాసనేశ్వరి యనబడు ఆద్యంత రహితయైన మహామాతయొక్క వివిధతరగతుల భక్తులకు నిలువ నీడ నియ్యగలిగినట్టి, పెక్కుచావడులు, గదులు కలిగి ఘనమై, యున్నతమైనట్టి మహాసౌధమనదగు లలితా సహస్రనామ స్తోత్రమందు, పంచదశీ మంత్రము, కుండలినీయోగము, శ్రీచక్రము అను తాంత్రిక శిలాధారములను మూడు గొప్ప స్తంభములు సుస్పష్టముగా గోచరించునని మన మిదివరకే తెలిసికొనియున్నాము

## 18

సంస్కృత సాహిత్యములోని సూత్రము, సమాసమువలె, సహస్రనామము ఒక విశిష్టమైన కావ్య రూపము. అనవసరమైన మాటలన్నిటిని తీసివేసి, అసంపూర్ణముగాను, సూత్రప్రాయముగాను ఉండునట్టి ఈ కావ్యరచన, జన సమ్మతములైన సాహిత్యములయందలి అతి వ్యాప్తి, అతిశయోక్తులకు ప్రతిగా నేర్పాటై యుండవచ్చును. సహస్రనామములలో ఆయా దేవతలగురించి కల్పించే నామములద్వారా మత సంబంధమైన తన భావములను, జీవితతత్త్వమును గురించిన యభిప్రాయములను, వేదాంత సంబంధమైన నమ్మకములను కవి వ్యక్తపరచవలసి యుండును. ఇట్టి కావ్యరచనలో విషయ విస్తరణమునకు చోటు లేదు — సరిగదా, వాక్యములకు యుక్తియుక్తము పూర్వాపరసంబంధము కూడ ఉండదు పరస్పరసంబంధము లేనట్టి సమాసములోని మాటలవలె విషయములను గుదిగూర్చవలసియుండును. ఒక సముచ్చయముకూడ వాడకుండ సమాసము లన్నింటిని ఒక కుప్పగా చేర్చి నిర్మించిన సహస్రనామము—చక్కగా మలిచిన రాళ్ళ మధ్యను సున్నముగాని, సిమెంటుగాని లేకుండ ఒక దానిమీద నొకదానిని పేర్చిపెట్టిన గోడలతో నిర్మించిన కట్టడమును—పోలియుండును. అందుచేత సహస్రనామమును కావ్యరూపమందు దానికి శిష్టమైన, స్పష్టమైన, లోపములు మెఱుగులుకూడ ఉండవచ్చును. సంక్షేపత్వము, మితియనుగుణములు దానిలో వ్యక్తపడుచున్నచో, అసందర్భము, అస్పష్టతకూడ నందే వ్యక్తపడుచున్న వనవలెను. ఎట్టి తర్కబద్ధమైన సంబంధమును కవిచూప నవసరములేదన్నాడు, అట్టి సంబంధమును గురించి భావించుటకూడ యవసరము లేదనే మోహమునకు అతడు సులభముగా లోనగును. అనుప్రాసములు, యమకములు అను శబ్దదేవతలకు సాపత్నికమును నాలోచనను బలియిచ్చుటయే సహస్రనామములలో చాలావాటిని ఆవరించియున్న లోపము. అందుచేత అర్థాడంబరముకంటె శబ్దాడంబరము ఎక్కువగా నుండును. సూత్రప్రాయముగా వ్రాయబడే సహస్రనామ కావ్యరచనయందు అనుప్రాసమునకు నిస్సందేహముగ ఒక విశిష్టమైన విలువ ఉన్నమాట నిజమే. కాని, తార్కికానుక్రమణమును కోల్పోయినప్పుడుమాత్రము, కేవలము చిలుకవలె పలుకలేని పాఠకుని మనశ్శాంతి కలతచెందును. చాలా సహస్రనామములకంటె లలితాసహస్రనామ మీ విషయములో బాగా మెఱుగు. అందలి నామములలో తర్కయుక్తమైన పూర్వాపరసంబంధము చాలా ఇమిడియున్నది. అందుచేతనే దేవియొక్క శరీర స్వరూపము, భండాసురునితోటిపోరు, దేవియొక్క వివిధనివాసములు, మానవశరీరమందలి షట్చక్రములలో ఆమె పొందియున్న రూపవిశేషములు మొదలగు భాగములుగా ఆ నామములను విడదీయవచ్చును. కాని, తర్కరహితముగా కూర్చబడిన నామములు కూడ చాలా ఉన్నవి. ఉదాహరణ చూడండి. 844 నుండి 846 వరకు గల—ఛందస్సారా, శాస్త్రసారా, మంత్రసారా—నామములతరువాత ఆపంక్తిలోనే—తలోదరీ—నామము చేర్చబడినది. తరువాతి పంక్తిలోకూడ ఇట్టే కలదు. చూడండి "ఆమెకీర్తి ఉదారమైనది, ఆమె వైభవ ముద్దామమైనది—ఆమె వర్ణరూపిణి—" తెలిసిన పాఠకునికి [illegible] కలిగించునట్టి, న్యాయముగా భాషాంతరీకరణ మొనర్చువానికి తలనొప్పి పుట్టించునట్టి, ఇట్టి యుదాహరణలను పెంచి చూపవచ్చును.

మరియు, వేయినామములు కచ్చితముగా నుండవలెనను నియమములో ఆనుకూల్యముకంటె ప్రాతికూల్యము హెచ్చు. నామసంఖ్యను వేయికి మించనీయకుండుట నిత్యపారాయణ చేయువారియెడల, గుడిలో పూజారియెడల నిస్సందేహముగా చూపినదయ అనాలి. స్తుతించదలచిన దేవునిగురించిగాని, దేవిగురించిగాని, చెప్పినది చెప్పకుండ వేయి నామములను కల్పించడ మంత సులభమైనపని కాదు. సమానార్థముగు నామమును ఇంకొకసారి చెప్పటను కవిత్వనిబంధనలు నిషేధించుచున్నవి. చెప్పదగిన విషయమువంతను













# లైఫ్‌బాయ్ సబ్బు

ప్రతిదిన మలినములోని క్రిముల
నుండి మిమ్ములను రక్షించును




L. 231-50 TL

ఐదారువందల నామములలో పూర్తి చేసిన తరువాత, ప్రయాసముతో అర్థకల్పన జేయవలసినట్టి వింతవింత విషయములతో తక్కిన నామములను బలవంతముగా కవి పూర్తి చేయవలసి యుండును. ఇది ముందే, పూజ చేయుచుండగా సేకరించిన పువ్వులైపోయినతరువాత, పూజ పూర్తి చేయుటకై పసుపు అక్షతల నుపయోగించుటవంటిది. పొరపాటున ఒకమారు చెప్పిననామమే కవి, తిరిగి చెప్పినచో అతని వెంబడించే వ్యాఖ్యానకర్త దాని కింకొక యర్థమును చెప్పుటకై తల పగులగొట్టుకోవలెను. లేదా, దానిని రెండుముక్కలుచేసి ఒక్కొక్కదానికి, ఏదోకష్టపడి అర్థము సాధించవలెను. సందర్భశుద్ధిగల విషయము చేకూడినను, మాటలతో ఆడే నిస్సారమైన గారడీలమధ్యనుంచి తర్కాధారమైన పూర్వాపర సంబంధము, కొలానుటకైన వీలులేక, పైకెగిరిపోయి అంతర్ధానమగును. లలితా సహస్రనామములలో ఇట్టి లోపములు అదృష్టవశాత్తు పెక్కులు లేవు. మొత్తముమీద, మిక్కిలి కష్టమైన కవితారచనను ఎన్నుకొనికూడ, దేవీపరముగా ఒక దివ్యకవితాశిల్పమును కవి, నిర్మింపగలిగినాడు.

# రాక

## శ్రీ బోయి భీమన్న

గడ్డిపూలు ఉవ్వెత్తుగ
ఒడ్డుచేరి శిరసు లూచె!
ఒడ్డు ఒడ్డె కడు మత్తుగ
ఒరిగి నిన్నె యెడద మోచె!
రంగులతో, తొలిప్రాయపు
పొంగులతో నీవురాగ!

మిలమిల ముత్యాల గొడుగు
మేదినికె పయోద మయ్యె,
మెరుపు వెండి వీవనలే
ఉరుకు మబ్బు కొంగలయ్యె!
రాణివిగా కృషికంతకు
ప్రాణముగా నీవురాగ!

తరియించిన కోరికలు,
తపియించిన పికిలింకలు,
గొడ్ల జేరి బిడ్డలతో,
ఎడ్లదోలె నీ రథమున
గల గలమని, శివసాగర
గంగవుగా నీవురాగ!

ఘుళు ఘుళ్లను నీయడుగులు!
ఝుళు ఝుళ్లను నా నాడులు!
పొలము పొలమె పులకరించి,
మొలకెత్తెను తొలకరించి!
సుందరివై, జీవకళా
నందినివై నీవురాగ!

కాలు కడిగి నీవాకిట,
కేలు కడిగి మాలోగిట,
మూన తిరిగి, వెన్నెలతో
ముద్దు లొలికె వరిపొలములు
దీవనలై, కల్యాణపు
దేవతవై నీవురాగ!

# నవ్య సృష్టి

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు

పుటలు తిరిగెడు వెలుగు చీకటుల నడుమ
నాట్య మొనరించిపోవు సంధ్యాకుమారి
కనులలో స్నిగ్ధరాగ రేఖలు సుమించి
దిక్తటమ్ముల కెంపుల తెరలు దీర్చు!

మోదుగుంబూల పందు నిప్పుకలు మెరయు
శిశిర భగ్నాలపీనగ్న జీవితమ్ము
పచ్చగిలిపోవ వాసంత వైభవములు
మధుర కుసుమ పరాగ సంపద వెలార్చు.

గ్రీష్మ భీష్మాతపమున శుష్కించిపోయి
మూగతనము దాల్చిన కొండవాగు గొంతు
జిలుగు తొలకరి చినుకుల పులకరించి
స్వాదుజీవన గీతికా ధ్వనులనీను.

కాల మేఘాల నీడలు క్రమ్ముకొన్న
భాద్రపద శర్వరీతమః ప్రాంగణమున
దిగ్గునః మించు కన్నెలు దివ్వెలెత్తి
వెలుగు తీగెల పందిళ్లు వేసిపోవు.

కారుచీకటి గుండెల కలుకుదనము
నోల మొనరింప హేమంత కాళరాత్రి
కప్పుకొనివచ్చి తెలిమంచు దుప్పటమ్ము,
విశ్వహృదయ నాళముల కవ్వించిపోవు.

ఎండ వానల చివికి, జీర్ణించిపోవు
శ్రామికుని రుధిరము స్వేద జలములగుచు
వసుధ పెదవిలో అమృత కుంభంబులెత్తు
గిరుల గుండెల రత్నాల సిరుల ద్రవ్వ.

శిలల కఠినంపు టెడద లోతులు స్పృశించి
చేతనా శిల్పకారుని చేతికుంచె
భువన మోహన సౌందర్యము తరళించు
లలిత లలిత కళారూపముల రచించు.

భూనభోంతరాళము కంపమును వహింప
కుత్తుకెత్తి "హోరు" మటంచు ఘోషపెట్టు
కడలిరాయని యొడిలోన గంతులిడుచు
ఉద్ధృత కెరటాలు నురుగు నవ్వులను జిలుకు!



కథానిక :

# రుగుపయాణం

### శ్రీపంతుల శ్రీరామశాస్త్రి

సీతా! మరి నేను సాయంకాలానికల్లా తిరిగి వచ్చేస్తాను.

సాయంకాలానికా? సినీమా చూడకుండానే వచ్చేస్తారా?

ఏమిసినీమాలు పోనిద్దూ, అన్నీ ఒక్కలాగున్నాయి. అంతగా చూడదగినదేమయినా ఉంటే రెండుగంటల ఆటచూసి, అయిదుగంటలకి బయలుదేరితే ఎనిమిదికల్లా వచ్చేస్తాను.

అదేనా భయం. ప్రయాసకూడాలేదు. మీరు కారునడపడం అంటే ఎంతజోరుగా వెళ్తున్నారో మీకా ఆలోచనే ఉండదు. నిన్నా మొన్నా వర్షాలు కూడా పడ్డాయి; రోడ్లు బాగుండవుకూడా.

రోడ్డుమీద ఏమీ బాధలేదు. రోడ్డు దిగేక మన ఊరు వచ్చేవరకూ ఈ ఎనిమిదిమైళ్ళే కొంచెం చికాకు, తక్కిన డెబ్భైమైళ్ళెంతో ఈ ఎనిమిదిమైళ్లు అంత చికాకు. ఇంకెంత, మళ్లీ సంవత్సరం ఈసరికి పక్కా రోడ్డు వేయించకపోతారూ?

అప్పుడు మరీ రోజుకోకమారు పట్నం వెళ్లివస్తూ ఉంటారు కాబోలు. అయినా ఇప్పుడీ వెళ్ళడం అంతఅవసరం అంటారా?

ఇదుగో సీతా! చూడు. ఈసంగతి మనం ఈ ఈమధ్యనల్లా చర్చించి చర్చించి నిర్ణయించుకొన్న సంగతేకదూ. మళ్లీ అదంతా ఇప్పుడు తిరగతోడడం దేనికి? నువ్వు మరిక్కడినుండి కదలక పోడం నిశ్చయమేకదా!

నిశ్చయమని ఏమీలేదు. మీరు వద్దంటే దేనికయినా నేను సిద్ధమే.

అదుగో అదే నాకిష్టపడదు. నీకు ఎంతమాత్రం ఇష్టంలేకపోయినా కేవలం నాతృప్తికోసమే అన్నీ చేస్తున్నట్టు మాట్లాడితేనే నాకు కష్టంగా ఉంటుంది. ఏవిషయంలో నేను నీకు స్వేచ్ఛ నియ్యలేదు చెప్పు?

తక్కిన సంగతులమాట నేనన్నానా? ఇందులో మాత్రం నాయిష్టం కావాలంటే మీరింత అట్టహాసం చెయ్యడమే నాకదోకలాగుంది. ఈఊళ్లో మరెవ్వళ్ళకీ పురుళ్లు రావడంలేదా? పిల్లలు పుట్ట పెరగడం లేదా? ఎవ్వరికీ లేనిది, ప్రత్యేకించి అవసరం అంటూ లేకుండానే పట్నంనించి పెద్దడాక్టర్లనూ నర్సులనూ తీసుకొనివచ్చి మనఇల్లే పెద్దహాస్పిటలు చేస్తామంటారు.

నేనలాగని అననేలేదు. నిన్నే తీసుకొని వెళ్లి హాస్పిటల్లో ప్రవేశపెడతానన్నాను దానికి నువ్వు ససేమిరా వద్దంటే కనీసపక్షంగా ఇప్పుడీ పద్ధతి చెప్పాను.

మనమయినా హాస్పిటలుకి పోవాలి; లేదా, హాస్పిటలయినా మనయింటికి రావాలి. అంతే, మీ పట్టినపట్టేమిది. ఊళ్లో తక్కినవాళ్లంతా ఇలాగే చేస్తున్నారా?

నువ్వు మాటిమాటికీ ఊళ్లో తక్కినవాళ్ళంటూ ఉంటేనే నాకు కష్టంగా ఉంటుంది. ఎవరి అవసరాలూ అవకాశాలూ, అభిమతాలూ వాళ్ళవి. అందరూ ఏవిభేదాలూ లేకుండా సమానం చెయ్యబడే సుదినం వస్తే నాకూ బ్రహ్మానందమే; కాని, అంతవరకూ మనస్వార్థం మనం సక్రమంగా చూసుకోక పోయినందువల్ల ఎవరికీ మేలు చేసినవాళ్ళం కాము. మనకి మనం నష్టం కలిగించుకొంటామంతే. మన ఊళ్లో మరెవ్వరికీలేదు. మనకి కారుంది: అందరికంటె పెద్దఇల్లుంది. వీటిని మనం వినియోగించుకొంటున్నట్టే తక్కినవీని.

మీకు పెద్దఇల్లు అవసరం; కారు అంతకంటే కూడా అవసరం.

మరి నన్ను చెప్పనీ, అలాగే నాకు అత్యంతమూ విలువయిన నీ ఆరోగ్యాన్ని సక్రమంగా కాపాడుకొందికి చేసేప్రయత్నం కూడా అత్యంతావశ్యకమే.

పూర్వం గొప్ప కొద్ది భేదం లేకుండా ప్రతివారికీ ఊళ్లో వైద్యుడిచ్చే మాత్రలతోనే సరిపోయేది. ఇప్పుడు ఎంత లేనివాళ్ళకి ఎవరో పై ఊరు డాక్టరొచ్చి ఇంజెక్షనివ్వాలి. పూర్వం ఎంత మేరయినా నడిచిపోయేవారు; ఇప్పుడు అందుబాటులో ఉన్నాయి గనక బస్సులూ రైళ్ళూ వాడుకోలేదా? అలాగే, అవకాశాన్నిబట్టే అవసరాలు.

మిమ్మల్ని నేను వాదించి ఒప్పించగలనా? నా యిష్టమంటే చెప్పేనుగాని.

ఇష్టమనిచెప్పి, మనకి విస్పష్టంగా కనిపిస్తున్న అవసరాలనూ, మనకి అందుబాటులోనున్న అవకాశాలనూ కాదనుకోంటామా? ఇంతకీ నేనేమో పెద్ద ఖర్చు పెడతాననలేదే. మా స్నేహితుడు డాక్టరు రాజేశ్వరం, నా దగ్గర ఏమిమ్మిడీ ఫీజుపుచ్చుకోడు. వాళ్ళ పెద్దక్కయ్య డాక్టరు పనిచేసి ఈ మధ్యనే రిటైరయింది. ఆవిడను వీలయితే తీసుకొని వస్తాను. ఆవిడవచ్చినా రాకపోయినా మంచి అభవమున్న ఒక నర్సును తీసుకొని వస్తాను. నర్సు అవసరం అని చెప్పగానే కారుపంపిస్తే రాజేశ్వరంకూడా వస్తాడు.

ఈ పటాటోపం అంతా చేసేకంటె పోయి గుప్ చిప్‌గా హాస్పిటల్లో ప్రవేశించి ఉంటేనే బాగుండి పోవును.

మరి నేను చెప్పినన్నాళ్ళు విన్నావా? ఇప్పుడు మరి లాభంలేదు. ఇక మరి ప్రయాణం అంతమంచిది కాదు. కాక అక్కడ వాళ్ళగొడవలలోపడి శ్రద్ధగా చూస్తారు చూడకపోతారు. మరెందుకాలస్యం, నేను వెళ్ళి సాయంకాలానికల్లా వస్తాను.

అయితే మరొకగంటలో రెండుగంటలో ఆలస్యమవుతుందిగాని, కారుమాత్రం మేఘాలమీంచి పరుగెత్తించకండి మీ పుణ్యం ఉంటుంది లేకపోతే, జ్వరం తగ్గిందికాబోలు డ్రైవర్నికూడా పక్కను కూర్చోమనకూడదూ?

“నేను అజాగ్రత్తగా తొందరగా నడిపితే పక్కనుండి అతను కాపాడేస్తాడనా? చూసేవా మరి ఇంత చిన్న విషయం, అతి సామాన్యంగా ప్రతినిత్యం జరుగుతున్నది కారులో పట్నంవెళ్లిరావడం, ఇటువంటిదానికి, నువ్వు ప్రతిమారూ ఎప్పటికప్పుడు ఇంటికివచ్చేదాకా బెంగపెట్టేసుకుంటావుకదా: నేను నీ విషయంలో, అందులోనూ ఇటువంటి ప్రధానమయిన అంశంలో కాస్తంత జాగ్రత్త పడడం పెద్ద నేరమా? ఇందాకా నువ్వు రాసినవస్తువుల జాబితా జేబులో ఉంది, అంతేనా మరేమీనా కావాలా?

అవే అన్నీ అనవసరం. మీరు దగ్గరకూర్చొని రాయమంటేనే రాశాను. మరెందుకాలస్యం బయలుదేరండి. ఆ వెంకన్ననయినా రానియ్యకూడదూ, సామాను కొనడానికయినా పనికివస్తాడు.

వాడా ఆ చవిటివెధవ. ఉంటే వాడితో మాట్లాడ్డానికి మరింత చిక్కు-సర్లె, పోనీరానీ, కాని, నీ కెందుకింత అనుమానం. కారు జోరుగా నడిపిస్తానని. మునపటిలా గనుకొన్నావేమిటి, ముసలివాణ్ణయిపోయాను. నలభైయవ సంవత్సరం వచ్చిందికదా!

ముప్పై సంవత్సరాల పదకొండు నెలలకి లేని ముసలితనం ఇంతలో వచ్చిందా? అసలు మీ సంగతి చూస్తుంటే రోజురోజూ మరింత కుర్రతనం వస్తున్నట్టుంది. ఇప్పుడు మొట్టమొదటి మారుగా అయిదేళ్ళక్రితం మిమ్మల్ని తెలిసినప్పుడు ఇంతకంటె ఎంతో పెద్దలాగుండేవారు.

అది ఆకాలంలో పరిస్థితుల ప్రాబల్యంవల్ల పుట్టిన విరక్తి. మంచిబట్ట కట్టుకోవడమన్నా, సుభ్రంగా భోజనం చెయ్యడమన్నా పెద్ద నేరంగా తోచేది.

వేషభాషలలోనే కాదు, అప్పుడు మొగంలోనె ఇప్పటికంటే ఎక్కువ వయస్సున్నట్టుండేది. కావాలంటే అప్పటి ఫోటోలకు ఇప్పటి ఫోటోలకు భేదం చూసుకోండి.

నా కనుమానం ఉంటే కదా! నువ్వు నా జీవితంలో అడుగుపెట్టడమే శాశ్వతమయిన వసంతశోభ వచ్చినట్టయింది. కాబట్టి న్యాయంగా తాతను కావలసిన ఈ వయసులో పరమోత్సాహంతో, తండ్రిని కాబోతున్నాను.

చెయ్యండి, మీ చిత్తంవచ్చినట్టు ఎగతాళి చెయ్యండి. ఇప్పుడు మీ మాటలకి నవ్వుకోవడంతప్ప, చెయ్యగలిగిందిగాని, చెయ్యవలసిందిగాని మరిలేదు.

నే నన్నమాటల్లో ఎగతాళి ఎక్కడుంది?

అబ్బే! ఏమీ తెలియదు పాపం— నేను అమ్మమ్మని కావలసిన ముసలివయసులో మొట్టమొదటిమారుగా తల్లిని కాబోతున్నానని వేళాకోళం చెయ్యడంకాదూ?

నా మాటల్లో అటువంటి సారస్యం తియ్యగలిగిన నీకు కుంజేటి కొమ్మ సంపాదించడం ఏమంత కష్టం కాదు. నువ్వే గాని విమర్శకి పూనుకొంటే ఎంత చచ్చు పుస్తకమయినా అలంకార భూయిష్ఠం కాక తప్పదు. మరెందుకు కొన్ని మాటలు: నా మనసులో ఏముందో నీకు తెలియనిది కాదు. నా వయసు రోజుకి తగ్గుతుందని నువ్వన్నట్టుగానే, నీ సౌందర్యం దినదిన ప్రవర్థమానమవుతూంది—నిజమే. నీ సౌందర్యం, ఆకర్షణ అవి ఒక్క క్షణం దూరమయినా భరించ నిచ్చేవి కావు.—ఇప్పుడు నువ్వు దగ్గరగా ఉన్నా దూరంగా ఉన్నా సర్వదా మనసులో మెదలుతూనే ఉంటావు. గాని, వెనకటి ఆ స్వాంతం చేసుకోవాలనే గాభరా లేదు. అప్పటిదంతా కొత్తగా నీరు చేరిన చెరువు తీరు; ఇప్పుడు మనసు నీరు తేరి స్వచ్ఛంగా ప్రశాంతంగా ఉన్నట్టుంది.

అదే దానినే వేరే మాటలలో చెప్పాలంటే, ఇప్పుడు నేను నిజంగా మీ కక్కర లేదు. ఊరికే ఏదో భరిస్తున్నారు.

తెలిసీ తమాషా చేసేవాళ్ళకు ఏమిటి చెప్పడం. మరి మనం ఇలా మాటలు పెట్టుకొని కూర్చుంటే ఈరోజు ప్రయాణం అయినట్టే. ఏడీ నాడు చెవిటి వాడు.

వాడా? వాడిందాకానే కారులో కూర్చున్నాడు.

అహాఁ నువ్వసలు వాణ్ణి ముందే ప్రయాణానికి సిద్ధం చేసేవన్నమాట! అబ్బ ఏమి జాగ్రత్త. నిజంగా ఏమీ ప్రమాదం అంటూ రాకపోవాలే గాని, వచ్చే మాటయితే మన యీ జాగ్రత్త అంతా అడ్డుతుందా?

ఏమి మాటలు పోనిద్దురూ? మన జాగ్రత్త మీద అంత నమ్మకం లేకనే ఇంట్లో హాస్పిటలు పెట్టిస్తామంటూన్నారు కదూ మీరు? అదుగో లక్ష్మి కాఫీ తెచ్చింది. మరొక కప్పు తాగేసి వెళ్ళండి. అక్కడ భోజనం ఏ వేళకి అవుతుందో.

నువ్విలా అతి గారాబం చేసి, నన్ను ఎక్కడికీ కదలకుండా చేసి పాడు చేస్తున్నావు. ఎక్కడికయినా వెళ్ళినా, మేతకి వెళ్ళిన పశువులాగ, మళ్ళీ సాయంకాలానికి ఇంటికి వచ్చెయ్యాలనిపిస్తుంది. మరిలా లాభం లేదు. ఈ వచ్చే జాన్యుఅరీ ప్రాంతలో పిల్లవాడితో సహా బయలుదేరి, ఒక నాలుగయిదు నెలలు దేశమంతా తిరిగి రావాలి.

అప్పుడే పిల్లవాడని మాకు నిశ్చయమే నన్న మాట?

ఏదో మాటవరసకి అన్నాను గాని, ఆడపిల్లయితే నాకు మరీ సంతోషం. ఎప్పుడో పెద్దయి, అత్తవారింటికి పంపించేటప్పుడు కదా కష్టం.

మగపిల్లవాడయితే మాత్రం—మన దగ్గర కూర్చుంటాడా? చదువుకొంటాడు, ఉద్యోగం చేసుకుంటాడు, తన సంసారం తాను చేసుకుంటాడు—ఇవాళకి ఆలస్యం అయినట్టుంది. రేపు బయలుదేర కూడదూ?

ఉహూఁ, ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. అప్పుడే తొమ్మిదో నెల వచ్చి పదిహేను రోజులు కావస్తుంది కదా.

ఎవరిపిచ్చి వారికానందం - ఏమీ లేనిదానికి పెద్ద హడావిడి చేస్తారు. పోనీ అంతే ననుకో. మరి నన్ను కదలనీ. సాయంకాలానికల్లా వచ్చేస్తాను.

రామమోహన్‌కి కారు నడిపేటంలోని తన జాగ్రత్తకి తనకే ఆశ్చర్యం కలిగింది. నిజమే మరి వెనకటిలాగ కాదు, తాను చాలా బాధ్యతాయుతంగా ప్రవర్తించవలసి ఉంది. ఇక కొద్దిరోజుల్లో తాను తండ్రి కాబోతున్నాడు. తన సంతతి చిన్నతనంలో తండ్రిలేకుండా పెరిగే మనుకోకూడదు. తనకోసమే కాదు, తన సీతకోసం, తన సంతతికోసం తాను జీవించవలసి ఉంది.

ఒక పదిసంవత్సరాల క్రితం ఎవరయినా జీవించవలసిన అవసరం గురించి మాట్లాడితే తనకి ఎంతో హేళనగా ఉండేది. ఆరోజుల్లో ఆత్మహత్య చేసుకోవాలనిపించిన తరుణాలు కూడా లేకపోలేదు.

కాని ఎంచేతనో నిండు ప్రాణాన్ని తీసుకొనే సాహసం లేకపోయింది. అది భయమను, చేతకాని తనమను, జీవితంమీద తీపి అను, ఏదన్నా సరే, అదే తనను కాపాడింది. కాబట్టే ఈనాడింతటి వెలితిలేని ఆనందాన్ని అనుభవించ గలుగుతున్నాడు.

తన భార్యపోయిన కొత్తలో ఎవరయినా నీకీ జీవితంలో మళ్ళీ ఇంతటి సౌఖ్యానికి సావకాశం ఉందంటే అర్థంలేని మాటలనుకొనేవాడు. జీవితమంటే ఒకటే అంధకారాద్రి కందరమనుకొనేవాడు—వెనుక తన భార్యతో తాను పొందిన సౌఖ్యానికి తన ప్రయత్నం ఏమీ లేదు. అది సహజసిద్ధంగా అయా

చితంగా, వచ్చినటువంటిది. అందులో తన ప్రేయస్సూ ప్రయోజకత్వమూ ఏమీ లేవు.

కాని, సీత తనకు అంత తేలికగా లభ్యం కాలేదు. నాలుగు సంవత్సరాలు ఎదురుచూసి చూసి, మరిక లాభంలేదని నిరాశచేసుకొన్న అనంతరం తనం టట తానుగా ఒకనాడు కబురుచేసింది. అంతే అదృష్టం వచ్చేటప్పుడు ముందుగా తన రాకనిగూర్చి తెలియచెయ్యదు. హఠాత్తుగానే వస్తుంది.

గతసుమారు ఆరేళ్ల కాలంలోనూ బైటిపరిస్థితులు మొగుసుగా ఉన్నా తరసుగా ఉన్నా ఇంటిలోపలికి వచ్చే సరికి మాత్రం ఏదో అనిర్వచనీయమయిన ప్రశాంతత ననుభవిస్తున్నాడు. అదికేవలం ఆహారవిహారాదులవల్ల వచ్చినది కాదు, పరస్పరం స్తుతిపాఠాలు చేసుకోడంవల్ల వచ్చినదికూడా కాదు. అసలు ఏమి మాట్లాడనే అక్కరలేదు. పరస్పర సాన్నిహిత్యంలోనే ప్రబోధింపమయిన శాంతి. వనుక ఏమీ చేసినా, ఎంత అనుభవించినా, ఇంకా ఏమిటో వెలితి ఉండిపోయినట్టూ ఇంకా ఏమిటో అనుభవించవలసినదీ, పొందవలసినదీ ఉండిపోయినట్టే ఉండేది. ఇప్పుడు మరి ఆ అసంతృప్తి లేదు. ఇక్కడికింతే చాలును; ఇంకా ఏమిటో, ఏమేమిటో కావాలనేది మరిలేదు.

ఈనాటికి తాను తండ్రి కాబోతాడని తానిది వరకు ఆశించనేలేదు - ఇది తనఆశలకు అతీత మయిన అదృష్ట విశేషం. మొట్టమొదట సీత నవ్వుతూ చెప్తే నిజమని నమ్మలేకపోయాడు.

కాని, ఇందుమూలంగా మరే కొత్తచిక్కులూ రాకుండా ఉండాలి. ఇప్పటికంతా సవ్యంగానే గడచిపోయింది. పల్లెటూరు మంత్రసానీ, పట్నపు మిడ్వైఫూ మరేమీ బాధలేదనే అంటున్నారు.

తన పూర్వపు దృక్పథానికీ, గత అయిదారు సంవత్సరాలలోని దృక్కోణానికి ఏమీ సంబంధం లేదు — అయితే ఈమధ్య కొద్ది నెలలుగా తనలో ఇంకా మార్పువచ్చింది. ఇటీవలివరకూ ఇక్కడికిది చాలును; ఇలాగే మరే మార్పు లేకుండా జరిగిపోతే చాలునన్న తృప్తి మాత్రమేగాని, ఇప్పుడు మాత్రం ఆశలు మరీమరీ ఎక్కువవుతున్నాయి.

తనూ చేసిఉండవలసినవీ, చెయ్యగలిగి చెయ్యక పోయినవీ, చెయ్యలేకపోయినవీ ఎన్నెన్నో తన సంతతి చెయ్యాలి. కేవలం తనవాళ్ళు — తన శరీరాన్ని ఎంత స్వంతంగా చూసుకో గలుగుతున్నాడో అంత స్వంతంగా చూసుకోగలిగిన సంతానం! పుత్రాదిచ్ఛేత్పరాజయమ్ అనే సూక్తిలోని అర్థం అనుభవపూర్వకంగాగాని తెలియదు.

ఇంత ఉత్సాహంగా ఊరు చేరుకొన్నందుకు, రాగానే డాక్టరు రాజేశ్వరం ఊళ్ళోలేదనీ, ఏదో ముఖ్యమయిన కేసులమీద వెళ్ళిందనీ తెలియగానే మనసుకి కష్టమనిపించింది. కాని, అంతకంటె ముఖ్యమయిన విషయం ఏమిటంటే, వాళ్ళ పెద్దక్కగారు కోరడమే తడవుగా వస్తానంది. అయితే తనతో వెంటనే రావడానికి కుదరదనీ, రెండు రోజులలో బయలుదేరి వస్తాననీ అంది. ఆవిడతోపాటు రాజేశ్వరం ఏర్పాటుచేసిన నర్సుకూడా వస్తుంది.

వాడు డాక్టరు రాజేశ్వరం లేకుంటా అని తాను మొగమాట పడబోయినా ఆవిడ వినుకోలేదు. భోజనం కాగానే ఒక్క అరగంట విశ్రాంతి తీసుకొని బయలుదేరిపోకూడదు, వేగం బయలుదేరిపోతే, చీకటి పడకుండా ఇంటికి చేరుకోవచ్చునని.

చెంటివాడి చేతికి చీటి డబ్బు యిచ్చి, కావలసిన వస్తువులు కొనిపట్టించుకొని తిన్నగా పెట్రోలు బంకు దగ్గరకు వచ్చి ఉండమన్నాడు.

వాళ్ళింట్లో మరొక గంట ఉంటే మధ్యాహ్నం టీ తీసుకోడము జరుగుతుంది. ఆ తరువాత కొంతసేపు గడిస్తే, సాయంత్రం భోజనానికి కూడా ఉండిపొమ్మని బలవంతం చేస్తారు. అంతకంటే ఏవో పనులున్నాయని చెప్పి బైటపడడమే మేలు. ఉన్నందువల్ల వాళ్ళకేమీ పెద్ద నష్టం కష్టం అని కాదుగాని, వాళ్ళకు అలవాటయిన దినచర్య ఆ పద్ధతిని సాగదు. ఎంతసేపూ ఎవరో అతిథి ఉన్నారనే దృష్టి ఉంటుంది — అంతకంటె వచ్చినపని అయిపోయినవెంటనే బైటపడడమే ఉభయత్ర మేలు. రాజేశ్వరం వచ్చిన తరవాతనయినా ఏమీ అనుకొందికి వీలులేకుండా వాళ్ళింట్లో భోంచేసేడు. ఇక మరి ఆగడం అనవసరం.

అసలు ఇంటికి వెళ్ళి ఉండనగా వెళ్ళిపోవడం కంటె పెద్ద అవసరమయిన పని ఏమి ఉంటుంది? ఎల్లుండి ఉదయం కారు పంపెస్తే సాయంకాలానికల్లా ఆవిడా మంత్రసానీ వచ్చేస్తారు. ఆ తరవాత మరి భయం, ఆత్రత ఉండవు.

వెధవ చెంటివాడు, ఇంతసే పెందుకు చేస్తున్నాడో? లిస్టు వాళ్ళచేతి కిచ్చేస్తే వాళ్ళే చకచకా కట్టి పారేస్తారు. అయినా వీడు వట్టి చవటవెధవ.

వాళ్లు పీడిపని చేస్తున్నట్టే ఉంటే, ఇతరపనులు చేసుకుంటూ ఉండిఉంటారు. తానే వెళ్ళిఉంటే ఇంత కంటే చాలా వేగంగా తెమిలిపోయి ఉండును. అయితే తాను వెళ్తే దుకాణాలవాళ్ళు ముఖ్యంగా బట్టల దుకాణాలవాళ్లు తనకు కావలసిన వాటికంటె అక్కరలేనివి ఎన్నో కొనిపిస్తారు. అంటే అక్కరలేనివయినా ఆనిమిషానికి ఎంతో కావలసిన వనిపించేటుగా నచ్చచెప్పగలరు. అవన్నీ చూసి డబ్బులాడిగు గాని, చిన్న నవ్వునవ్వి ఊరుకొంటుంది; కాకపోతే మహా అంటే, కొత్త వస్తువులు చూసేసరికల్లా మీరు మరీ చిన్నపిల్లలయిపోతారంటుంది.

ఈ వెధవ ఇంకా రాడేం, ఇప్పుడు తనకి ఈ రెండుగంటలఆట సినీమా చూద్దామని లేదు గాని, ఇలా చేసేకంటె అదే నయం—వీడికంటె డ్రయివరు అప్పలస్వామి అయితే ఎంతో నయం, చకచకమని పని చేసుకొనివస్తాడు.

కారులో కూర్చోవడం చికాకనిపించి, దిగి, కారుమీద ఒక కాలు వేసి, నిలబడి దగ్గరలోని బస్సుస్టేషనులో వచ్చిపోయే జనాన్ని చూస్తూ నిలబడ్డాడు. ఈ బయలుదేరుతున్న బస్సులు తాము వెళ్లే రోడ్డునే వెళ్తున్నాయి—అయితే తాము, చెవిటివాడు వస్తేనే గాని బయలుదేరడానికి వీలులేదు. వాడు రావడం బయలుదేరడం ఎంతో ఆలస్యంలో అయితే ఎన్నెన్ని మైళ్ళ దూరంలో కలుసుకోగలరు ఇప్పుడే వెళ్తున్న బస్సుని? ఇలా ఏదో ఆలోచించసాగాడు.

అమ్మయ్య! చెవిటివాడు అదుగో సామాను పట్టించుకొని రిక్షాలో వస్తున్నాడు.

ఇప్పుడింకా రెండు పూర్తిగా కాలేదు, సినీమా చూసి వెళ్ళినా వెళ్ళవచ్చును. కాని...

"ఏఁవేఁరోయ్ రామం, ఏమిఁటి నువ్వేనా?" —తనను ఎవరింతచనువుగా పిలుస్తున్నారు?—

"నిన్నేరా! పలకవేం, ఓస్ పలికితే పరువు తక్కువ కాబోలు."

రామమోహన్ అతి ఆశ్చర్యంగా ప్రక్కకు తిరిగిచూసేడు. కాని, ఆ దగ్గరకు వస్తున్న గడ్డాల మనిషిని మాత్రం ఈ జన్మలో ఎన్నడూ చూసిన జ్ఞాపకంలేదు.

ఆ మురికి దుస్తులలోఉన్న గడ్డాల మనిషి దగ్గరకు వచ్చి భుజంమీద తట్టడం తనకు ఏమీ బాగా తోచలేదు. అయితే తన అయిష్టాన్ని ఏవిధంగా ప్రదర్శించడమో నిర్ణయించుకొనేలోపునే అతను,

"ఓరి, నన్నే పోల్చుకోలేక పోతున్నావట్రా! పోనీ మొగంలో అంటే మార్పు ఉండగాని, గొంతుని బట్టి అయినా తెలియలేదురా?"

"ఎవరు మీరు? మిమ్మల్ని..."

"నన్ను మన్నిస్తావేమిట్రా? నేను సోమనాథాన్ని కానూ? అవును సాక్షాత్తూ సోమనాథాన్నే; అతని భూతాన్ని కాను"—

"సోమనాథమా, అంటే అప్పుడు పదేళ్ళ క్రితం..."

"అవును. ఇల్లూ వాకిలీ సంసారమూ అన్నీ విడిచిపెట్టి వెళ్ళిపోయిన సోమనాథాన్నే—"

"నిజమే? నేన్నమ్మలేకపోతున్నాను. నువ్వు లోగడ..."

"ఎప్పుడో చనిపోయేనని కూడా అనుకొన్నారటకదూ—నీకు ఎదురుగా ప్రత్యక్షంగా నేను మనిషిని కనిపిస్తున్నా నీకు నమ్మకం లేనట్టుంది. నీ మతి సరిగానే పనిచేస్తున్నదా?"

"నా మతా? నా మతి, సరిలే గాని, నువ్వు"

"ఏమిట్రా నీ అనుమానం? అప్పుడు చదువుకొనే రోజుల్లోనూ నువ్వింతే—అతి స్పష్టంగా కనిపిస్తున్న దానికికూడా ప్రయోగమూ, ఋజువూ కావాలనే వాడివి నువ్వు దాంతో ఒక్కొక్కప్పుడు మాష్టరికి నీమీద ఆగ్రహం పుట్టుకొచ్చేదకూడాను."

"అయితే నువ్వు నిజంగా అప్పుడు పారిపోయిన సోమనాథానివేననీ, బ్రతికే ఉన్నావనీ అంటావు?"

"నిజంగా నీ మనస్సు సరిగా పనిచేస్తుందో లేదో అనుమానించవలసిన సంగతే. ఏమోన్లే, పదేళ్ల కాలమనగా సామాన్యమా? అంతలో ఎన్ని మార్పులయినా జరగడానికి వీలులేకపోలేదు."

"మార్పులు, ఏమి మార్పులు? ఎందుకు రావాలి, ఊఁహుఁ వీల్లేదు."

"సర్లే ఏ మార్పులూ వద్దులే గాని, ఏమిటిలా నిలబడ్డావు. కారు స్వంతదారుగానా? డ్రయివరుగానా? లేక అద్దెకారయితే అందులో ఎక్కే మనిషిగానా?"

"రామమోహన్ ఏ సమాధానమూ చెప్పే లోపునే చెవిటివాడు సామానుతో వచ్చేడు. వాడికి

వినబడేలాగ అరవడం కంటె సామాన్లన్నీ సర్దుకుని హస్తసంజ్ఞతో చెప్పడమే మేలు. వాడు ఆ పనిలో ఉండగా సోమనాథం మళ్ళీ ప్రశ్నించేడు."

"ఏమిరా కొరుమాట ఏమీ చెప్పావు కావు. నీ స్వంతమా అద్దెదా? సరే, ఏదయినా బాధలేదు, మీ ఊరేకదూ వెళ్తున్నావు?"

ఏమిటి కొరుమాట కదూ? ఎందుకిప్పుడీ గొడవంతా."

"గొడవేమిట్రా! నీకు నిజంగానే మతి స్తిమితంగా లేనట్లే ఉంది. లేకపోతే నే నడిగినదానికి తిన్నగా సమాధానం చెప్పకుండా ఏదో అసందర్భంగా మాట్లాడుతావు. నేను ఒకటి కాదు, రెండు కాదు, పదేళ్లపాటు ఇల్లూ వాకిలీ విడిచిపెట్టి పోయాను. ఇన్నాళ్ళకి మళ్ళీ తిరిగివచ్చినందుకు, ఎక్కడకు వెళ్లేను, ఏమిటి చేసేను, ఇదంతా తెలుసుకోవాలనే కుతూహలం లేకపోయిందిగాని, అడిగినమాటకు సరిగా సమాధానం చెప్పడానికేమొచ్చింది? నీకుతోడు, ఈ మనిషి ఒకడు మూగివాడిలాగ ఉన్నాడు. తగిన దొరికాడులే. అసలు సంగతి చెప్పు, ఇప్పుడెక్కడికి బయలుదేరుతున్నావు? మీ ఊరికేనా?"

"ఊరికి కాకపోతే అడివికి వెళుతున్నా, ననుకో ?"

"ఏమోనే నీ వ్యవహారం చూస్తే అలాగే ఉంది. పోనీ ఈ ఒక్క మాటయినా సరిగా చెప్పావు. మరొక్కమాట అడుగుతాను, అది కూడా సరిగా చెప్పు—పదిసంవత్సరాల తరవాత ప్రపంచం దూరం నించి చూసినప్పుడు ఎంతో పెద్దదిగా మారినదిగా కనిపిస్తుంది తప్ప, దగ్గరగా వెళ్ళి పరీక్షగా చూస్తే, అంతా ఒక్కటే, మనం మామూలుగా చూసే లోటుపాట్లు, సంకుచితత్వము మరొక రూపంలో, కా డిగ్రీ భేదంతో ప్రతిచోట కనిపించేవే—నిజమయిన సుఖమూ ఆనందమూ అన్నవి మనిషి భావనలోనే ఉన్నాయి. ఆ భావనని తవది అన్న చిన్న కుటుంబ కూటం పెంపొందించగలిగినట్లుగా మరే పరిస్థితులూ వాతావరణమూ పెంపొందించలేవు. మనం ఇళ్ళలో ఉన్నప్పుడు స్వేచ్ఛ, స్వాతంత్ర్యమూ లేవని ఎంతో గునుస్తూ ఉంటాము, గాని, ఎక్కడికి వెళ్ళినా ఏవో కొన్ని కట్టుబాట్లకి లొంగుబాటు తప్పదు. సర్లే, ఇప్పుడు నా అభిప్రాయాలమాటకేం, ఇటీవల నాకు అతిగా సమయంసందర్భం లేకుండా మాట్లాడడం అలవాటయిపోయింది. నీకు ఒక్కమాటుగా ఎక్కువ మాటలు వింటే అర్థంకాక గాభరాగా ఉన్నట్టుంది. సరే అసలు సంగతికి వద్దాము. అద్దెదికానీ, స్వంతంకానీ, ఈ కారు ప్రస్తుతం నీ యాజమాన్యంలో ఉన్నట్టుంది. నాకు ఇందాకా రైలు తప్పిపోయింది. మళ్ళీ రాత్రి పదిగంటలవరకూ రైలు లేదు. దిగి పదిమైళ్ళు నడవాలి. ఈలోపుని మూడు అంచీలమీద చెయ్యాదగిన బస్సు ప్రయాణం ఉందంటే ఆ బస్సుకూడా ఇప్పుడే పది నిమిషాల క్రిందట వెళ్ళిపోయిందట. మళ్ళీ బస్సుగంట దాటేకగాని లేదు. అందుచేత నువ్వుగాని, ఇప్పుడు మీ ఊరికి బయలుదేరేమాటయితే, దారిలో నన్ను మా ఊరిదగ్గర విడిచిపెట్టేస్తావని......

"కారులో తీసుకెళ్ళమనేనా ?"

"అదే, అంటే కొన్నికొన్ని మాటలు సరిగానే బోధపడుతున్నట్టున్నాయి. మరేం భయపడకు; నన్ను ఊరికే తీసుకొని వెళ్ళక్కర్లేదు. కావాలంటే బస్సు టిక్కట్టిచ్చేస్తాను. లేదా నువ్వు అద్దెకు తీసుకొంటే, ఈ ప్రయాణానికయిన దాంట్లో సగం ఖర్చిచ్చుకొంటాను."

"డబ్బెవరికి కావాలి? కారో తీసుకొని వెళ్ళినందుకు డబ్బు పుచ్చుకుంటానా ?"

"పుచ్చుకో, పుచ్చు అది ంగతి. నను తీసుకొనివెళ్తే చాలును."

"తీసుకొనివెళ్ళడమా ? అదెలాగ ? నా కింకా, చాలాపని ఉంటే–"

"మరి ఇందాకా ఇప్పుడే బయలుదేరుతున్నావా అంటే ఊరుకొన్నావు ?"

"ఏమోగాని, నా కొకింకా ఇక్కడ చాలా పనులున్నాయి. తెమిల్తే రాత్రి ఏ పదిగంటలకో బయలుదేరుతాను. లేకపోతే, రేపుదయమో ఎప్పుడో వెళ్తాను."

'సర్లే నీకు మాట్లాడ్డం కష్టంగా ఉన్నట్టుంది, మరేమీ సమాధానాలు వాడక్కర్లేదు. నా కోసం నీ పనులేమీ పాడుచేసుకోకు. ఈ సాయంకాలంలోగా ఏదయినా బస్సు బయలుదేరితే వెళ్తాను. ఆ తరువాత మళ్ళీ బస్సు అందుకొని, మూడు అంచీలమీద ప్రయాణంసాగిస్తాను. అంతకంటె రాత్రి పదిగంటల రైల్లో వెళ్తేనే వేగం వెళ్ళవచ్చునేమో? కాని, తీరా ఇన్నాళ్ళతరువాత, ఇన్నేళ్ళు గడిచేక, ఇంటిముఖం పట్టేక సుమారు వెయ్యిమైళ్ళదూరంనుండి వచ్చి, ఈ

కొంచెందూరానికి ఇంత ఆలస్యం కావటం ఎంతో కష్టంగా ఉంది. అయితే అవతలఇంటిని చేరుకోక పోయినా, ఏదో కదుల్తూఉంటే మనస్సుకి కొంత తృప్తిగా ఉంటుంది. సర్లే మరెందుకు నీ కాలస్యం? నీకేదో పని తొందరగా ఉన్నట్టుంది; వెళ్ళు."

ఎక్కువ ఆలస్యం చెయ్యకుండానే రామమోహన్ కారు నడిపించాడు... కాని తీరా బయలు దేరినతరువాత, ఎక్కడికి వెళ్ళటం? ఏమిటి చెయ్యడం?

ఏమీ తోచక హోటలు దగ్గరగా ఆపాడు. వెళ్లి కూర్చున్నాడు, కాని, ఏమీ తినాలనీ తాగాలనీ అనిపించలేదు. అయినా యాంత్రికంగా ఏదో తీపి సామానుతిని కాఫీతాగి వచ్చి కార్లో పడ్డాడు.

చెవిటివాడికి మనమాటలు తిన్నగా వినబడవు గాని, తానుమాత్రం బాగానే మాట్లాడగలడు. మళ్ళీ కారు స్టార్టు చెయ్యబోతూఉండగా అన్నాడు. "బాబూ మరింకేమీ కొనక్కర్లేదుకదా. ఇప్పుడు బయలుదేరితే సాయంకాలం అయిదుగంటలకల్లా ఇంటికి వెళ్లిపోతాం బాబూ" అన్నాడు.

నిజమే వాడలా అనుకోటంలో పొరపాటేమీ లేదు. అరగంట క్రితం వరకూ తానూ ఎంత తొందరగా ఇంటికి చేరుకోగలననే తహతహ పడ్డాడు. కాని, మరి అరగంటలోనూ అంతా పునాదులలో నుండి మారిపోయింది. తాను వెనుకటి రామమోహన్ కాడు - తానేకాడు, తన పరిసరాలు, సమీప వ్యక్తులు ముఖ్యంగా సీత సంపూర్ణంగా మారిపోవాలి.

అసలిప్పుడు చేయవలసినపనేమిటి? కింకరణీయం? కిమకరణీయం?" అబ్బ ఏమిటిలా చమట పోస్తున్నది ఎక్కడో ఒకచోట కాస్తసేపు కూర్చొని, శాంతంగా నిదానంగా ఆలోచించాలి. ఎక్కడ కూర్చోడం, ఏమిటి చెయ్యడం?

ఎటూ నిశ్చయం లేకుండానే కారు నడిపించ సాగాడు. పోలీసువాడు నిలవేసిన అరక్షణంలోనూ ఎదుటిగోడమీద సినిమాపోస్టరు కనబడి తాత్కాలికంగా కార్యక్రమాన్ని నిర్ణయించింది.

సినిమాలో కూర్చున్నంతసేపూ భూతభవిష్యద్వర్తమానాలు కూడా పెనవేసుకొని, ఏది నిజమైనదో బలమైనదో నిర్ణయించుకోబడనట్టు తయారయాయి—ఎదురుగా చూస్తున్న సినిమా ఎప్పటికప్పుడు బొమ్మలు కనిపిస్తున్నాయి. మాటలు వినిపిస్తున్నాయి, అర్థమయినట్టే ఉంటున్నాయి. కాని, రెండునిమిషాల క్రితం జరిగిన ఘట్టమేమిటో బోధపడకుండా ఉంది. అలా చూస్తూనే ఒకక్షణంలో పదేళ్లక్రితం తనభార్య పోయినరోజుల్లో ఒంటరిగా జీవితమంతా మోడుగా గడపదలచిన మనిషిగా చూపించేవాడు. అంతలోనే తాను ఇంటికెళ్లడం, ఇంటిదగ్గర సీతతో ఆప్యాయంగా కబుర్లు చెప్పుకోటం, డాక్టరమ్మ నర్సు రావటం, సీతకు కొడుకు పుట్టాడని ఎవరో వచ్చి చెప్పడం - ఇదంతా తనకళ్లఎదుట సినిమాలాగే జరుగుతున్నట్టే కనిపిస్తోంది. అచ్చుపడిన కాగితంమీద అడ్డంగా మళ్ళీ అచ్చు పడినట్టుగా, తాను వెళ్ళిన కొద్దిక్షణాలకే వాసు సోమనాథం రావటం, పెద్ద హంగామా జరగటం, ఊళ్లోవాళ్లందరూ మూగడం, మామూలుగా తనతో మాట్లాడడానికి కూడా జంకే మనుష్యులు తనకి వ్యతిరేకంగానూ అనుకూలంగానూ తీర్పుచెప్పటం ఇదీ జరుగుతున్నట్లుగానే కనిపించేది. మరోకవైపునుండి, తానింటికివెళ్లి హాయిగా స్నానం చేసి నిద్రపోయిన సందర్భంలో వాడు వెళ్ళి ఊళ్లో సంగతంతా కనుక్కొని, తిన్నగా ఏదో కర్రో కత్తో గాని పట్టుకొనివచ్చి నిద్రలో ఉండగానే పైసలా చెయ్యవచ్చును. అసలే తానే స్వయంగా చేస్తే - ఛ, ఛ, తనచేతులను ఎంతమాత్రం మలినం చేసుకోరాదు. ఈ విషయంలో ఇంతవరకూ తానేమీ తొందరపాటు పనిగాని, ఒకరికి కష్టం కలిగించేపనిగాని చెయ్యలేదు. పూర్తిగా నూటికి నూరుపాళ్ళు ఆమె ఆమోదంతోనే ఆమెను చేపట్టాడు. అందులోనూ తను సుఖపడాలని ఎంతగా ఉందో అంతకంటెకూడా, చిన్నతనంలోనే వాడిపోయిన ఆమె జీవితలతకు పునర్వికాస వాసనాభాసురతను చేకూర్చాలనే భావం కూడా ప్రబలంగా ఉంది. కాకుంటే, తాను పెళ్ళి చేసుకోవాలంటే, మరెక్కడా అందమయిన స్త్రీలే దొరకకపోయారా? సుమారు నాలుగేళ్లు ఆమె ఆమోదంకోసం ఎదురుచూడవలసిన పనేమి?

కాకపోయినా ఇల్లూ వాకిలీ, చదువూ సంస్కారమూ అన్నీ ఉండి, ఏదో ఘనకార్యం చేసి, బుద్ధభగవానుడిలా ప్రపంచాన్నంతటినీ ఉద్ధరిద్దామని పోయిన మనిషి మళ్ళీ ఈనాటికి ఈవిధంగా తిరిగి రావడమా? అంతగా తిరిగి రావాలంటే ఒకటి రెండేళ్ళలో తిరిగివస్తే ఎవరు వద్దన్నారు? ఒకటి కాదు, రెండు కాదు, నాలుగేళ్లయినా రాని మనిషి, ఉత్తర

మయినా రాయని మనిషి, అసలు తాను ఎక్కడో ఒకచోట ఉంటున్నానని తెలియజెయ్యని మనిషి, తాను చచ్చిపోయి ఉంటానని సైతం ఊహించడానికి వీలుకల్పించిన మనిషి—అటువంటివాడికి ఒక దశ అనంతరం ఇప్పుడిలా హఠాత్తుగా ఆకాశంమీద నుంచి, పిడుగుపడ్డట్టుగా ఊడిపడడానికి గల హక్కేమిటి?

ఒక మనిషిని తానే సర్వస్వం అని నమ్ముకొన్న మనిషిని, ఏమవుతుందో అన్న ఆలోచన లేకుండా విడిచిపెట్టి, బ్రతుకంతా దుఃఖభాజనం చేసి, చిట్టచివరికి ఎలాగో కొత్త ఆనందరేఖలు పొడసూపే సమయంలో మళ్ళీ వచ్చి రెండు నిండు జీవితాలను నాశనం చెయ్యడానికి ఏ మనిషికి మాత్రం హక్కుండుండాలి?

తన మాటకేంగాని, అసలిప్పుడు సీత గతి ఏంగావాలి? అతను వచ్చి ఆమె నాదంటే, విడిచిపెట్టవలసినదేనా? ఆమెను అతడు ఎన్ని హింసలు పెట్టినా చూస్తూ ఏమీ చేతకానట్టు ఊరుకోవలసిందేనా? అంతే, తనకు నోరెత్తి మాట్లాడ్డానికి హక్కులవలేశమూ లేదు.

అంతేనా? హక్కు లేదనీ, చేతకాదనీ, ఏది ఎలా జరిగితే అలా జరగనీ అని చూస్తూ ఊరుకోవలసిందేనా? అంతటి అశక్తుడా తాను?

ఏమి, ఎందుకు ఊరుకోవాలి? తన చేతులలో బలముంది; ధనముంది; పలుకుబడి ఉంది. కోర్టులూ శాస్త్రాలూ వీటి లెక్కను తన పక్షానికి ఎంత బలమున్నా లేకపోయినా, ఆత్మసాక్షిగా తనపట్ల న్యాయం ఉంది. మరయితే తానెందుకు ఏమీ చేతకానివాడుగా ఊరుకోవాలి?

చెయ్యడానికేముంది? ఏదో ఒకటి చెయ్యవచ్చును. కాని, ఏం చేసినా చెయ్యకపోయినా ఈ పరిస్థితిలో సీత మనస్సును కల్లోలపరచడమే అవుతుంది. అందులో ప్రస్తుతపు సున్నితమయిన స్థితిలో-ఇప్పుడు సోమనాథాన్ని గూర్చిన ఆలోచనే ఆమె మనస్సుకి రాకూడదు—అందు కేమిటి సాధనం?

ఒక్కటే వీలుంది—ప్రమాదమయినా సరే, ఇప్పటికింకా బాధలేదు—మంత్రసానితో సహా ఆమెను బయలుదేరించి, కొంతకాలంపాటు ఆమెను ఎక్కడికయినా తీసుకొనిపోవాలి. రాత్రికి రాత్రి బలవంతంచేసి, దూరంగా తీసుకొనిపోయి, ఎవ్వరికీ తెలియకుండా ఏ హాస్పిటల్లోనయినా ప్రవేశపెడితే-తన సంతానం అయినా దక్కుతుంది. అంతకంటె సీత తనకు వెయ్యిరెట్లు ముఖ్యమే—ఆమె తనదిగానే ఉండడానికి మానవమాత్రుడికి వీలయిన ప్రయత్నమంతా చేస్తాడు. కాని అప్పటికీ దైవం ఎదురు తిరిగినా, ఆమె ప్రతిబింబంగా చేసుకొందికయినా తన సంతానం తనకు దక్కుతుంది.

అంతే మరిగత్యంతరం లేదు. వెంటనే సీతను తీసుకొనిపోయి, ఎవరికీ తెలియకుండా కట్టుదిట్టాలు చేసి, హాస్పిటల్లో ప్రవేశపెట్టాలి. ఇంట్లో ఉన్న డబ్బు ప్రస్తుతానికి చాలును. ఈలోగా వాడు తనకి భయపడి పారిపోయే ననుకొంటే అనుకోనీ, ఏ అపకీర్తి అయినా సరే, సీత హాయిగా ఉండి, క్షేమంగా ప్రసవించడం తనకు ప్రధానం.

అంతకంటె, అబ్బే ఆమె మనస్సు క్షోభపడకుండా ఉండాలంటే సాధనాంతరం లేదు...హుఁ, ఇలాంటి సమయంలో ఒక్క నిమిషంకూడా అమూల్యంగా లెక్కించవలసిన ఈ సమయంలో తాను తీరుబాటుగా కూర్చుని, పిచ్చిబుచ్చు సినీమాలోని హాస్యనాటక ప్రదర్శనని చూసి సంతోషించబోవడంకంటె హాస్యాస్పదమయిన సంగతి ఇంకేముంటుంది?

దిగ్గనలేచి చరచరా అవతలికి వచ్చాడు. కారు తీసి స్టార్టు చెయ్యబోతూ ఉండగా చెవిటివాడిమాట జ్ఞాపకం వచ్చింది. కాని, వాడికోసమని కొంతసేపు ఆలస్యం చెయ్యడం మంచిదికాదని, కారుని సవ్యంగా తిప్పేడు. అంతలోనే లోపలినుండి పంచీ సర్దుకొంటూ వచ్చాడు వాడు. వాడికి కారు చప్పుడు వినిపించిఉండదు. కాని, వాడు ప్రతిక్షణం వెనక్కి తిరిగిచూస్తూనే ఉన్నాడు. బాబు సీటులో లేకపోవడంచూసి, వాడూ బైటికివచ్చాడు వాడిని ఎక్కి కూర్చోమని సంజ్ఞచేసి, కారు నడపడం మొదలుపెట్టాడు—

పట్టణం మధ్యలోనే కారు చాలా జోరుగా పోతున్న సంగతి చెవిటివాడికి తెలుసును—కాని, బాబుగారి సంగతికూడా బాగానే తెలుసును. అయినా ఉండబట్టక, కొంచెం ముందుకివంగి, "మన డ్రయివరు కాలీరోడ్లమీదకూడా ఇంత జోరుగా వదలడం ప్రమాదం అంటాడు." అన్నాడు—

"ఇవాళ ఇదేం స్పీడుచూసేవు, ఇంకా ముందుముందుంది" అన్నమాట వినబడకపోయినా ధోరణిని బట్టి వాడికి ఏదో అర్థమయినట్టే ఉంది. మొదల

కుండా వెనక్కి చేరగిలబడి మనసులో, ఏదో ప్రార్థన కాబోలు, గొణుక్కో సాగాడు—

ఊరుదాటేక వాడు భయపడినట్లుగానే కారు వేగం మరీ ఎక్కువయింది. బాబుగారు రావడాన్ని చూడకుండా ఉంటేనే బాగుండిపోవును, చూసి తాను ఊరుకోలేరు—కొన్ని కొన్ని మలుపులు తిరిగిన సందర్భంలోనూ, ఎదురుగా బళ్ళూ అవీ వచ్చినప్పుడు, సరిసరి ఏదో ప్రళయం మూడిందనే అనిపించేది. కాని, అంతలోనే ఎంతో దూరం తాము ముందుకి సాగిపోయి ఉండేవారు.

అదేమిటి చెప్మా, ఏదోబస్సు రోడ్డు మధ్యను నిలబడిపోయింది, మనుష్యులందరూ రోడ్డుమీద అటూ ఇటూ తిరుగుతూ ఉన్నారు.

రామమోహన్ మొదట తిన్నగా సాగిపోవాలనే చూసేడు. కాని, బస్సు మనుష్యులు ఎదురుగా నిలబడి అడగడంవల్ల ఆగక తప్పిందికాదు. వాళ్ళకి కావలసిన సామానులలో కొన్నే తన కారులో ఉన్నాయి.

అంతా బాగానే ఉందిగాని, తాను ఎవరినయితే తప్పించుకొందికిలా మేఘాలమీద వెళ్తున్నాడో ఆ మనిషినే తన కారులో తీసుకొనివెళ్ళడం తప్పని సరయింది—స్థలం లేదనడానికి అవకాశం లేదు—పైగా ఆ బస్సు బాగయి వెళ్ళినా మరి ఎనిమిది మైళ్ళలో ఆగిపోతుంది. అక్కడ కనెక్షను బస్సు ఈపాటికి బయలుదేరిపోయి ఉంటుంది. అతడి తాపత్రయం కంటె బస్సువాళ్ళ సిఫార్సు ప్రబలమయింది—

దైవం అను, విధి అను, కర్మ అను, అది అడుగడుగునా అడ్డు తగలడం అంటే ఇదే. సరిగా ఈ బస్సు ఇక్కడెందు కాగిపోవాలి? మరి కొద్ది మైళ్ళు సక్రమంగా సాగిపోయి ఉండకూడదా? అక్కడ కనెక్షను బస్సు దొరకదు—దొరికినా అంతకంటె చాలా ముందుగానే తాను ఇల్లుచేరుకొని తిరుగు ప్రయాణం సాగించడానికి వీలుండి ఉండేది.

'అంతా ఈ చిన్న అడ్డంకితో తారుమారయిపోయింది. వాళ్ళ ఊరు ఒక రెండుమైళ్ళు ముందే గనుక, అక్కడ దిగి, వెంటనే సంగతి సందర్భాలు తెలుసుకొని, తత్క్షణమే దాడి చేడలవచ్చును—అటువంటి సావకాశం వాడికి చేజేతులా తానే కల్పిస్తున్నాడు—ద్వంద్వయుద్ధ మర్యాదలలో అవతలివాడు నిరాయుధుడైనప్పుడు, వాడికి ఆయుధం అందించి మరీ యుద్ధం చెయ్యడం తనకు చిన్నతనంలో అర్థమయేది కాదు—అంతకంటె అర్థం కాకుండా అసందర్భంగా ఉంది, తాను ఎవరివద్దనుండి పారిపోవాలనుకొన్నాడో, ఎవరికంటె కొద్ది క్షణాలయినా ఇంటికి ముందుగా వెళ్ళడం అవసరమనుకుంటున్నాడో ఆ మనిషినే తనతో పాటు హాయిగా కారులో తీసుకొని వెళ్ళడం—

ఏం చేస్తాం, మరి తప్పేదికాదు, ఇంతే కాబోలు కర్మఫలం అంటే.

ఉదయం ఈదారిని టప్పుడు ఎంత నిదానంగా ఎంత జాగ్రత్తగా వెళ్ళేడు తాను. అప్పుడు తనలో ఎన్నో చిగుళ్లు, మొగ్గలూ, పువ్వులూ ఉండేవి. ఇప్పుడు తనకింక మిగిలిందేమిటి? పలువురిలోనూ అవమానమూ నగుబాటూ తప్పిస్తే—"సంభావితస్య చాకీర్తి ర్మరణా దతి రిచ్యతే" (అందరిలోనూ గౌరవింపబడినవానికి అపకీర్తి మరణముకన్న హెచ్చైనది) అన్నాడు భగవద్గీతలో. నిజమే, ఈ రకమయిన అపకీర్తి అవమానంకంటె మరణమే మేలు—

కారు ఉండుండి విపరీతమయిన వేగాన్ని అందుకొంటూంది; అంతలోనే మళ్లీ రెండెడ్లబండిలాగయిపోతూంది. సోమనాథానికి తన ఇందాకటి అనుమానం నిజంగానే తోచింది. రామమోహన్ మనిషి స్థిమితంగా లేదనడానికి ఇంతకంటె ఏమిటి తార్కాణం కావాలి? కొంతసేపు చూసి చూసి మరి భరించలేక పోయాడు. నెమ్మదిగా అన్నాడు. "రామం నిజంగానే నీవంట్లో బాగున్నట్టులేదు. నువ్వు వెనక్కి పోయి విశ్రాంతిగా కూర్చో, నేను కారు నడుపుతాను అన్నాడు.

ఆమాట ఏమీ అర్థం కానట్టుగా ఒక్క క్షణం ముగం పెట్టి, తరవాత, 'సరే' అని కారును హఠాత్తుగా ఆపి, చెవిటివాణ్ణి కూడా ముందుసీటులోకి పొమ్మని, వెనక సీటులో సుమారు పడుకొన్నట్టుగానే కూర్చున్నాడు సగం కన్ను మూసుకొని.

సోమనాథం కారును అతి చాకచక్యంగా నడిపించుకుపోతున్నాడు. మైలురాళ్లు చకచకా పరుగెత్తుకొనివచ్చి వెనక్కు వెళ్ళిపోతున్నాయి. ముప్పై, ఇరవైతొమ్మిది, ఇరవైఎనిమిది...... ఇరవైనాలుగుకూడా దాటిపోయింది. అంతే. ఇరవైమూడు అల్లంతదూరంలో ఉండగానే అటునుండి జోరుగావస్తున్న ఒకలారీ కారూ ఢీకొన్నాయి. మరొక అరగంటలోవచ్చిన ఇంకొకలారీ చూసి, అక్క

డికి దగ్గరి లోకల్ ఫండు హాస్పిటలుకు చేరవేసింది క్షతగాత్రులనూ హతులనూ. అక్కడనుండి ఆ తెల్లవారుజామునే తీసుకొనిపోయారు పట్నంలోని పెద్ద హాస్పిటలుకు దెబ్బలుమాత్రమే తగిలివచ్చిపోకుండా ఉన్నవాళ్ళను——

అందరిలో తక్కువదెబ్బలతో బైటపడినవాడు చెవిటివాడు.

తలమీద బలమయిన గాయాలు తగలడంవల్ల రామమోహన్ బ్రతుకుతాడని మొదట నమ్మకంలేక పోయింది. కాని, క్రమంగా కోలుకొంటున్నాడు.

అతనికి బాగా తెలివివచ్చి చూచేసరికి ఎదురుగా సీతకూర్చునిఉంది ఒళ్ళో పసిపాపను పెట్టుకొని. ——అతనికి ఎక్కువ ఆలోచించవలసిన శ్రమ కలగకుండా, "మీరు ఇక్కడ ప్రవేశపెట్టబడ్డాక, ఆవిడ డాక్టరుగారి అక్కగారు చెప్పినప్రకారంగా నేనూ ఇక్కడే ప్రవేశించాను. ఇదుగో మీకొడుకు, అంతా మూడుమూర్తులా మీ పోలికే చూచుకోండి." అని చూపించింది.

రామమోహన్ వెంటనే ఏమీ మాట్లాడలేకపోయాడు. అతనికళ్ళు నీళ్లతో నిండిపోయాయి. ఎలాగో సర్దుకొని, "పాపం నావల్ల నీకు మరింత మానసిక వ్యథ, శారీరశ్రమ కలిగాయన్నమాట?" అన్నాడు.

"లేదులేదు నాకే శ్రమా లేదు. మీరు మెలకువల్లో నేను హాస్పిటల్లో పురుడు పోసుకోవాలన్నారు. ఆ ప్రకారమే జరిగింది. నాగురించి నాకేమీ విచారం లేదు - గాని, మొన్నటివరకూ పెద్దడాక్టరుగారు మీమాట ఏమో నిశ్చయంగా చెప్పలేమనే అనేవారు. ఒకవేళ ప్రమాదం తప్పినా దృష్టిపోయినా పోవచ్చునన్నారు. ఏదో, భగవంతుడిదయవల్ల నా అదృష్టం బాగుంది. మీరు ఆవేళ బయలుదేరిన దగ్గరనుండీ నా మనసు అదోకలాగు అయిపోయింది. అందుకు తగినట్టుగానే జరిగిందికూడా. మీరుకొస్త లేచి తిరగ్గానే చెల్లించవలసిన నాకోరిక ఒకటిఉంది. అదికారు అమ్మివేయడం.

"నీకంత కోరికగా ఉంటే కాదంటానా? అయినా జరిగినదానికి కొంతవరకు మాత్రమే నేను బాధ్యుణ్ణి. నేను-నడపడం మానేసి, ఇంకొకమనిషిని నమ్మి అతడికి నడిపేపని అప్పగించడంవరకు నాదే పూచీ - ఆ తరవాత మాత్రం ఏమి జరిగిందో లేదో నాకసలు తెలియనే తెలియదు.

"ఆగొడవంతా చెవిటివాడు చెప్పాడులెండి. మొత్తానికి అందరిలోనూ ఏమీ ప్రమాదమయిన దెబ్బలు తగలకుండా బైటపడ్డవాడు వాడొక్కడే - అయితే మీరిద్దరే పద్లారుకదా, ఎవరండీ ఆ మూడవ మనిషి? గడ్డాలూ అవీ ఉండేవట, పాపం తక్కిన వాళ్లలాగ హాస్పిటలుకి చేర్చేవరకూ నయినా బ్రతకలేదట - ఆరెండవ లారీ వచ్చేసరికే పోయాడుట.

నిజానికి ఆత నెవరో అందరికీ ఆశ్చర్యం పట్టడానికి కారణం యేమిటో? ఊహూఁ ఏమిటి జరిగిందో, ఎవరిది పొరపాటో నాకేం తెలియదు, అక్కడే పోయాడా? ఎవరో తెలిసిందా?"

"ఏమిటి మీకూ తెలియదా? అందరూ మీకు తెలుసు ననుకొంటున్నారు."

"ఎవరికీ తెలియదన్నమాట? నాకు సరిగా తెలియదు. ఎవరో ఉత్తరాది మనిషనుకొంటాను. దారిలో తా నెక్కిన బస్సు చెడిపోతే, కారులో కొంతదూరం తీసుకెళ్ళమంటే సరేనన్నాను. తరవాత నాకు వంట్లో కొంచెం చికాకుగా ఉండి, తాను బాగా కారు నడపగలననీ, నడుపుతాననీ అంటే అలాగే కానీ అన్నాను. నేనూ అనుకొన్నంతమట్టుకు అతని నడపడంలో పొరపాటేమీ లేదు.

"పాపం, ఎవరో ఊరూ పేరూ తెలియకుండానే పోయాడు——అతనికి కావలసిన వాళ్లెంత బాధపడతారో?"

"ఏమో అసలు, పాపం, కావలసిన వాళ్లెంటూ ఉన్నారో లేరో? ఏడీ బాబు సరిగా చూడనివ్వనీ, ఏమో, నా పోలికో నీ పోలికో నాకేం తెలియడంలేదు——మనమింకా ఇక్కడ మరెన్నాళ్ళుండాలి?"

"నే నట్టే అక్కర్లేదుగాని, మీరుమాత్రం మరొక పదిపదిహేను రోజులుండాలనుకుంటాను."

"అయితే అబ్బాయికి పేరేం పెడదామంటావు?"

"మీరేదంటే అది. కాని, మీరు ఎక్కువ మాట్లాడడం మంచిదికాదట. కళ్ళుమూసుకొని పడుకోండి. ఈ పక్కగదే నాకు ఏర్పాటు చేశారు డాక్టరుగారు. వెళ్తాను. పడుకోండి. తరవాత మళ్ళీ వస్తాను.

# సుగుతోట

## శ్రీ నోరి నరసింహ శాస్త్రి

ఆంధ్రోద్యమము ప్రారంభమైన పిమ్మటను అంతకు పూర్వము తెలుగువారిని గూర్చిన కావ్యము లెందరో కవులు రచించినారు. కొన్ని వారి గొప్పదనమును ప్రశంసించును, కొన్ని వారి జీవనము చిత్రించును. దాసు శ్రీరాములు కవి వ్రాసిన 'తెనుగు నాడు' వంటి కావ్యములు తెలుగువారిలో పలు తెగల వారి యాచార వ్యవహారములను కట్టుబాటులను మాట మంతులను నర్మోక్తితో చిత్రించును. శ్రీ రాయప్రోలు సుబ్బారావే 'ఆంధ్రావళి'లో ఆంధ్రుల శౌర్య ప్రతాపములను ఎన్నియో ఖండకావ్యములలో శ్లాఘించినాడు. అందులో 'ప్రబోధము' వంటి కృతులు విశేష ప్రచారము గన్నవి.

'అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు...'

ఇత్యాది పద్యము నెరుగని విద్యార్థులు గాని విద్యాధికులు గాని అరుదు. ఐనను కేవల కావ్య దృష్టితో చూచినచో తెనుగు దేశముపై ప్రేమాభిమానములు ప్రదర్శించు నాధునిక కావ్యము లన్నిటిలో శ్రీ సుబ్బారావు 'తెనుగు తోట' విలక్షణమైనది. దానికవిత నిరుపమానమైనది.

ఇందులో తెలుగువారి పూర్వపు నాటి గొప్పదనమును ఆవేశముతో వర్ణించు పద్యములు లేవు; నేటి వారి నుద్బోధించు ప్రయత్నమున్నట్లును ప్రత్యక్షముగా నగుపడదు. తెలుగు దేశములోని యాచార వ్యవహారము లిట్టివని చెప్పుచు చేయు వర్ణనములు కనిపింపవు. వాచ్యముగా తెలుగుగడ్డపై నభిమానము చెప్పబడదు. ఐనను, ఈ కావ్యము చదువువారికి కృష్ణవేణీ తరంగిణిపై పూలనావ కట్టుకొని తరుణుల సహవాసమున సముద్రములో కలయువరకు వాహ్యాళి పోవుచున్నట్లుండును; తెలుగు దేశము ప్రత్యక్షమగును; ముఖ్యముగా ప్రాతఃకాల దృశ్యము లన్నియు గోచరించును; తెలుగు దేశముపై ప్రేమ అతిశయించును; అందులో మంచిచెడ్డలు తెలిసికొననగును; పూర్వపు ఔన్నత్యము స్మరణకు వచ్చును. ఈ కావ్యము కవి చెప్పిననాటికి భరతభూమికి స్వాతంత్ర్యము లేదు. ఇందులో తెలుగుతల్లి దర్శింపబోవు దివ్యజ్యోతి భారత స్వాతంత్ర్యమనియే అప్పుడు కవి ఉద్దేశించి యుండును. నిశ్చయమే! కాని ఆత డామాట స్పష్టముగా చెప్పలేదు. అందుచే పారతంత్ర్యము పోయిన ఈనాడు గూడ మనము సాధింపవలసియున్న యనేక లక్ష్యములను కవివాక్కు సూచించును. ముందెన్నడైన సాధింపవలసివచ్చు నాదర్శములను గూడ అది ధ్వనింపజేయగలదు. ఈ కావ్యము చెప్పిన వ్యక్తి ఉద్దేశించి యుండని వస్తువునే కావ్యము సాధించినది. కావ్యరచనా సందర్భమున సుబ్బారాయవ్యక్తి కేవల కవివ్యక్తిగా విస్తృతమయినందుననే అట్టిది సాధ్యపడినది. వెనుక ఋషి తాను ఋషినైతి ననుకొన్నట్లె సుబ్బారావు కూడ 'కవి రభవ'మ్మని యనుకొని యుండవలెను!

శ్రీ సుబ్బారావు తెలుగునాటి (తెలఘాణ్య) బ్రాహ్మణుడు. తెలంగాణమే పెద్ద యుద్యోగమున నాతని నిలిపినది. తన నాడియం దాతనికి ప్రేమ అభిమానము కలవు. ఎవరికుండవు? కాని యాతడు తన తెలుగునాడు చిన్న తెగకే గాక సమస్తమైన తెలుగువారికి అన్వయించునట్లు విస్తృతము చేసినాడు. మంగళాచరణము చూడుడు.

'ప్రొద్దుపొడుపు నోములు నోయబూనినావొ
చిట్టిబొట్టు కుంకుమ బెట్టు చిన్నదాన!

* * *

కడలవెల్ల నాకర్షించి కనులుగట్టు
తెనుగువిరారిన గరువంబు దీరుతేల?

* * *

తీయని తెనుంగు మాటల దెలుపగలవొ
కన్నెవాదో తెనుగునాటి చిన్నదాన!'

## 2

తెనుగుతోట కావ్యవస్తువు చిన్నది. అవతారికలోని మూడు ఘట్టములు కాక ఇరువదిమూడు ఖండకృతులే! అందులో ఏదియు పాతిక పంక్తులు దాటదు. ఆ వస్తువుకూడ స్వల్పమే. ఈ చిన్న కావ్యములోనే నిత్యమనోజ్ఞమైన తెలుగునాటి సర్వస్వమును ఇమిడ్చినాడు కవి!

ముందు 'లేఖినీ సభావాహన' చేసినాడు. మిలనువంటి పాశ్చాత్య కవులు సాహిత్య దేవతను

'నా చేత నేమి పల్కింతువు?' అని సంబోధించుటను జప్తికి తెచ్చును. కాని సామ్య మంతవరకే!

'మధుర మధుమాస సాంధ్యయామములలోన
నిసుక పఱకలబడి యింపయి ప్రవహించు
నేటియొడ్డుల దిరుగాడ నిచ్చగింతొ?

* * *

కొమ్మపై నిల్చి పిల్లనగ్రోవి నూదు
గొల్లచిన్నవానిని జూడ నుల్లసింతొ?'

* * *

ఇట్లడిగి యడిగె కవికుమారుడు,
'విలస దుదయవ్రతోద్వాహవిధము జెప్పి
రసికజనులను లాలింపు రమ్యగీతి!'

అని లేఖిని సాహ్వానించినాడు.

అపిమ్మట కవి 'గీతాసఖ్య' మాచరించినాడు. గీతముతో సఖ్యము చేసికొనని లేఖిని వ్రాయగలుగునది లాభనష్టముల పద్దులేకదా! గీతాసఖ్యమున్న లేఖిని భావపద మందుకొనును.

'పొడుపుచేల్లు త్రుళ్ళింతలాడెడు విధాన
బాడుమమ్మ, గీతాసఖీ, భావపదము!
కోయిలకు మారుగూయు లేగొల్లకొమిరె
మసగి పచ్చిసులాడు బ్రాహ్మణకుమారి
బ్రమసి వలపెత్తనాలింప ప్రచురఫణితి
బాడుమమ్మ, గీతాసఖీ, భావపదము!
రుధిర కణపూర్ణమైన వీరునికరంబు

* * *

ద్రోహమున నల్లబడిన యస్తులభరంబు
ప్రేమచే ధౌతమైన సాధ్వీనఖాళి
రత్నగర్భ దాచిన సప్తరంగములను'

భావపదము పాడునట్లు గీతాసఖ్యము సాధించినాడు.

అంతట 'మంగళాచరణము' ప్రారంభించెను. తెలుగునాటి చిన్నది ప్రొద్దుపొడుపు నోముకు బయలు దేరినది.

"ఎచటికేగెదు? నోము పేరేమి? చెపుమ!
ఎవరధిష్ఠానదైవము? వ్రత్తమెద్ది?
సాంగపూజావిధాన మే భంగి జరుగు?
తగు నుపాయన మేది? తత్ఫలము లెవ్వి?"

ఇత్యాదిగా ఆంధ్ర యువకు డొకడు కన్నెను వరుసగా మూణ్ణాళ్ళు ప్రశ్నించినాడు. తుదకు సోదరుని కాపిల్ల యాదేశించినది!

'ఆలకింపుము బాలరసాల శాఖ
నుయ్యాలల నూగుచును మధులియ్య ఫణితి
బాడుచున్నది కోయిల పాటకత్తె
పావనంబైన మాతృసేవా వ్రతంబు!'

ఆ పిమ్మట నాతనికి 'కోకిల పాట' వినిపించినది. ఆ పాటలో తరంగములు ఇరువదిమూడు!

సంక్రాంతిపండుగ రోజులలో కృష్ణాతీరమున బొమ్మలు పెట్టుకుని కన్యకలు గొబ్బిదేవరను పూజింతురు. ప్రతి రాత్రియు దేవరకు పవళింపుసేవ చేయుదురు. మరల ఉదయమున దానిని లేపుదురు! ఎట్లు?

'నిద్రలే గొబ్బెమ్మ, నిద్రలేవమ్మా!
నిద్ర కన్యలు వచ్చి నిన్ను లేపేరు,
ఆట కన్నెలు వచ్చి ఆడి పొయ్యేరు,
పాట కన్నెలు వచ్చి పాడి పొయ్యేరు,
నిద్రలే గొబ్బెమ్మ, నిద్రలేవమ్మా!'

మరియు వారిట్లు పాడిరి.

'మట్టులు మట్టులు నరికేరూ
మట్టుల మేడలు గట్టేరూ
మట్టి క్రిందా శ్రీ మహాలక్ష్మి నిద్రాతే, నిద్రాతే!'

అట్లే 'రావులు రావులు, చింతలు చింతలు, అరట్లు అరట్లు' నరికి రావుల మేడలు, చింతల మేడలు, అరట్ల మేడలు ఆదిలక్ష్మికి కట్టించి రాత్రులు నిద్రపుచ్చి ఉదయము నిద్రలేపుదురు అది యొక గౌరీ వ్రతము! ఇవి ఇంటింట చూచిన సుబ్బారాయునికి తెలుగుకన్యచేత నూతనవ్రత మొకటి పట్టింపవలెనను ఉబలాటము పొంగినది. కోయిలచేత పాట మొదలు పెట్టించినాడు.

'నిదుర నెలతలు వచ్చిరి నిదుర లేప,
భద్ర కన్యలు దరిసెరి పాటపాడ,
తెలియరాని చక్కిలిగింత వలపు జనుల
మేలుకొలిపెడు పవనుడు బాలు డట్లు.

* * * *

కొమ్మ లాకర్ణోత్తరుచి సరసమ్ము లయ్యె.

* * * *

లేచి రావమ్మ, మాతల్లి లేచిరమ్మ,
పిలువ వచ్చిరి నీతోడి బిడ్డలరుగో!'

కోయిల ఇట్లు ఇరువదిమూడు పాటలతో నిద్రలేపును. తోటలో బంతియాటకు తోడి చెలులు పోవుచున్నారు. వారిలో,

'క్రొత్తగా పెండ్లియైన లేగుబ్బెతలును
నిన్న మొన్న నీడేరిన కన్నియలును
పరికిణీ లింక విడువని బాలికలును
గడుసు నెరజాణలగు ప్రౌఢపడతుకలును.'

కలరు. తోడి బాలికలతో సమానముగా నాడుటకు రమ్మని కన్నె నొకమారు పిలుచును. ఒకమారు తోట లోనికి దూరదేశములనుండి వచ్చి వ్రాలిన పిట్టలను తోలివేయ నుద్బోధించును. ఒకమారు ఉపాయముగా తోటలోని తేనె నొంచుకొని కంచె తీసి త్రోవలు చేయు వంచకులను తెలిసికొని కాపుదనము మాన కుండుమని వేడును. ఒకమారు నాకలో బోవుచు ఇల్లిళ్ళకు పంచిపెట్టు గీతాప్రసాదము గ్రామ కుంకుమము వలె తీసికొమ్మని యర్థించును. 'మాతృపూజా విధాన మేమరవద్దు.' శుభముహూర్తము వచ్చినది, ప్రేమ సామ్రాజ్యపాలనకు రాజరాజేశ్వరి స్తన్యమోహాంధయై సాక్షాత్కరించును. ఆంధ్రబాలా!

'పసుపు కుంకుమ పూవులు కొసరిచల్లి
చిన్ని కర్పూర హారతి చేతబట్టి
ప్రమదలక్ష్మికి నారతి పాటబాడి
సుప్రసన్నల జేయుము స్తోత్రనియతి!'

అని యుపదేశించి 'ఋషులు, తథాస్తు, ఆంధ్ర బాలకు పూర్ణకల్యాణమందురు, నిదుర లేచిరమ్మ!' అని కోకిలపాట ముగిసినది.

ఇదీ 'తెనుగుతోట' లోనివిషయము, పాడి మాటలతో చెప్పినచో!

## 3

గ్రంథమంతయు తేటగీతములో మాలికగా నడచినది. నవ్యాంధ్రకవిత్వమునకు ముందు దారి తీసినది తేటగీతము! దాని మాధుర్యము నామముననే ఉన్నది కాని ముందు గ్రహించినవారు శ్రీ వేంకట పార్వతీశ్వరులు, శ్రీ సుబ్బారావు. వారికి మరల ముందు వనుకలు విచారించుట కిది యదను కాదు. వారికే ఇతరు లెవరైన ముందు దారి చూపిరేమోగూడ నిర్ణయించుట అప్రస్తుతము. తేటగీతము వారు మువ్వుర వల్లనే నవకవులకు ముందుగా అభిమానపాత్రమైనది. అందుకు ప్రౌఢతరముగా పలికినది 'తెనుగుతోట!'

పూర్వకవులు పలువురు కేవల ద్విపదకు కావ్యములు రచించినారు. దానిని ద్విపద యని శ్లేషించి ఇతరపద్యములను చతుష్పాత్తు లని సూచించినారు. కాని సుబ్బారావు తేటగీతి నేమన్నాడు?

'తెగినతంత్రుల మరల బంధింపబోకు
నిలిచియున్న యేకశ్రుతిని సవరించి
వేడుకయు వేదనయు రసవిదులు మరియ
బాడుమమ్మ, గీతాసఖీ, భావపదము!'

పూర్వకవులు తరచుగా అనేక ఛందస్సులలో రచన చేసినారు. తాను ఏకశ్రుతితో పాడునట! శ్రుతి ఎల్లప్పుడు నొకటియే! కాని తెలుగు పాటలు ఏకాంతస్థలములో ఏకతార మ్రోగించుచు శ్రుతిగలిపి నిశీథసమయములలో పాడుచుండ విని దాని మాధుర్యమనుభవించినవారికి గాని 'ఏకశ్రుతిని సవరించుట' బోధపడదు!

మరియు నది గీతము! మరియొక ఛందస్సులో చెప్పిన పద్యమును గీతమని గానమని పల్కుట ఉచితము కాదు. అందుచే కవి కావ్యారంభముననే 'గీతాసఖ్యము' చేసినాడు. విహంగసమితి 'సరభసోత్కట గీతాప్రసాదరవము' నాలకించునట! 'కిన్నెరలు పాడుచున్నవి గీతములను' అనును. నాకలో పంచిపెట్టునది 'సరస కౌతుక గీతాప్రసాద మొకడో' యట!

'మదవదళికుల సంతాన మదయగీతి
పాడుచున్నది కర్ణోత్సవముగ నిపుడు!'

మరియు,

'వీణలందు నసంతకల్యాణగీతి
భువన మూర్ఛాకరమ్ముగ మ్రోయసాగ'
దివ్యసమయము వచ్చినదట!

తెనుగుతోట ఎన్ని విఘ్నములజూచినను నవ్యాంధ్ర జీవనమునకు వైతాళిక కల్యాణగీతి! అట్టి గీతమాలికయే ఆంధ్రవైతాళికులకు అభిమానపాత్రమగు ఛందస్సుగా బహుకాలము నిలుచుట వింతకాదు!

## 4

శ్రీ సుబ్బారావు బాల్యము కౌమారము బాపట్లలో గడిపినాడు. బాపట్ల, చీరాల, వేటపాలెము ప్రాంతములవారికే సోనల అందము తెలియును. అవి ఆకస్మికముగా నొకచోట ఇసుక పడకల జీల్చుకొని పుట్టిం లోతులేని స్వచ్ఛజలముతో ప్రవహించును. వాని ప్రక్కల ఇసుకకట్టలు మాత్రము ఎత్తుగా ఉండును. సోన రెండుప్రక్కలను పచ్చగా పచ్చిక పొదలు తోటలు పెరుగును.

'పీనులకు ముద్దుగొలుపు నవీన మధుర
సుస్వరమ్ములు పాడెడు సోనలు నేడు
మొలక లెత్తెడు ప్రక్కల మోహనముగ
నవతృణాంకుర లోకరత్నాలశయ్య!'

మరియు,

'శుచియయిన దోయిళులబట్టి సోనల నీరు
వదలబోవుచున్నార లావలి మహర్షులు.'

మహర్షులు వదలునదికూడ సోనల నీరేనట!

మరియు నా ప్రాంతములలో మల్లెపందిళ్ళ ప్రోది ఎక్కువ. చీరాలనుండి బస్తాలతో విజయవాడకును, ఆ పైకిని రైళ్ళలో జనము పట్టకుండ మల్లెపూల బస్తాలు రవాణా యగును. ఆ వ్యాపారము కవికి ఎందుకు ఉపయోగించినది? మూడు పంక్తులు చెప్పినాడు!

‘దివ్యమగు మల్లెపూల పందిళ్ల పజ్జ
చీర యొడిబట్టి మొగ్గలు చిదుపు చిన్ని
కన్నియల ముద్దు నొసలపై గాంతు పడెదొ?’

అని లేఖిని నడిగినాడు. మరియు ఏతములతో గొరువులనుండి నీరెత్తుమందు రా వైపుల!

‘ఏతములనుండి గొరువు నీ రెత్తువార
లన్యరతులైరి ప్రాల్మాలి యక్కటకట!’

బాపట్ల చుట్టుప్రక్కలనున్న తోటలే సుబ్బారావుకు గ్రంథనామము స్ఫురింపజేసినది. కాని యది యాయన కవితాత్మచే తెనుగు తోటగా విస్తరించినది. తెలుగుదేశ మంతటను సర్వసామాన్యము మధుర దృశ్యములు చిత్రించి వానికి విశేషార్థము స్ఫురింపజేసినాడు కవి! చూడుడు!

‘కృష్ణవేణీ సరిత్కూల రేఖలందు
ప్రొద్దు తిరుగుడు పువు లభిముఖము లయ్యె!’

మరి యిది వినుడు, స్వాతంత్ర్య పిపాస తెలిసికొనుడు!

‘తల్లి పొదుగానకుండ బందాల బడిన
వత్సములు లాగు లాడెడు పాలకొరకు!’

ఇంకను ఈ దృశ్యము లెవరి కనుభవములో లేవు!

‘బువ్వదుత్త నెత్తినిబెట్టి నవ్వు కనుల
రవిక దొడుగని గొల్ల కుఱ్ఱది యొకర్తు
పోవుచున్నది పొందైన ముద్దునడల!
కలికి యొడిసెల వలెవాటు గాగ దాల్చి
పిరుదు లసియాడ జీరరాపిల్లతోడ
కాపుకూతురు పొలములు కాయ నేగు!
చిన్ని బంగారు పూసల చెండ్లవంటి
జొన్నకంకులు పండిన సొగసు చేల
ఎక్కడెక్కడ నుండియో చక్క వచ్చి
వ్రాలుచున్నవి పిట్టలు రక్తి బెరయ!’

కవి గుంటూరు ప్రాంతములలో చూచినవి ఎట్లు చెప్పినాడు! విదేశీయులు భరతభూమిలో వ్రాలుచున్నారని వాచ్యముగా అనడు!

ఇక మన విద్యార్థుల చదు వెట్టిది?

‘చదివిన పురాణపంక్తులె చదివికొనుచు
స్నాతకుండైన విద్యార్థి చాయ జూడు!

* * *

ఎరుగ డావిద్య డాయను హృదయసరణి.’

కవికి కవిత్వముకంటె అభిమానపాత్రమైన దేమున్నది? ఆ గీతి నిట్లు ప్రారంభించినాడు.

‘దధిమథన మోహన ధ్వనుల్ మృదురముగను
శ్రవణముల కుత్సవము చేయు సమయమయ్యె.’

అది అమృతమథనము! అందుచే జ్ఞాపకము చేయుచున్నాడు!

‘ముసుగువంబడి యున్నది మోహవీణ
చిరనిరాదరణాహతి చెడియె నేమొ!
తలచి దరిడాసి స్పృశియించి లలిత లలిత
సుప్రగతి స్వీయ సామ్రాజ్యశోభ నింతి
శ్రోత్రిలకు రుచిమాపించి హత్తవమ్మ!

* * *

పాడితివి కొన్ని నాళులు భవ్యముగను
లోకమోహనమైన సుశ్లోకసరణి
రాగరస బంధురంబైన రమ్యగీతి.

* * *

మరచిపోయితె నీవీణ సిరుల మురువు?
మేళవింపంగ దరియయ్యె మెలపులోలనా!’

ప్రేమ సామ్రాజ్యమునకు మనలను నావపై లయానుకూలముగా తీసికొనిపోయి పవిత్ర తేజోబింబమును దర్శింపజేయు లలిత మధురమైన తెలుగు గీతి, సుబ్బారాయని ‘తెనుగుతోట’!

# బడుగు రైతు

శ్రీ బొడ్డు బాపిరాజు

కడలిరాయని యింట సుడిగుండ మొరయనో?
గగనదేవత గుండె కరగిపోదో?
దనుజారి రథశాల తలుపులు తెరవరో?
మొయిలు మందలు వట్టిపోయెనేమొ?
శ్రావణాప్తుని కటాక్షము చెమ్మగిల్లదో?
వరుణ రాచరికమ్ము వారు వినరో?
ఋతుపవనాశ్వముల్ మతిదప్పి సాగెనో?
మెరపు కన్నెలు నోము చెరచుకొనిరో?
నిరుడు నిప్పచ్చరము చేసి నిప్పువెట్టె
కార్తికములు పండెడు దేవమాతృకలకు
వెనుకబట్టిన వానలు!—పనవి పనవి
నీరు గారెను మా సన్నకారు రయితు!

చిలిపి తొలకరి నాల్గు చినుకులు చిలికింప
మునుముందె విత్తనమ్ములను జల్లి,
ముసలి మిన్నుల తలమొసలు నల్లనిమబ్బు
రేకలై ముప్పొద్దు ప్రాకులాడి,
అదను కందించెడి ముదురాకుమడిమొల్ల
పురుగునాకిన డిల్లపోయి చూచి,
చెరువులు నిండక అరలు పాతికలైన
వంతున కగచాట్లు పడుచు నూడ్చి,
అడలు నీ యేడు, నిరుడైన యప్పు తీర్చు
వెరవు గనరాక, ముందటి తెరువులేక
బిక్కచెడి వెచ్చనూర్చు మా బక్కరైతు
గుండె చెరువైన, చెరువది నిండదయ్యె!



# నన్నయ చిత్రించిన రాజరాజు

శ్రీ నండూరి బంగారయ్య

ఇదిగో! రాజరాజు కొలువుకూటము. వసుమతీ వనితకు విభూషణము వేంగిదేశము. వేంగీదేశమునకు నాయకరత్నము రాజమహేంద్రము. రాజమహేంద్రమున నొక రమ్య ధర్మ్య హర్మ్యతలము. దానిని సకలభువన లక్ష్మీవిలాసం బని పేర్కొన దగును. అందు బరమానందమున మహేంద్ర మహిమతో కొలువుదీర్చి యున్నాడు చళుక్య మన్మథుడయిన రాజరాజు. మంత్రిపురోహిత సేనాపతి దండనాయక దౌవారిక మహాప్రధానులు ప్రక్కనే యుచితాసనముల నలంకరించినారు. వారికి తరువాత ననంతమయిన సామంతగణము. ఇందుక తొలగి రాజాజ్ఞకయి ఎదురుచూచుచు నిలుచున్న వారవిలాసినులు. ఇక విద్వాంసులు క్రిక్కిరిసిపోయి యున్నారు. ఏలన నది రాజకార్య నిర్వహణమున కేర్పడిన సభ కాదు. విద్యావిలాసగోష్ఠి. అపారశబ్ద శాస్త్రపారగు లయిన నైయాకరణులు! భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులయిన పౌరాణికులు! మృదు మధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదులయిన మహాకవులు! వివిధతర్క విగాహిత సమస్త శాస్త్ర సాగర పారగరీయః ప్రతిభులయిన తార్కికులు! వైణిక గాయకాది విద్వజ్జనంబులు! ఈ విద్వద్గణమున సూర్య చంద్రులవలె — నన్నయభట్టు! నారాయణభట్టు!

సంజీవకరణి నొక్కదానిని దెచ్చుటకు మారుగ పర్వతమునంతను బెకలించుకొని వచ్చిన మారుతివలె నన్నయ రాజరాజు నొక్కనినేగాక ఆనాటి రాజమహేంద్రవర సాహిత్యజీవితమునంతను భారత ముఖమున బ్రత్యక్షపరచినాడు. ఇదిగాక అతని భారత భాగములలో ప్రత్యాశ్వాసమున నాద్యంతములలోను, నన్నయయే రచించిన నందమపూండి శాసనము మున్నగు శాసనములలోను రాజరాజు పదేపదే ప్రత్యక్షమగుచున్నాడు. ఇట్టి వర్ణనములలో పునరుక్తు లనివార్యములుగదా! ఇవిగాక అత్యుక్తులుగూడ పుష్కలముగ గనవచ్చుచున్నవి. ఏ కవిగాని తన్ను పోషించు ప్రభువునుగూర్చి అత్యుక్తి వాడకుండ నుండగలడా? అయినను నిత్యసత్య వచనుడగు నన్నయ కూడ ఒక మానవమాత్రుని "విష్ణుమూర్తి" యనియు 'నారాయణమూర్తి' యనియు సంబోధింపవలసిన దేనా? ఇందులకు 'నా విష్ణుః పృథివీపతిః' యను నమ్మకమొక్కటేగాక ఆనాటి పరిస్థితులును 'బహవో దుర్లభాశ్చైవ' యను సూక్తికి లక్ష్యము కాదగిన రాజరాజు గుణగణమును గూడ కారణమై యుండవలెను. ఈనాటి మనము ఆనాటి పరిస్థితులను పూర్ణముగ నర్థము చేసికొనుట దుష్కరము. [illegible]నుండి దేశము నుద్ధరించుటకయి కంకణము గట్టుకొనిన మహాపురుషుని అవతారమూర్తిగ సంబోధించుటలో నాశ్చర్యమేమున్నది? ఈనాడు గాంధిని మహాపురుషోత్తమునిగ నెంచి పూజించుటలేదా? కేవలము తన్ను పోషించు ప్రభువుపట్ల చూపవలసిన కృతజ్ఞత మాత్రమే గాక ఆర్షధర్మములు సమూలముగ నశించి పోవునేమో యని సనాతన ధర్మప్రియులు గడగడలాడుచున్న యా కాలమున జైన బౌద్ధమతముల వారిని బడకుండ వైదికమతము నుద్ధరించుటకయి యుదయించిన కారణజన్మునివలె గనవచ్చిన రాజరాజు మహోజ్జ్వలశీలముపట్లనున్న గౌరవముకూడ సంబంధముండి నన్నయ వర్ణనములలో నత్యుక్తిని బ్రవేశపెట్టియుండ వచ్చును.

ఈ అత్యుక్తులను పునరుక్తులను పూర్ణముగ పరిహరించి చూచినను స్ఫుటమయిన విగ్రహము మనకు లభ్యమగుచున్నది. నన్నయవర్ణనలలోనున్న చైతన్య సంపద అద్భుతావహము. రాజరాజు పవిత్ర శీలమునకు శాశ్వతమైన మందిరము నిర్మింపవలెనని అతని సంకల్పము. ఈ సంకల్పము పూర్ణముగ కృతార్థమయినది. కృతిపతుల గుణగణమును వర్ణించిన కవులెందరో యున్నారు కాని నన్నయ లేఖిని సాధించిన వాక్సిద్ధి అనన్యసాధ్య మనియే చెప్పవలసియున్నది. అతని సమాస కల్పనములోనున్న [illegible]. మాధుర్యము నపురూపములు. ప్రతి సంబోధకమునను సంబోధితుని బ్రత్యక్షపరుపగల శక్తి చదువరిని చకితుని చేయజాలియున్నది.

స్థూలమునుండి సూక్ష్మమునకు బోవుట యొక క్రమముగ నేర్పరచుకొన్నచో నన్నయ చిత్రణమున

రాజరాజు శరీర సౌష్ఠవము మొదట విచారణకు వచ్చుచున్నది. ఆకార పరిమాణముగాని దేహచ్ఛాయ గాని అవయవముల ప్రత్యేకలక్షణములు గాని నిర్ణయించుకొనుటకు తగిన సామగ్రి నన్నయవర్ణనలలో లభ్యము కాకపోయినను మొత్తముమీద రాజరాజు సుందర విగ్రహుడై యుండవలెననుట నిశ్చయము. కేవలము కుయూపిని దీసికొనిపోయి "రాజమనోహరుడు" "చళుక్య మన్మథుడు" అను నిట్టి విశేషణములకు గురిచేసినచో నవి యపహాస్యమునకు తావలము లగును. రాజునకు కోపకారణములగును గాని ప్రసాదభాజనము లెన్నడును కాజాలవు గదా! రాజరాజు శరీరమున రూపసంపద మాత్రమే గాక లావణ్యసంపద కూడ అమరియుండె ననుటకు "తుహినకరుడురు కాంతిన్" అను నిట్టి వర్ణనము లాధారములు.

పరాక్రమము, దయ, వితరణము నను మూడు గుణములును రాజరాజుశీలము నలంకరించుచుండె ననుట స్పష్టము. దయయున్నచోట వితరణముండుట యాశ్చర్యజనకము గానేరదు గాని పరాక్రమము దయయు నొక్కచోట నుండుట అరుదు. 'అన్యరాజ తేజోజయశాలి' 'అపరాజిత భూరి భుజాకృపాణ ధారాజల శాంత శాత్రవ పరాగుడు' ఇత్యాది విశేషణములును "కోదండపార్థ!" "విక్రమాదిత్య!" "మృగరాజ పరాక్రమ!" ఇత్యాది సంబోధనములును పరాక్రమమును వర్ణించుచు గానవచ్చుచున్నవి. దేశ మల్లకల్లోలముగ నున్న యా కాలమున ప్రభువులు పరిపాలనాదక్షులయి యుండిన జాలదు. పరాక్రమవంతులుకూడ నయియుండవలెను. కాని పరాక్రమవంతులు సాధారణముగ క్రూరులయి యుందురు. రాజరాజట్లుగాక 'దయార్ద్రబుద్ధి' యట. అందుచేతనే యాతని పాలనము 'జగజ్జనానురంజనముగ' నుండెడిది. "ఆశ్రితపోషణము" అతనికి నైజవిలాసము. ఈ యాశ్రితులలో బాంధవులు మిత్రులు విద్వాంసులు ముఖ్యులు. "బాంధవాంభోజమణి" "మిత్ర విద్వదంభోజ వన పయోజ మిత్ర" ఇత్యాది సంబోధనము లీ యంశమును స్థాపించుచున్నవి. దానమనునది అతని కొక వినోదము. అతని దానశాసనములు అనేకములు ఇప్పటికిని గనవచ్చుచున్నవి. కోరుమిల్లి శాసనము, కలిదిండి శాసనము, నందమపూండి శాసనము నంజెశాసనము మున్నగువాని నుదాహరింపవచ్చును. ఇవిగాక కాలగర్భమున లీనమైపోయిన వెన్నో యెవరు చెప్పగలరు? దానములలో పెక్కులు కవులకు విద్వాంసులకు చేసినవే. ఇవి వ్యక్తులకు చేసిన దానములుగ నెంచుటకు వీలు లేదు. ఆనాటి విద్వాంసులు వేనకువేల విద్యార్థుల కాశ్రయ మొసంగి వేదాదివిద్యలను వారి కుచితముగ బోధించుటయే గాక వారి కన్నపానాది సౌకర్యములనుగూడ ఉచితముగ నేర్పరచెడినారు. రాజరాజు కోరుమిల్లి శాసనము పరిశీలించినచో ఈ యంశము స్పష్టమగును. చీదమార్యుడను మహావిద్వాంసునకు కోరుమిల్లి దానము చేయుచు జన్మప్రభృతిగ గీతవేదార్థ తత్త్వవేత్తయగు నా మహామహుని పాండిత్యమును మాత్రమే గాక ఇతరపండితులకు ఛాత్రులకు కల్పద్రుమముగ నుండిన యాతని ప్రవదనౌదార్యమునుగూడ రాజరా జుగ్గడించినాడు. అందుచే నా కాలమున నొక్కొక్క విద్వాంసు డొక్కొక్క విద్యాపీఠము (యూనివర్సిటీ) గ నెన్నదగి యున్నాడు. రాజరాజు పండితప్రకాండుడనుట కూ: నన్నయ రచనల బ్రస్ఫుటమగుచున్నది.

విమలమతిన్ బురాణములు
  వింటి ననేకము లర్థశర్మశా
స్త్రముల తెఱంగెఱింగితి
  నుదాత్తరసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కుసూచితి
  జగత్పరిపూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితి
  బ్రకాశముగా హృదయంబు భక్తితోన్.

ఈ పద్యమే గాక 'వివిధాగమ విహితశ్రముడు' 'నిఖిలరాజ విద్యానిధి' ఇత్యాది విశేషణములున్నవి. కావ్యనాటకములనుగూర్చి చెప్పునప్పుడు అవియుదాత్తరసాన్వితములుగా నున్నప్పు డతనికి రుచించు ననుట అతని సహృదయత యెంత నిశితమైనదో వెల్లడించుచున్నది. ఇదిగాక 'మనీషి విద్యాశ్రమ తత్త్వవేత్త' యని నన్నయ వేరొకచో వాడిన విశేషణమును బరిశీలించినచో రాజరాజు పాండిత్య మెంత గంభీరమైనదో సువ్యక్తమగును. మహాపండితులు చేసిన విద్యాశ్రమమునందలి తత్త్వమును మథించుటకు మంధరనగము గావలెనన్న రాజరాజు పాండిత్య మెంత కూలంకషమయినది గావలయును?

తక్కిన గ్రంథములపైనున్న గౌరవమంతయు నొకయెత్తు. ప్రత్యేకము భారతముపై రాజరాజున కున్న భక్తి ఒకయెత్తు. 'భారతశ్రవణాసక్తి' నాతని

శీలములో నొక విశిష్టలక్షణముగ నన్నయ నిరూపించుచున్నాడు.

ఇవియే నాకు సతతంబు నారయఁగ
     గరం బిష్టంబులై యుండు బా
యవు భూదేవకులాభి తర్పణ
     మహీయః ప్రీతియున్ భారత
శ్రవణాసక్తియు పార్వతీపతి
     పదాబ్జధ్యాన పూజామహో
త్సవమున్ సంతత దానశీలతయు
     శశ్వత్సాను సాంగత్యమున్.

ఈ యాసక్తికి పెక్కు కారణములను నన్నయ పేర్కొన్నాడు. కేవల కథాశ్రవణ కుతూహల మొకటి. తన వంశకర్తల చరిత్ర మను నభిమానము రెండు. గోశతదాన ఫలప్రదమను నాముష్మిక చింత మూడు. కాని, అన్నిటికంటెను ప్రధానమయినది భారత పరమార్థము ననుసంధింపవలెనను కుతూహల మతిసాంద్రముగ నుండుటయే. పండిత చక్రవర్తుల ముఖమున మూలము నాత డెన్ని పర్యాయములు వినియుండునో! ఎంత గాఢమయిన కృషి లేకున్న 'భారతబద్ధ నిరూపితార్థ మేర్పడ' తెనుగు గావింపుమని నన్నయ మహాకవి కాతడు సూచింపగలడు ?

తెనుగున నన్నయ రచించిన భారత భాగము నందలి ప్రాశస్త్యమునకు నన్నయ నారాయణభట్టుల కవితా వైభవము మాత్రమే గాక రాజరాజు రసజ్ఞత కూడ మూలకారణము. భారతమునందు పరమాసక్తి యున్న రాజరాజు ఎప్పటికప్పుడు నన్నయ రచించిన భాగములను వినుచు దానిపయి తన విమర్శనము ప్రకటించుచుండునే గాని యూరకుండడు గదా! భారత శ్రవణాశక్తిని రాజరాజు శీలసంపదలో నొక విశిష్టలక్షణముగ పేర్కొనుటలోని రహస్యమును గొంత విపులీకరింపవలసియున్నది. "రాజరాజు నంతటి వివేకచూడామణిని మెప్పించగలనా ? లేదా" యనిన సంశయము నన్నయను బాధించెననుట భారతావతారికలోనే వ్యక్తమగుచున్నది.

అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేష సారము మదంబున గొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గమార్థజల గౌరవభారత భారతీ సము
ద్రము దరియంగ నీదను విధాతృనకైనను నేర బోలునే ?

అను నన్నయ సమాధానములో వినయము మాత్రమే గాక వివేకము కూడ నిబిడముగ నున్నది. భారతవర్షమునందలి విజ్ఞానరాసులకెల్ల భారతము ఖజానా. యుగయుగములుగ నుపనిషన్మంత్ర ద్రష్టలార్జించిన వేదాంత సత్యములును అధ్యాత్మ విద్యలను రాజర్షులు సేకరించిన లోకానుభవమును అర్థ ధర్మ నీతిశాస్త్రముల సారమును కవి వృషభులు ప్రదర్శించిన అద్భుతావహమైన కళా వైదగ్ధ్యమును మా భారతమున నేకీభవించి కొలువు దీర్చినవి. ఇంతటి ప్రజాహిత నిర్మాణము ప్రపంచముననే యితర వాఙ్మయమునం దయిన దుర్లభమేమో యని సంశయింపదగిన అద్వితీయ గ్రంథరాజ మది. ప్రజాబాహుళ్యమును దృష్టిలో నుంచుకొని చూచినచో వేదములకంటెను భారతీయ వాఙ్మయమున భారతమే ప్రాముఖ్యమును బడయదగియున్నది. అట్టి మహావాఙ్మయమునందున్న పరమాసక్తి రాజరాజు రసజ్ఞతా పరిణతికిని వివేచనా గాంభీర్యమునకును నిదర్శనము గాదగియున్నదే గాని రుచిభేదమువలన నుదయించు పక్షపాతమును నిరూపించుట లేదు. అంతటి భావుకుడు భారత రచనమునకు మార్గదర్శకుడుగ నుండుట ఆంధ్రులు చేసికొన్న సుకృతఫలితము!

భారతాసక్తితోబాటు మరి నాలుగు గుణములు రాజరాజునకు నిత్యసహచరములు : (1) విప్రభక్తి (2) సంతత దానశీలత (3) సాధు సాంగత్యము (4) పార్వతీపతి పదాబ్జధ్యాన పూజామహోత్సవము. ఇందు విప్రభక్తిని గూర్చి శివభక్తిని గూర్చి కొంత వివరీకరింపవలసియున్నది. ఈనాటి యాశయములనుబట్టి ఆనాటి యాశయములను విమర్శించుట యసంగతము. ఈనాడు ఎవ్వరును "నేను బ్రాహ్మణ భక్తుడను" అని యొక విశేషముగ జెప్పుకొనువారై యుండరు. ఉండినను ఇతరులు దాని నొక ఘనతగ భావింపరు. వర్ణాశ్రమ ధర్మమునకు ప్రాబల్యమున్న ఆకాలమున నదియొక గొప్పగ నుండెడిది. బహుశః ఆనాటి విప్రులలో పెక్కండ్రు అవిరళ జప హోమ తత్పరులును నిత్య సత్య వచనులును త్యాగశీలురును అయియుండిరేమో! ఉద్యోగ స్వీకరణమునకు పూర్వము కాంగ్రెసునాయకులలో పెక్కండ్రు త్యాగశీలురయి దేశమునకు ఖ్యాతిని సంపాదింపలేదా? అట్టి వెనుకటి త్యాగమునుబట్టి ఇప్పటికిని ప్రజలు వారిని గౌరవించుచుండుట లేదా. ఇట్లే ఆనాటి రాజరాజు బ్రాహ్మణభక్తిని కూడ సమర్థింపవచ్చునేమో! "భీమేశ్వర కృతి కృత్యప్రసాద" అను సంబోధనమును జూచినచో అతని యిష్టదైవము శివుడనుటతో నాగక భీమేశ్వరుడని

కూడ ప్రత్యేకముగ నిరూపితముగుచున్నది. అప్పు డాంధ్రదేశమున రెండు మూడు స్థలములలో భీమేశ్వ రాలయము లున్నవి. అన్నిటికంటెను ప్రాముఖ్యము వహించి చిరకాలము ప్రసిద్ధిగన్నది దాక్షారామ భీమేశ్వరుడు. ఈ దాక్షారామమునందలి భీమేశ్వ రుడు గాని ప్రకృతము సామర్లకోటకు సమీపము నందలి భీమేశ్వరస్వామి గాని ఆతని యిష్టదైవమై యుండవలెను. భీమేశ్వరమునుగూర్చి అమూలకముగ నన్నయ భారతకథలో గూడ ప్రసక్తి తెచ్చినాడు. అర్జునుని తీర్థయాత్రలను వర్ణించుచు

"దక్షిణ గంగనా దనరియు నొప్పిన గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగుచున్న శ్రీపర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై ధరణీ సురోత్తమా ధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేంగీదేశ విభవంబు జూచుచు"

అని అర్జునుని నాటికున్నను లేకున్నను శ్వరమునకును వేగీ దేశమునకును మూలకథతో నవినా భావ సంబంధము గల్పించి తన దేశాభిమానమును ప్రకటించుకొన్నాడు. ఇందు శ్రీపర్వతముతో భీమే శ్వరుని జోడించుటచే సుప్రసిద్ధ త్రిలింగ క్షేత్రము లలో నొక్కటగు దాక్షారామమునందలి భీమేశ్వ రుడే రాజరాజు నిష్టదైవమని నిర్ధారణ చేయుట— దీనికి విరుద్ధముగ ప్రబలాధారములు లేనంతవరకు— సాహసము గా నేరదు.

పైని పేర్కొన్న మహాగుణములేగాక మరి కొన్ని సూక్ష్మగుణములు కూడ నన్నయ చిత్రణమున బ్రత్యక్షముగుచున్నవి. 'అభిమాన మహార్ణవ' అని యొకచో సంబోధనమున్నది. దీనినిబట్టి రాజరాజు హృదయము మిక్కిలి కోమలమయినదని చెప్ప వచ్చును. అయితే ఈ యభిమానము కొందరు ప్రజా పాలకులలోవలె దురభిమానముగ ప్రకోపించి చీటికి మాటికి కోపము తెచ్చుకొను స్వభావముగలదై యుండఁడు. అట్లయినచో నాతనిని 'సంతతక్షమా భరణు' డనుటకు వీలులేదుకదా. పైగ 'నిరంతరా నందనుతి' యను సంబోధన యొకటి మరియొకచో గనవచ్చుచున్నది. ఎప్పుడును సుప్రసన్న మనస్కు (*Cheerful mind*) డనుట నీ సంబోధనమున కర్థముగ జెప్పుకొనవచ్చును. చీటికి మాటికి గోపము వచ్చువారికి నిరంతరానంద మనస్కత యసాధ్యము గదా. ఇంక మన 'అనంత విలాస' మను గుణ మొకటి విచార్యము. ఈ విలాసమున కిప్పటి భాష లో 'దర్జా' యని అర్థము చెప్పుకొనవచ్చునేమో. రాజు లకు కొంత భోగము కూడ వలయునుగదా. ధరించు దుస్తులయందు, భవనాలంకరణమందు, మాట్లాడు ఫక్కి యందు, వితరణమునందు ఒక విధమయిన (*grace*) సరసత ప్రత్యక్షముగుటచే దాని ననంత విలాసముగ నన్నయ వర్ణించియుండవచ్చును.

నన్నయ భారతమునందు శాసనములందు కూడ రాజరాజు పవిత్రతను పదేపదే ప్రశంసించుచును. 'వ్యసన వివర్జిత' అని సంబోధించుటచే నైశ్వర్యవంతులకు సాధారణముగ సహజములగు స్త్రీ ద్యూతములు పరి హృతములని యూహింపవచ్చును.

ఘన దురితానుబంధ కలికాలజ దోషతుషార సంహతిన్
దన యుదయ ప్రభావమున దవ్వగజేసె...

అని భారతమునందు మాత్రమే గాక

సంరక్షతి క్షితితలం కుపితారివర్గో
మార్గేణ యత్ర నయశాలిని చూనవేన
ప్రీతాః ప్రజా నిజపవిత్ర చరిత్రతోయైః
ప్రక్షాలయంతి కలికాల కలంక పంకం.

అని నందమపూండి శాసనములో గూడ రాజ రాజు పవిత్రత ప్రాముఖ్యమును బడయుచున్నది. 'ఆదిరాజ విభు' డని 'మనుమార్గు' డని మాటిమాటికి గీర్తించుట చూడగ "ఎంత గాఢముగ హృదయమున కెక్కకున్న నన్నయ పవిత్రతియను నీ సమష్టి భావ మున కింత నిరతిశయ ప్రాధాన్య మిచ్చియుండును?" అను ప్రశ్నయు రాకమానదు.

రాజరాజును నన్నయయును అన్యోన్యాశ్ర యులు. రాజరాజు పోషణము ప్రేరణము లేకున్న నన్నయ భారతమే లేదు. భారతమే లేకున్న నానాటి 'ఎందరో మహానుభావుల'వలె నన్నయకూడ కాల గర్భమున జీర్ణించిపోయియుండును. ఇక తన పవిత్ర వాణిచే నన్నయ రాజరాజునకు నిర్మించిన యశోభ వనము అజరామరమయినది. రాజరాజు కట్టుకొన్న రమ్యభర్మహర్మ్యము లన్నియు ఊరును పేరును లేకుండ ఏనాడో శిథిలమయిపోయినవి. కాని మహా కవి నిర్మించిన యీ మందిరము మాత్రము నేటికిని రాజరాజును మనకన్నుల కరవుదీరునట్లు ప్రత్యక్షు పరచుచు నిత్యనూతన శోభతో జోహారు లందుకొను చున్నది!

# ఏల నే

శ్రీ పురిపండా అప్పలస్వామి

సఖీ
చరణాలాకు సోకి
ఈ గరిక పూలు
ఎరగులాబులై పరిమళించినవి చూడు !
నువ్వు నడిచిన ఈ లేత దారు లందు
గరిక పూవైన ఏల కానైతి నేను !!

సఖీ
నఖస్పర్శ
ఈ ధూళి కణము లన్ని
పాలవెల్లి తారకలయి మెరసె చూడు !
నువ్వునడిచిన ఈ వెల్గు దారులందు
ధూళికణమైన ఏల కానైతి నేను !!

సఖీ
పద సువర్ణ నూపుర స్వనము నేర్చి
పిల్లగాలులు మురళి పాడినవి చూడు !
నువ్వు నడిచిన ఈ పూత పథములంటి
చిరుపవనమైన ఏల కానైతి నేను !!



# భావనా వ్యాపారము

శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

సంచారి భావములు, భావన యనునవి రసచర్వణలో ప్రధానములైనవి. భావనా సమున్మిషితమైన సంచారి భావము లిచట కన్పించుచున్నవి. లౌకిక సంచారిభావము (*Emotion*)నకు రస విషయకమగు సంచారి భావమునకు భేదమున్నదా? లేదా? అను ప్రశ్నను వివేచించినతర్వాత భావనా వ్యాపారమును విచారింప వీలగును.

రసమున గల భావోద్దీపనము కేవలము అనుభావాత్మకమని జేమ్సు అన్నాడు. అనేక అనుభావముల (*Sensations*) కలయికవలన ఒక విషయము సుందరమని యనగల్గుచున్నామట! కాని, మనకు భావోద్దీపన కల్గినపుడు సంచారి భావజన్యములుగా వచ్చునవి అనుభావములని వెనుక భారతిలో వివరించితిమి. సంచార్యుద్దీపనము బాహ్య జగన్నిష్ఠమగు ప్రమేయమువలన వచ్చుచున్నది. ఈ ఉద్దీపనమున స్థాయిభావము (*Instinct*) ప్రవృత్తమగుచున్నది. పైగా ప్రమేయములగు కావ్యాదులను అనుభావములతో తుల్యముగా గ్రహించుట ప్రామాదికము. కావ్యానుభూతిలోని సంవేదనయొక్క స్వరూప స్వభావములను అభివ్యక్తపరుపజాలినది అనుభావమని విస్మరించరాదు.

కాని “ఒక చిత్రము నవలోకించునపుడుగాని, పద్యమును చదువునపుడుగాని, సంగీతము నాలకించునపుడుగాని, మనకు కలుగు అనుభూతి వస్త్రధారణలో మనకున్న అనుభూతికంటెగాని, రంగస్థలమునకు పోవునపుడున్న అనుభూతికంటెగాని, విలక్షణమైనది కాజాలదు.” అని రిచర్డ్సు వాదము. కలమును నడపు ప్రవృత్తులకు, పొగ త్రాగుచు వ్రాయుచున్నపుడున్న ప్రవృత్తులకు అవంతైనను భేదములేదట! ఇట్టిచో లౌకిక ప్రవృత్తులకు, కావ్యజగములోని ప్రవృత్తులకు భేదము లేదనవలెను. ఈ వాదమున రసమను అలౌకిక విషయము లేదని కావ్యజగమున లోకోత్తరాహ్లాదము లేదని, లౌకికజగములోని ఒక భాగమే కావ్యజగమని చెప్పబడును.

సంచారిభావ మెుకానొక ప్రమేయము (*Object*) వలన ఉద్దీపితమగుచున్నది. ఈ ప్రమేయము ఒక వ్యక్తి, వస్తువు, లేక భావము కావచ్చును. ఒక భావమువలన కలుగు సంచార్యుద్దీపనము భావనా వ్యాపారముచే అనుప్రాణితమైనది. కావ్యజగమున గల సంచారి భావోద్దీపనము భావనావశముననే నిర్వర్తితము కాగలదు. వివిధ విషయములకు సమన్వయము కూర్పజాలిన అనువృత్త ప్రత్యయనిష్ఠమగు సంచారి భావమే కావ్యజగమున అతితీవ్రముగా ఉద్దీపితమగుచున్నది. అసమన్వితవిషయములతో అసంతృప్తమగునదే యనువృత్తప్రత్యయమగు భావన.

ఏదేని ఒక కావ్యము నవలోకించునపుడు అందలి భావములను, సన్నివేశములను, మన మనస్సులలో చిత్రించుకొనుచు భావించుచున్నాము. ఈ చిత్రీకరణ యనబడు భావన కావ్యానుభూతిలో నతి ముఖ్యమైనది. సంచారిభావములు, అనుభావములు అన్యోన్య సంబంధముకల్గి, ఈ భావనలో సమన్వితము లగుటచే ప్రధానమగుభావ మెుక్కటే విశిష్టముగా భాసించుటచే భావనావ్యాపారమున ఆనందమే గాక, జ్ఞానము కూడ గలదని స్పష్టము. భావనా వ్యాపారవశమున అవగాహన చేసికొనబడిన విషయముద్వారా ఉత్పన్నములగు సంచార్యాదులు భావనయొక్క ఫలితములు. ఈ ఫలితములనుమాత్రమే గ్రహించు రిచర్డ్సు వాదములో భావనావశమున గ్రహించబడు ప్రమేయమునకు తావులేదు. ప్రమేయము పరిత్యక్తమైనచో లౌకికానుభూతిగాని, అలౌకిక చర్వణగాని ఉండజాలవు గనుక రిచర్డ్సు వాదములో కావ్యప్రసక్తియే కన్పించరాదు.

భిన్నభిన్న విషయములకు సన్నిహిత సంబంధము కలదని, ఈ సంవలనముద్వారా విషయము లర్థవంతములగుచున్నవని, గ్రహించు మనోవ్యాపార విశేషమును భావన యందుము. బుద్ధీంద్రియముల ద్వారా కలుగు జ్ఞానముకంటె విలక్షణముగా భావనావశమున సిద్ధమగు జ్ఞానముకూడ గలదు. భౌతికాభ్యా

త్మిక జగములకీ భావనావశమున సమన్వయమును సుదర్శించిన కాంట్ పాశ్చాత్యదేశములలో భావనా వ్యాపారమును వివేచింప ప్రారంభించినాడు. రస చర్వణను నిర్వచింప యత్నించిన భట్టనాయకుడు భావనావిచారమును గావించినవారిలో ప్రప్రథముడు.

భావనావ్యాపారమున్మిషితమైనపుడు సామాన్య ప్రత్యక్షమున కన్పించని విషయములు ప్రతీతము లగుచున్నవి. ఇవి కవిచే సృష్టింపబడినవా? అను సందేహమును కలుగజేయునవి. భావనావశమున వచ్చునది అనధిగతార్థ జ్ఞానము. పరిచితమైన బాహ్య జగములో చిక్కుకొని యున్నంతవరకు, స్వార్థప్రవృత్తులను వీడనంతవరకు, ఈ అనధిగతార్థజ్ఞానము కలుగదు. భావనచే ప్రబుద్ధమైన ఈ జ్ఞానము లలితవిజ్ఞానముగా భాసించునప్పుడు కావ్యజగము సిద్ధమగును. జ్ఞేయాజ్ఞేయ జగములను పరామర్శించు భావనావ్యాపారము దేశకాలముల కతీతమై వర్తించుచు, తత్త్వమున అంతర్లీనముగానున్న పురుషార్థముల (*Values*) నభివ్యక్తపరుపగల్గి యున్నది. ఈ ప్రవృత్తి నిదిధ్యాసనాత్మకమగుటచే విశ్వమనన్యముగా, ఏకముగా భాసించును. ఈ ప్రతిభానమును విశ్లేషించుచో భిన్న విషయములు, వాటిలో గన్పించు అన్యోన్య సంబంధములు తెలియబడగలవు. జగమున కన్పించు నానాత్వము భావనావశమున తత్త్వాభివ్యంజకముగా, అద్వితీయముగా ప్రతీత మగుచున్నదని భావము. విషయ విశ్లేషణలో బుద్ధి, విషయసంవలనమున భావన గలవు. విషయసంవలనమును గ్రహించువేళ విషయముల ఉపయోగములను భావన గ్రహించదు. అనుభూతిలోనికి ఏ రీతిగా విషయములు వచ్చుచున్నవో, ఆ రీతిగా విషయములను అవలోకించుటయే భావనా వ్యాపారమున గమనింపవలసిన విషయము.

అనుభూతిలో ప్రతి విషయము స్వతఃసిద్ధముగను అన్యాపేక్షరహితముగను భాసించునని యెంచరాదు. ప్రతి వస్తువు అన్య వస్తువులతో సంబద్ధమై యున్నది. సమగ్రము, స్వయంగ్రాహ్యము, స్వయంపోషకము, స్వతఃసిద్ధమునగు తత్త్వమునగల ప్రతివస్తువునందు తత్త్వము అనువృత్తి ప్రత్యయముగా గలదని తెలియనంతవరకు విషయమును సమగ్రముగా నిర్వచించలేము. కాని అనుభూతిలోనే మనకీ జ్ఞానమున్నది. అధ్యవసాయాత్మకమగు బుద్ధి ఈ జ్ఞానమును మనకు వివరించజాలకపోవుటచే కేవల తార్కిక దర్శనములు తృప్తికరము లగుటలేదు. కాని భావనా వశమున సమున్మిషితమగు అనుభూతిలో విషయముల నిజస్వరూపము సంవేద్యమగుచున్నది. భౌతికాధ్యాత్మిక జగములు రెండు భిన్న జగములు కావని, భౌతిక జగమున అనువృత్తముగా నొక ప్రత్యయము గలదని, అధ్యాత్మిక జగమే వాస్తవికమని భావనా వశమున తెలియబడుచున్నది. లౌకికాలౌకిక జగముల సమన్వయమును నాశ్రయించుకొను మానవ ప్రవృత్తి యుండుటచే, భావనాగ్రాహ్యమగు ఈ సమన్వయమును పరిత్యజించ వీలులేదు. ఈ సమన్వయము లౌకిక జగమున పరిచితమైనది కాకపోవుటచే, భావనావశమున కావ్యరూపమునందున్న సమన్వయ మొక సృష్టివలె కన్పించును. అందుచే కవిని ప్రజాపతి సదృశుడనినారు. పరిదృశ్యమానమగు నానాత్వమున కావ్యభావన ఏకత్వమునే గ్రహించుచున్నది. సంవేదనములు, అనుభావములు మొదలగునవన్నియు జ్ఞానానువృత్తములై, జ్ఞానసముద్భూతములై, జ్ఞానమున పర్యవసితములై ఈ ఏకత్వమున ప్రతీతము లగుచున్నవి.

విషయము లింద్రియ గ్రాహ్యములు, బుద్ధి గ్రాహ్యములునై యున్నవి. ఇంద్రియ గ్రాహ్యత్వమున అనుభావములు గలవు. అనుభావము లర్థవంతము లగుటచే జ్ఞానాభివ్యంజకములని చెప్పబడుచున్నవి. విషయపరామర్శ సామాన్యమగు జ్ఞానము స్వప్నతురగాది జ్ఞానమువంటిదగుటచే జ్ఞానమునకూడ ఇంద్రియ గ్రాహ్యమగు విషయము కలదనవలెను. ఇంద్రియ గ్రాహ్యత్వమున జ్ఞానము భావముగాను, జ్ఞానమున ఇంద్రియ గ్రాహ్యత్వము రూపముగాను కలవు. ఈ రెంటియొక్క నిజస్వరూప స్వభావములను తెలిసికొనునది భావన. భావరూపముల కేకత్రానుసంధానమును గూర్చి, భావరూపముల కన్యత్వమును తెల్పునది భావన యని అర్థము. ఇట్టి భావనలో ఇంద్రియ గ్రాహ్యత్వము, తార్కికబుద్ధి యనునవి రెండు విశిష్టాంశములు. ఈ భావనయొక్క రూపాంతరములుగా శబ్దములు, శబ్దార్థ చిత్రములు కావ్యమున గలవు శబ్దములు, శబ్దార్థ చిత్రములు అను రెండును భావనచే ఉన్మిషితములై, భావనాసంశ్రితములై కావ్యమున ప్రవేశించినపుడే కావ్యము రమణీయార్థ ప్రతిపాదకమగును. భావనాసంశ్రితము కాని రసమునకు రసత్వము లేదని తాత్పర్యము.

## 2

భావనావ్యాపారమున సమున్మిషితమగు సంచారి భావము పురుషార్థాభివ్యంజకమగు ప్రవృత్తిని తెలు-

మన్నది. పురుషార్థమునకై యొనర్చు ప్రతి ప్రవృత్తి యందును మానసికమగు సంఘర్షణ కలదు. ఈ సంఘర్షణలేని ప్రవృత్తి ప్రయోజనవంతము కాదు. సంచార్యుద్దీపనము ప్రశాంతమానసమున కలుగదని భావము.

సామాన్య మానవునకు సంచారిభావ సుగ్రథిత మైనచో ప్రవృత్తులు, అనుభావములు విన్యస్తములై యుండక, గజిబిజిగా నుండునని రిచర్డ్స్ చెప్పుచున్నాడు. కవిలో కన్పించు ప్రవృత్తులు, అనుభావములు అన్యోన్య సంబంధము కలిగి, క్రమబద్ధములై, చక్కని విన్యాసపటిమ నందియుండునట! అనుభూతిలో కన్పించు విభిన్నాంశములకు సంబంధములను కూర్చుటలో గల పరిశీలనా పాటవము, స్వేచ్ఛ, లాలిత్యముఅనునవి సామాన్యమానవునిలోకంటె కవిలో మిన్నగా కన్పించుచున్నవని చెప్పుచున్నాడు. కాని ఇవి భావనా వ్యాపారముద్వారా వచ్చునవని రిచర్డ్స్ గమనించుటలేదు. చిత్తవృత్తులను ఉజ్జీవితములుగా చేసి, వాటికి సమన్వయమును కూర్చుట మాత్రమే భావనావ్యాపారము కాజాలదు. వీటికి సమన్వయమును కూర్చుట యనగా భౌతికములగు నరములను, కండరములను సరిదిద్దుట మాత్రము కాదు.

మేఘదూతలోని శ్లోకములు మహా తరమైన ఆవేదనను తెల్పుచున్నవి. ఈ ఆవేదనలో కవి అనుభవించిన సంచారి భావోద్దీపనములు, భావ సంఘర్షణములు ప్రతీతము లగుచున్నవి. ఈ ప్రతీతి కేవలము భౌతికము కాదు. విషాదపూరితమగు సన్నివేశమును మనము గమనించునపుడు సమీపించవలెనను మనోవృత్తి, పారిపోవలెనను మనోవృత్తి అనునవి యుండును. ఈ రెండు వృత్తులు ఒక తీరుగా, తుల్యశక్తితో ప్రబుద్ధము లగుటచే, ఈ రెంటికి సమన్వయము కుదురుచున్నదని రిచర్డ్స్ చెప్పుచున్నాడు. కాని ఈ రెండు వృత్తులకు పరస్పర సంఘర్షణ కలదు. ఈ సంఘర్షణ నరములలో నరములకు కలుగునది కాదు. ఈ సంఘర్షణలో మన దేహములు, మానసములు అను రెండును సంచలితములై ప్రజ్వలించుచున్నవి. విషాద మహోదధిలో కుములు పాత్రను జూచి మనము ప్రశాంతముగా నుండజాలము. ఈ సన్నివేశమున కొన్ని చిత్తవృత్తులు తిరోహితములు కాకతప్పదు. కొన్ని చిత్తవృత్తులు నశించునపుడు మనస్సు ప్రశాంతముగా నుండజాలదు. ఐనను విషాద సన్నివేశములలో ఏదో ఒక ఆకర్షణీయమగు ప్రత్యయము కలదు. దీనినే భావన (*Imagenation*) అని, రసభావము (*Aes-thetic Emotion*) అని పిలువవలెను.

## 3

లౌకిక ప్రమేయములద్వారా ఉద్దీపితమగు సంచారి భావముకంటె విశిష్టము, విలక్షణమునగు సంచారి భావము కావ్యానుశీలనమున ప్రబుద్ధమగుచున్నది. అర్థవంతము, ఉచితమునగు రూపము నవలోకించుటచే ఈవిధమగు సంచారిభావము స్పందించుచున్నదని క్లైవ్ బెల్ పల్కినాడు. కావ్యానుభూతికి లౌకిక జగమునుండి ఏమియు తీసికొని రానక్కరలేదని, లౌకిక భావాదుల కిచట ప్రసక్తిలేదని ఇతని వాదము. కావ్యజగము, లౌకిక జగము అనునవి అత్యంత విరుద్ధములు, విలక్షణములు, సంబంధరహితములు అని ఇతని వాదము. ఇది అశాస్త్రీయ మగు వాదమని వేరుగా చెప్పనక్కరలేదు.

లౌకిక జగమున కన్పించు సంచారి భావముకంటె విలక్షణము, విరుద్ధము నగు సంచారి భావము లేనేలేదని రిచర్డ్స్ వాదము. సంచారిభావము లన్నింటి యందు కొంత సామ్యముగలదు. లౌకిక సంచారి భావములు పరిపుష్టములై, చక్కగా విన్యస్తములై, లాలిత్యోపేతములై, హృదయంగమములై కన్పించగా కావ్యజగములోనివగుచున్నవని ఇతని వాదము. కావ్యానుభూతిలో కన్పించు వివిధభావముల సమన్వయము లౌకికానుభూతులలో కూడ గలదు. కావున కావ్యమే విశిష్టమైన అనుభూతి నీయగలదో అట్టి అనుభూతిని అన్యోపకరణములద్వారా కూడా పొందవీలున్నది. నల్లమందు మొదలగు వానిద్వారా కావ్యానుభూతివంటి ఆస్వాదమును తీసికొనిరావచ్చును గనుక, ఔషధ స్వభావములను తెలిసికొనినవాడు సాహిత్య సమీక్షకుడు కాగలడని చెప్పవలెను. వైద్యునకు, సాహిత్య సమీక్షకునకు చిత్తవృత్తుల స్వరూపస్వభావములు అవగతములై ఉండవలెను. కావున సాహిత్య సమీక్షలో శబ్దములు, ఛందము, లయ, గీతము మొదలగునవి కన్పించరాదని చెప్పవలెను. అట్టిచో నిది సాహిత్య సమీక్షయే కాజాలదని వేరుగా చెప్పనక్కరలేదు.

కావ్యము సౌందర్యము నభివ్యక్తము చేయునది. ఉపహితమైన భావమును విన్యాసవైదగ్ధ్య వశమున కావ్యము సూచింపగల్గుచున్నది. కావ్యమున ఉపహితమగు భావము, భావోపాధియగు రూపము గలవు. భావము రూపాంతర్వర్తిగా భాసించుచున్నది. ఈ భావరూప సంవనలమును గ్రహించునది, అనుభావించునది మనస్సు. చక్షురాదీంద్రియములకు గోచ

రించని భావరూప సంయోజనమును ఆస్వాదించు మనస్సు భావరూపముల నొక్కచోటికి తీసికొని వచ్చుటలేదు. ఒకేఒకచోటనున్న ఈ సంయోజనమును గ్రహించుటయే మానసవ్యాపారము. కాని భావరూపములకు సమగ్రమును సంకలనమును జాగ్రత్త కవి యొక్క ఉద్దిష్టార్థము. సమగ్రము సంకలనోపపాదనమున సౌందర్యముగలదు. ఈ ఉపపాదనము భావనా వ్యాపార జన్యము. భావన విషయములలోని భావమును ఉన్మిషితము చేసినపుడే సంచారి భావము స్పందించగలదు; అంతర్నిహిత తత్త్వాభివ్యక్తికి భావనావ్యాపారము ప్రవృత్తముకాగా సంచారి భావము ఒడుదుడుకులులేకుండా క్రమబద్ధముగ చున్నది. సర్వవిషయములను నియంత్రితము చేయగల్గిన భావనయే కావ్యరూపము నందగల్గుచున్నది. ఇట్టి కావ్యమున కన్పించు భావరూపములు రెండు విలక్షణాంశములు గావు. భావరూపములు సంవలితములై తత్త్వాభివ్యంజకము లగుచున్నవి. ఈ రెండును భావనావ్యాపారము పొందు రూపాంతరములు.

భావనావశమున ప్రమేయ మర్థవంతమగు చున్నది. స్వానుభూతిలో కన్పించు భావమును ప్రమేయమునకు ఆరోపించుచున్నామని ఒక వాదము గలదు. ఆరోపితములైన భావములనుండి మనలను మనము వేరుజేసికొనుటచే ఈ భావములు మనకు పరస్థములుగా ప్రతీతము లగుచున్నవని పిరివాదము. ఈ వేరుచేసికొనుటను "మానసిక దూరము" లేక "నిరపేక్ష స్థితి"యని బుల్లో చెప్పినాడు. కాని ఈ యారోప మేలవచ్చునో ఇట తెలియుటలేదు. ప్రతి మనోవృత్తిని ప్రతి ప్రమేయమునకు ఆరోపించ వచ్చునా?

ఆరోపవాదమును ప్రపంచించిన వారిలో లోట్జే, ఫిషర్, లిప్స్ అనువారు ప్రధానులు. మన ప్రవృత్తులు పరిదృశ్యమగు వస్తువులో లీనమగుట అప్పుడపుడు మన కనుభవసిద్ధమే. మానసిక భావములు ప్రమేయములో నున్నట్లు అనుభవించుచున్నాము. మన భావములను సూచించగల్గినవి, జ్ఞప్తిచేయగల్గినవి, అగు ప్రమేయములు మన కర్థవంతము లగుచున్నవని లోట్జే చెప్పినాడు. అచేతనమగు ప్రకృతిలోనికి తనను తాను మానవు డారోపించుకొనుచున్నాడు. కవిమనలను ప్రమేయములోని కారోపించుచున్నాడు. ఈ ఆరోపమున మనలో గల భావమునకు ప్రమేయ మొక ప్రతీకవంటిది యగుచున్నదని ఎస్. టి. ఫిషర్ పల్కినాడు. ఇట్లు సంచారి భావములు, అనుభావములు ఆరోపింపబడుచున్నవి. తద్ద్వారా ప్రమేయములో ప్రగాఢమగు అభేద ప్రతిపత్తి కల్గుచున్నదని లిప్స్ వాదము.

ఆరోపించుచున్నామను జ్ఞానము మనకు కలుగగానే మన ప్రతీతి భ్రమయని తెలియబడగలదు. కాని కావ్యానుభూతిని భ్రమయని మన మెంచకపోవుటచే నిచట భావమునకు ప్రమేయమునకు సంయోగ సంబంధముండజాలదు. సంయోగ సంబంధముద్వారా అనధిగతార్థ ప్రాప్తి కలుగవలెననిన తదుజ్జీవితమునకు వేరొక ప్రత్యయము వ్యాపృతమై యుండవలెను. ఒక వస్తువునుగూర్చి మన మేవగించుకొనునపుడు ఈ ఏవగింపునకు, ఆవస్తువునకు ఆకస్మికమగు సంబంధముకాని, కార్యకారణ సంబంధము గానికన్పడుటలేదు. భావము, లేక సంవేదన మనలో నున్నది. మన మానసిక (ఆధ్యాత్మిక) జీవితమును వ్యక్తపరుపగల్గిన ప్రమేయములోనికే ఈ భావమును గాని, సంవేదనమును గాని జొన్పగలమని లిప్స్ చెప్పినాడు. మనలోగల భావము గాని, సంవేదనముగాని, వస్తువులోగూడ ఉండి తీరవలెనని అర్థము. హ్యూడరు సంవాద వశమున ప్రమాతృ ప్రమేయములకు భావముద్వారా, సంవేదనముద్వారా, అనన్యత్వము కల్గుచున్నది; ఈ అనన్యత్వము ప్రమేయము నావహించియున్నదని తాత్పర్యము.

భావరూపముల కనన్యత్వముండగా మనోహరమగు కావ్యము నవలోకించునపుడు మన కానందము కల్గుచున్నది. ఈ ఆనందమున మన భావములను మనమే విషయమున కారోపించుచుంటిమను ప్రతీతి లేదు. కావున ప్రమేయమునకు భావము నారోపించుటకు బదులు "ప్రమేయము దుఃఖముతో నున్నట్లు భాసించుచున్నది." అని మొదలుగాగల రీతుల వ్యాఖ్య చేయవలెను. కావున వస్తువు మన భావముల నభివ్యక్తము చేయజాలినట్లు మనచే భావింపబడుచున్నదని చెప్పవలెనని రీడ్ వాదించినాడు.

మన సంవేదనము వస్తువులోని కెట్లు పోగలదు? గానమున ఒక భావ మభివ్యక్తమగుచో, ఈ భావము గాననిష్ఠమై యుండక తప్పదు. ఒక రాగ మొకానొక విశిష్టభావమును తెలిజేయవలదేగాని ప్రతి భావమును తెలియజేయలేదు. పరిదృశ్యమానమగు ప్రమేయమున రుచిరమైన భావము మనకు కల్గినపుడే మనము వస్తువు

ననుభవించగలుగుచున్నాము. మన సంవేదనములు, భావములు ప్రమేయోచితములు, ప్రమేయ యోగ్యములునై యుండవలెనని లాంగ్ రొక్కు వాదము. వస్తువు భావాభివ్యంజకము కానిచో, తదుచిత భావము మనకు కలుగనేరదు. ప్రమేయస్వభావమవగతమైన ఇట్టి భావము మనకు రాగలదు. కాని, ప్రమేయ స్వభావమును అవగతము చేయునది భావనా వ్యాపారము ఈ భావనచే అను ప్రాణితమైన సంచారి భావము ప్రతి వ్యక్తియొక్క హృదయమున సుప్తమై, అప్రబుద్ధమై యున్నది. కావుననే ప్రతి వ్యక్తియు కావ్యము నాస్వాదింపగలుగుచున్నాడు. ఇట్టి భావనానుప్రాణితము లగుటవలననే కావ్యజగములోని సంచారి భావములు లౌకిక జగములోనివాటికంటె విలక్షణములై భాసించుచు, రసభావములని వ్యవహరింపబడుచున్నవి. రసమునెట్లు పరిత్యజింపలేమో, అట్లే రసభావమును కూడ పరిత్యజింపలేము.

ఆరోపవాదము నంగీకరించితిమేని హెలెన్ నైట్ చెప్పుచున్నట్లు వస్తువులు స్వతః సుందరములు కావని, మనోగత భావముల నారోపించుటచే నవి సుందరములుగా భాసించుచున్నవని చెప్పవలెను. భౌతికమగు రూపముతో మనోగతమగు భావము చెందు సంవలనమును కావ్యమని ఈ వాదమున చెప్పవలెను. కాని కావ్యమున భాసించు అర్థమును కావ్యమునుండి వేరుచేయలేము. ప్రతీయమానమగు అర్థము కావ్యము ప్రమేయముయొక్క ధర్మము కావలెను. కావ్యము భావాభివ్యంజకమని, భావము కవి మానసమునుండి వచ్చునదని చెప్పవలసినచో, ప్రమేయము కావ్యమున అర్థమను ధర్మము కన్పించరాదు. భావారోప మశాస్త్రీయమని, అర్థరహితమగు కావ్యమున భావన లేకపోవుటచే కావ్యము మృతకల్పమని నిశ్చయింపవలసివచ్చును.

కొన్ని వస్తువులు కొన్ని భావములను విశేషముగా సూచించుచున్నవి. ఈ సూచన యనబడు ధ్వనియే ఆ వస్తువునగల సౌందర్యము. ఈ సౌందర్యము వస్తుతంత్రము, వస్తునిష్ఠము నగుటచే, వస్తువు సౌందర్యాభివ్యంజకమగుచున్నది. ఇట్లుగాక భావముల నారోపించుటవలన వస్తువులు అర్థవంతములు, సుందరములు నగుచున్నవని ఎంచవలసినచో, మేఘ నదీ పర్వతము లర్థరహితములు గావలెను. ప్రకృతితో సుంపరములుగానున్న నదీ పర్వతములయందు కవి మనోగత భావమారోపింపబడుచున్నదని ఎవరును ఎంచజాలరుగదా! కావ్య మేవిధముగు అనుభూతిని ఈయగలుగుచున్నదో, అట్టి అనుభూతియే ప్రకృతిలోగల సన్నివేశములనుండి కూడ కలుగుచున్నది. ప్రతి వస్తువు సౌందర్యాభివ్యంజకమే యని చెప్పవలెను. భావనా వశముననే ఈ సౌందర్యము నవగాహన చేసికొనగలము.

కావ్యమునగల భావము కావ్యసృష్టికంటె ముందే ప్రమేయమున గలదు. కనుకనే కావ్యమున భూతభవిష్యదర్థములు ప్రత్యక్షముగా కన్పించగలుగుచున్నవి. అనగా కావ్యమున అనుపహితమగు భావము విశ్వమున అంతర్లీనముగా గలదు. ఈ అంతర్లీన భావమును భావనావశమున అభివ్యక్తము చేయుటయే కావ్యసృష్టి. ఈ అభివ్యక్తిలో భూత భవిష్యదర్థములు ప్రత్యక్షగోచరము లగుచున్నవి. ఏవంవిధమగు ప్రతీతిలో ఇచ్ఛాశక్తి మొదలగునవి భావనయొక్క అంగములుగా వర్తించునవి. తద్ద్వారా భూత భవిష్యద్వర్తమానములకు అతీతమగు భావమును కవి దర్శించి, సామాజికులకు అపరోక్షానుభూతినొసగజాలిన మహాకావ్యమును సృష్టించగలుగుచున్నాడు. ఈ అనుభూతిలో చిత్రోదాత్తాద్భుతార్థత్వము, కథాప్రవాహము, శబ్దానుకూలత యనునవి భావనానుప్రాణితములై గలవు.

## 5

చిత్తవృత్తియగు సంచారిభావ మొకసంవేదనము. సంవేద్యమునుండి సంవేదనమును వేరుపరచలేము. ప్రతిలయతాళములనుండి వేరుచేయబడిన సంచారి భావ మతిపేలవము. సంవేదనము సంవేద్యనిష్ఠ మగుటచే, ప్రమేయ రహితమగు సంవేదనమునకు అస్తిత్వమే లేదు.

స్వానుభవైకగమ్యమగు విశిష్టసంచారి భావముతో రసచర్వణలో గల సంవేదన మారంభించునని క్లైవ్ బెల్ పల్కినాడు. ఈ సంచారి భావమును గృహాదులను నిర్మించుటలో కన్పడు స్థాయిభావముగా అలెగ్జాండర్ గ్రహించినాడు. ఇచటి సంచారి భావములను రత్యాత్మకములని ఫ్రాయిడ్ చెప్పినాడు. రసప్రతీతిలో విశిష్టమగు సంచారిభావ మేమియు లేదని రిచర్డ్స్, ఆగ్డెన్, వుడ్స్ అను వారలు పల్కినారు. మన మనఃప్రవృత్తులను మనము విశ్లేషించుకొని పరిశీలించినపుడిట్టి విశిష్ట చిత్తవృత్తి కన్పించుట లేదని వీరివాదము.

కాని సంచారిభావము క్షణికము, అస్థాయి. మన మనఃప్రవృత్తులను మనము పరిశీలించు సమయమున స్థాయికాని సంచారి భావము కన్పించదు. సంచారిభావము స్థిరముగా నుండునది గాకపోవుటచే, పరిశీలనావసరమున సంచారి రహితమైన మానసము కన్పించును. ఇంతమాత్రమున నిట విశిష్టమగు సంచారి భావము లేదనివాదించుట సాహసము.

ప్రమేయము రగుల్కొలుపు సంవేదనములను, ప్రమేయములలో కన్పించు పరస్పర భేదములను, ఆశ్రయించుకొనివచ్చు రసభావమగు విశిష్టసంచారి భావము తీవ్రముగా అనుభూతమైనప్పుడే పరిశీలనకు యోగ్యమగుచున్నది. తీవ్రమగు అనుభూతిలో భేదములు భేదములుగా ప్రతీతములుగాక, అన్యోన్య సంవలితములై, అనువృత్తి ప్రత్యయములోని అంగములుగా భాసించుచున్నవి. కావున రసభావమున అనధిగతార్థ ప్రతీతి కల్గుచున్నది. ఈ అనధిగతార్థము రసభావముకంటె విలక్షణమైనది. రసభావము సౌందర్యాన్వితము. కాని సౌందర్యావగతి భావనావశమున వచ్చుచున్నది. కావుననే సౌందర్య సంవేదన లేకపోయినను ఒక వస్తువు సుందరమని అనగల్గుచున్నాము. సంచారి భావమున సద్దీపకముగా నున్న ప్రమేయము భావనావశమున ప్రతీతిని నియంత్రితము చేయగల్గుచున్నది. ప్రతి భావనావ్యాపారమున సంచారిభావమొక ప్రధానాంగముగా కలదని చెప్పవలెను.

సంచారి భావమునే పరిష్కృతమైన అనుభూతితో బయలుదేరు కవి కావ్యరూపమున ఆ సంచారి భావము నభివ్యక్తపరచుచున్నాడు. కావ్య రచన పూర్తియగువరకు సంచారిభావానుభూతి గలదు. కాని క్రమక్రమముగా ఈ సంచారిభావము మార్పులనందును. భావింపబడిన అర్థము, విశదీకరింపబడిన అర్థము, సమగ్రముగ కావ్యరూపమునందుచున్న అర్థము అను మూడు అవస్థలలో ఈ సంచారి భావము ప్రవృత్తమగుచు పరిపుష్టమగుచున్నది. ఈ మూడు అవస్థలలోను సంచారిభావమెక్కడ ఆగుచున్నది? భావన ఎక్కడ బయలుదేరుచున్నది? అను ప్రశ్నలకు సమాధానమీయజాలము. భావనానుప్రాణితమైన సంచారి భావమే కావ్యమున అడుగడుగునను ప్రతీతమగుచున్నదనిమాత్రము చెప్పవచ్చును.

బాహ్యజగమునగాని, మనస్సులోగాని ఉన్న ప్రమేయము నాశ్రయించుకొని, సంవేదనము కల్గుచున్నది. కవియొక్క భావనచే సమున్మిషితమైన ప్రమేయము రసప్రతీతి నొసగజాలియున్నది. ఈ సమున్మేషమున ప్రమేయములో భావరూప సంవలనము కన్పించును. ఇట్టి ప్రమేయమున సుచిత్రరూపమున కావ్యజగత్తులో స్థానమును గూర్చుట భావనావ్యాపారముయొక్క ఉదాత్త కృత్యము. కావ్యాభివ్యక్తికి ఆధారమైన రసభావము భావనానుప్రాణితమై కావ్యసృష్టి పూర్తియగువరకు గలదని, కావ్యము ద్వారా వ్యక్తమగుటకే రసభావము కవిని ప్రోత్సహించుచున్నదని చెప్పవలెను. కావున కావ్యానుశీలనమున సామాజికుల కతిముఖ్యమైనది కావ్యమేగాని తత్పూర్వమున గల సంచార్యుద్దీపనము కాదని గ్రహించవలెను. స్వార్థముగ సంచార్యుద్దీపనమును ప్రమాత్ర నియంత్రితమగునట్లు కవి చెప్పగల్గుచున్నాడు. స్వగతమగు చిత్తవృత్తిని పరగతముగా చేయనెంచినపుడు అస్పష్టముగానున్న స్వగత చిత్తవృత్తి విశదీభూతమగుచున్నది. ఈ వైశద్యమునకు నిష్కామభావన, నిరపేక్షబుద్ధి కవికి అవసరము. తద్ద్వారా అనుభూతిని సమగ్రముగా, చక్కగా, ప్రదర్శించగల్గుచున్నాడు. ఈ ప్రదర్శనలో అనుభూతి బుద్ధిగ్రాహ్యమై, భావనావాహిని ద్వారా బహిర్గతమగుచున్నది. ఇట్లు సంచారిభావముగా కవి బయలుదేరుచు, తదనుభూతిని అధ్యవసాయాత్మకమగుబుద్ధితో విమర్శించుచు, భావనావాహినిలో ప్రతిబింబించు ఈ పరిష్కృతానుభూతినే కావ్యరూపమున నొసగుచున్నాడు. కావ్యజగమున కన్పించు సంచారి భావము భావనానుప్రాణితమని, లౌకిక జగమున గల సంచారిభావమున కీభావనతో సన్నిహిత సంబంధము లేదని నిశ్చయింపవలెను. ఈ రెంటికిని భేదము లేదనువారు భావనా వ్యాపారమునుగూడ అంగీకరించజాలరు. భావనలేనిచో కావ్యమే లేదు.

## 6

విషయముల కన్యోన్యసంబంధములుగలవని, విషయములన్నియు అనువృత్తి ప్రత్యయమగు తత్త్వమును అభివ్యక్తము చేయు అంగములని, ఆ తత్త్వముయొక్క పరిచ్ఛిన్నరూపములే విషయములని భావనావశమున గ్రహించుచున్నాము. బాహ్యజగము నవలోకించునపుడు నిష్కామభావనతో వస్తువులను గమనింపవలెనున్నది. ఇట్లవలోకించునపుడు మనకు కావలసిన సన్నివేశములనుగాని, వస్తువులనుగాని ఏరుకొనలేము, ప్రతివస్తువును ఒకేవిధముగా సమబుద్ధితో గమనించు

నవు డితఃపూర్వము కన్పించని సన్నివేశములు, వస్తువులకు గల పరస్పర సంబంధములు ప్రతీతములు కాగలవు. ఇట్టి ప్రతీతిని భావన యనవలెను. వస్తువుల నిజస్వరూప స్వభావములను తెలిసికొనజాలిన భావన కావ్యానుభూతిలో ప్రధానమైనది. ఈ భావనలో సంచార్యాదు లంగములగుటచే, సంచార్యాదుల స్వరూపస్వభావము లీ కావ్యజగమున నే యక్కువగా విశదముగా తెలియబడ గలవు.

అస్థాయియగు సంచారి భావమును అచంచలముగా భావింపజేయునది భావన. ఈ పరిణామమున సంచారిభావము యొక్క సామాన్యస్వభావము పరిత్యక్తమగుటచే నిది విశిష్టముగా కావ్యజగమున ప్రతీతమగుట కలదు. ఇట్టి సంచారిభావము కావ్యనిష్పాదకమగుటచే నిది కవులచే కొనియాడబడినది. సంచారిభావ ముద్దీపింపబడినపుడు యోగసమాధివంటి అనుభూతి గలదని, తన్మయత్వము గలదని, దేశకాలాద్యుపాధికమగు దేహము విస్మృతమగుచున్నదని, పారమార్థిక తత్త్వమే అవగతమగుచున్నదని కొందరు కవులు, యోగులు స్వానుభవములను వివరించినారు. ఆ యనుభూతి కల్గినపుడు కవి నట సామాజికుల ఉపహిత వ్యక్తిత్వము అనుపహితమగు తత్త్వమున లీనమగుచున్నది. ఈ లీనమగు దశలో ప్రవృత్తమగుచున్న భావనయందు బుద్ధి, ఇచ్ఛ యనునవి సమన్వయమునంద గల్గుచున్నవి. ఏవంవిధ సమన్వయ బలము వలన గతించిన సన్నివేశములనే గాక, రాబోవు సన్నివేశములను సహితము భావింపగలుగుచున్నాము.

ఈ భావనలో ప్రవృత్తమగుచున్న సంచారి భావ మనబడు రసభావము ప్రశాంత భావనను, ఆత్మవికాసమును తీసికొని రాగల్గుచున్నది. లౌకిక జగమున దుఃఖోద్వేగాదికము నీయగల్గిన సంచారి భావములు కావ్యజగమున ఆత్మవిస్తృతిని, ఆత్మవికాసమును మాత్రమే ఈయగల్గుచున్నవి. కావ్యజగమున సంచారిభావ మొక సంచారిభావముగా గాక, ఆత్మాభివ్యంజకమగు సంచారిగా ప్రతీతమగుచు, భావనావశమున లౌకికోపయోగరహితమై, పురుషార్థ సంవలితమై, అనుభూతమగుటచే నిట్టి ఆత్మవికాసాదులు రాగల్గుచున్నవి. కావుననే భావనానుప్రాణితమగు విషాద సన్నివేశము మనకు విషాదమును కలుగ జేయకున్నది. లౌకిక భయశోకములు తద్విలక్షణములుగా కావ్యమున కన్పించుచున్నవి. లౌకిక జగమున సాపేక్షభావన, కావ్యజగమున నిరపేక్ష భావన యుండుటచే నీ వైలక్షణ్యము వచ్చుచున్నది.

సమన్వయ సూత్రమగు భావనలో చైతన్యసంవలితమైన జగమే భాసించును. ప్రతివస్తువు అనేకార్థములను తెలుపగలి యుండుటచే నా యర్థముల నేకరీతుల కూర్చగల్గిన భావన రూపక, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, మొదలగు అలంకారముల ద్వారా రూపము నొసగి వచ్చుచున్నది. భావనలో గ్రహింపబడు విషయోపహిత భావము నభివ్యక్తము చేయుటలో నతి ముఖ్యమైనది రూపకాలంకారము. భిన్న విషయములలో కన్పించు సాదృశ్యమును తాదాత్మ్యముగా గాని, సంవలితత్వముగా గాని, అంగాంగిభావముగా గాని కల్పరచునపుడు వచ్చు అభేద ప్రతిపత్తియే రూపకమున ముఖ్యముగా గలదు. ఇచట భిన్నవస్తువులకుగల భేదము వాస్తవికము కాదను ప్రతీతి కలుగును. ఈ అభేద ప్రతీతి ప్రమాతృప్రమేయములకు గల అభేద ప్రతీతిని ఆశ్రయించుకొని బయలుదేరినది. సాదృశ్య వైలక్షణ్యములద్వారా ఇట్లు సిద్ధమగు అనన్యత్వము రూపకమున కాధారభూతమైనదని స్టౌట్ వచించియున్నాడు.

అనేక విషయాలను క్లుప్తముగా చెప్పవలసి వచ్చినపుడు రూపకమును స్వీకరించుచున్నాము. ఇంతవరకు గమనింపబడని సాదృశ్యమును విషయములలో కనిపెట్టజాలిన రూపకములో భిన్నవిషయముల కన్యోన్య సంబంధము కలుగుచున్నది. ఈ అన్యోన్య సంబంధములను తెలిసికొనుటవలన కవి రూపకము నవలంబించక తప్పదు. ఇట్టి రూపకమున విశ్వములో నభివ్యక్తమగు సూత్రమే కన్పించుచున్నది. విశ్వమే రీతిగా పరస్పర సంబద్ధములగు విషయములతో నుండి ఏకత్వ లక్షితమై భాసించుచున్నదో, అట్లే రూపకముగూడ కలదు. జ్ఞేయవిషయముద్వారా అజ్ఞేయము జ్ఞాతమగుటయే రూపక ప్రయోజనము. ఈ ప్రయోజనమును నెరవేర్చుటకు ఉపమాలంకారములోని వైపుల్యమును వదలుచున్నాము. ఉపమానోపమేయముల కభేదము చెప్పుటతో ఉపమాలంకారమిచట అంతర్లీనముగా భాసించగలదు. ఈ యభేదమును గ్రహింపజాలినది భావనయే. ఈ యభేదము వాస్తవమైననే మనస్సు నావేశించగలదు. కావున భావనానుభూతమగు సంచారిభావము రూపకమున కలదని స్పష్టము. కాని సంచారిభావము ముఖ్యముగా ఉద్దేశింపబడిన అత్యుక్తి, అతిశయోక్తి అను అలంకారములు రాగలవు. రూపకము ప్రకృతోప

యోగియైన పరిణామాలంకారము వచ్చును. ఇట్టు భావనావశమున ప్రవృత్తినుండి అనేకాలంకారములు వచ్చుచున్నవి.

కావ్యమునకు గొప్పదన మీ అలంకారముల వలనగాక, వీటిలో నంతర్వ్యాపిగానున్న భావన వలన వచ్చుచున్నది. రూపకావ్యాలంకారముల ద్వారా భావచిత్రములు బయలుదేరుచున్నవి. ఈ భావచిత్రములకు సమన్వయము కూర్పజాలిన దొక ప్రధానమగు సంచారిభావము లేక ప్రధానమగు జ్ఞానము. ఇట్లు సమన్వితములైన రూపకాదులే అర్థవంతము లగు చున్నవి. కవియొక్క చైతన్యము భావనద్వారా ప్రవర్తించుచు నీ విధముగ సమన్వయమును తీసికొని రాగల్గుచున్నదని కోల్రిజ్ వివరించినాడు.

భావన ప్రవృత్తమైనపుడు విషయము లర్థవంత ములై, సజీవములై భాసించుచు, ప్రమాతతో సన్ని హిత సంబంధమును పొందుచున్నవి. ప్రాక్తన సంస్కారాదు లీ యనుభూతిలో లీనమగుచు ప్రమేయమును అర్థవంతము చేయుచున్నవి. ఇట్లు చేయుటలో ప్రమేయమును కవి సృష్టించుచున్నట్లు కన్పడగలదు. ఈ కావ్యసృష్టిలోని భావనలో ప్రమేయమునకుగల ఉపయోగానుపయోగముల ప్రశంస లేకపోవుటయే భావనయొక్క విశిష్టధర్మము.

ప్రమేయమున భావనా వశమున అవలోకించు కవి, సామాన్య ప్రత్యక్షములోవలె ప్రవర్తించ జాలడు. ప్రమేయమున నేది ముఖ్యాంశమో దానినే గమనించి, తద్ద్వారా ప్రమేయమును వివరించుట భావనలో గన్పించును. ఇట్టి భావనచే సమున్మిషిత మైన దగుటచే కావ్యగత భావరూపములు రెండును రసమున పర్యవసితము లగుచున్నవి. కావ్యమునగల భావము భావనానుప్రాణితము, కవిచే మానసికముగా భావింపబడునది.

భావచిత్రములు (*Images*) వస్తువులయొక్క ఛాయలవలెను, ప్రతిబింబములవలెను కన్పించు చున్నవి. చిత్రకారుడు చిత్రించు చిత్రము జాగ్రద వస్థలో మనకు కన్పించు స్వప్నచిత్రమువలె నుండును. ఈచిత్రము ఇంద్రియగ్రాహ్యమై స్మృతిచేతను, భావన చేతను నియంత్రిత మగుచున్నదని ప్లేటో పల్కి నాడు. ఈ చిత్రము యదార్థమగు వస్తువుతో సభిన్నమై ప్రతీతమగునపుడే సుందరము కాగలదు. బాహ్యమగు వస్తువులో పర్యవసితమగు చిత్రమునందే సౌందర్యము కలదు. కనుక భావనయందు సత్యాసత్య వివేకమునకు తావులేదని, భావనాచిత్రము సత్యము కాదని ఎంచుట పొరబాటు.

భౌతిక రసాయనాది శాస్త్రములయందు, చరిత్రాత్మక వివేచనయందు కన్పించు భావనా వ్యాపారమును గమనించినచో భావనను స్పష్టముగా నిర్వచింపవచ్చును. రక్తప్రవాహమును హార్వే కనుగొనక పూర్వము శరీరములో పైకి, క్రిందకు రక్తము ప్రవహించుచున్నదని శాస్త్రజ్ఞు లెంచిరి. ఈ వాదము వాస్తవ విషయములకు విరుద్ధముగా నుండుటచే పరిత్యక్తమైనది. ఇట్టు వాస్తవ విషయములతో నంపలితముగాని భావనను ఊహ యందురు. కాని కన్పించు విషయముల నాధారముగా చేసికొని, అజ్ఞేయమగు దానిని వివరింప యత్నించిన ఈ వాదనలో భావన కొంతవరకు గలదు. అజ్ఞాతమగు విషయమును వివరించ యత్నించు వ్యాపారము భావనయని, ఈ వివరణలో సత్యమును కనుగొనుటయే పరమావధియని ఇచట గాననగును. కావున భావనయే జ్ఞానముగా పరిణమించు చున్నదని చెప్పవలెను. భావనావశమున మనము చెప్పు ఊహలు ఋజువుగావింపబడినచో సూత్రములుగాను, నియమములుగాను పరిణమించుచున్నవి.

ఇట్లే చరిత్రాత్మకభావనలో భిన్నములైన విషయములందొకానొక ప్రధాన సూత్రమును గమనించి, తద్ద్వారా ఈ విషయములను వ్యాఖ్యానించుటగలదు. ఈ ప్రధాన సూత్రము భావనద్వారా మన కవగతమగు చున్నది. వివిధవిషయముల నీసూత్రబలమున వ్యాఖ్యానింప గల్గితిమేని ఆ ప్రధాన సూత్రమును సత్యమనియే గ్రహించవలెను. భూతకాలీన విషయముల నిట వ్యాఖ్యానించగల్గిన భావన, భౌతిక రసాయనాది శాస్త్రములలో భవిష్యద్విషయములను వివరించగల్గు చున్నది. ఈ రెండు స్థలములయందు విషయములను వివరించుచు, వాటిని మన కవగతములగునట్లు చేయు చున్నది. ఇట్లే కవియొక్క భావనా వ్యాపారము సహితము విషయముల నిజస్వరూప స్వభావములను మనకు విదితము చేయుచున్నది. కావున 'ఇది సత్యము', 'ఇది భావన' అను ప్రయోగములలో కన్పించు సత్యము, భావన యనబడునవి జగదంతర్వర్తులే గాని, జగత్తునకు బహిర్భూతములు గావు. జగమును కేవలము సత్యముగా గాని, పూర్తిగా భావనామయముగా గాని గ్రహించ వీలులేదని దీని భావము.

కాని సత్యమగు బంగార ముపకరించునట్లు భావింపబడిన బంగార ముపకరించదు. భావనలో విషయముల ఉపయోగానుపయోగములకు ఎట్టి ప్రసక్తియు కన్పించదని తాత్పర్యము.

కాని అవాస్తవమగు భ్రమవలనకూడ ఫలము గమనింపుడు. భ్రమాత్మకమైనదైనను సర్పజ్ఞానము మనలను ప్రవృత్తిలోనికి దించుచున్నది. అనగా ఉపయోగ రాహిత్యమును, లేక ప్రవృత్తి రాహిత్యమును మాత్రమే ఆశ్రయించుకొనుట యనునది భావనలోని వైశిష్ట్యము కాజాలదని స్పష్టమగుచున్నది. సత్యమగు రజ్జువును, అసత్యమగు సర్పమును అనుభవించు వ్యక్తుల ప్రతీతి భేదముల నాశ్రయించుకొని సత్యము, భావన యనునవి విలక్షణము లగుచున్నవని గూడ ఎంచ వీలులేదు. సంవిత్స్వం వేద్యమగు విషయము సత్యము. సర్ప మసత్యమైనను, సంవిత్స్వం వేద్యమగు కాలమున సత్యమే యగుచున్నది. కావున భావన యొక్క వైశిష్ట్యము విషయనిష్ఠమగు స్వభావము నాశ్రయించుకొనియే గలదనవలెను.

వ్యావహారిక జగము నియమబద్ధము నియమముల ననుసరించి లౌకిక ప్రపంచమంతయు సంబద్ధమైయున్నది. కాని భావనలో ఈనియమములను మనము వాస్తవములని భావించుటలేదు. నియమ పూర్వక జ్ఞానములేని భావనలో ప్రాణమే కన్పించదు. భిన్న విషయముల కైకానుసంధానమును గూర్చు భావనలో జ్ఞానమునకు నియమము అనుస్యూతముగా గలదని చెప్పితిమి. భావనలో అవ్యవసాయాత్మకము, విశ్లేష పూర్వకమునగు జ్ఞానము లేకున్నను సమన్వయము నవగాహనము చేసికొనగల జ్ఞానము కలదు. సమన్వయ జ్ఞాన ముత్తమమగుటచే సరియైన జ్ఞానము భావనలోనే గలదని బోశాంకెట్ చెప్పినాడు. దేశకాలాద్యనియంత్రితమైన జ్ఞాన మిట గలదు. ఈ జ్ఞానమునుండి లౌకికజగ ముద్భవించుచున్నది లౌకిక జగమున అంతర్లీనము గాగల నియమావళి భావనాజగమున అభివ్యక్తమగుచున్నది. ఇట్టి అనుపహితమగు జ్ఞానమే భావన యని నిశ్చయింపవలెను.

భావనామయమగు కావ్యమున కొన్ని పాత్రలను గమనించుచున్నాము. ఈ పాత్రలు లౌకిక జగమున నున్నచో నెట్లు ప్రవర్తింపగలవో, అట్టి ప్రవృత్తికి భిన్నముగా కావ్యజగమున ప్రవర్తింపజాలవు. కథావస్తువు భావింపబడినదైనను, ఆయా పాత్రల ప్రవృత్తి లౌకిక ప్రవృత్తికంటె విలక్షణము కాజాలదు. పైగా కావ్యగత పాత్రలవలన లౌకిక జగములోని మన ప్రవృత్తులలో విశిష్టములగు పరిణామములు వచ్చుచున్నవి. భావనాజగము సత్యముగానిచో ఈ పరిణామము ప్రయోజనవంతము కానేరదు. ఇది యటుగాక చరిత్రలో కన్పించు అగ్నిమిత్రునకు, మహాకవియొక్క రూపకమునగల అగ్నిమిత్రునకు భేద మున్నదా? కావ్యజగములోని అగ్నిమిత్రుడే మనకు ప్రధానుడని మరువలేము.

రసజగమును ప్రవేశించు స్థాయిభావము భావనానుప్రాణితమై రసములోనికి పర్యవసితమగుచున్నది. ఈ భావనవలన స్థాయిభావము పరకీయ లౌకిక చిత్తవృత్తికంటె విలక్షణముగా భాసించును. లౌకిక జగమున స్థాయిభావము వేరొక చిత్తవృత్తిని ఆవిర్భవింపజేయును. కాని కావ్యజగమునగల స్థాయి అన్య చిత్తవృత్తిని జన్మింపజేయజాలదు. భావనా వ్యాపారము చిత్తవృత్తులను పూర్తిగా సంస్కరించుచు, లౌకికచిత్తవృత్తులకంటె వీటిని విలక్షణముగా భాసింపజేయుచున్నదని తెలియనగును.

ఈ భావనను భావిక యను అలంకారముగా మన అలంకారికులు వివరించియున్నారు. భావనావశమున అవగత మగు విషయము నుచ్చరింపగా తదంశములు పరస్పరోపకారములైయుండగలవు. ఇచ్చట ఆస్థానవర్ణన గాని, వ్యర్థవిశేషముల నుపయోగించుటగాని కన్పింపదు. గంభీరమగువస్తువు భావాయత్తముగా వ్యక్తము కాగలదు. ప్రసాద గుణోపేతమైన ఈ అభివ్యక్తిలో అర్థవ్యక్తియున్నది. కవి అనుభవించిన విషమును ప్రత్యక్ష ప్రతీతియోగ్యముగా, ప్రత్యక్షముగా భాసించునట్లు చెప్పుటయే భావికలో ప్రధానవిషయము. ఇట శబ్దానుకూలత్వము, వ్యస్తసంబంధరహితమై లోకప్రసిద్ధములగు శబ్దములచే నుపనిబద్ధమునైన పదరచన ఉండుటచే అర్థప్రతీతి వెంటనే కల్గుచున్నదని ప్రతీహారేందు రాజనినాడు. ఈభావికలో భావనా సమున్మిషితమగు హృదయసంవాద ముండుటచే సర్వత్ర భావనానిషముగా చెప్పవచ్చును.

మన మనేక పర్యాయములు గమనించుచున్న వస్తువు ఒకానొకవేళ అతి సుందరముగా భాసించుట గలదు. ఆ సమయమున నీ వస్తువు భావాభివ్యంజకమై ప్రయోజనవంతమగుచున్నది. కాని ఈ సౌందర్య భావన మెక్కువకాలము నిలువదు. ఈ సౌందర్య మను

భూతమగుచున్నదే కాని స్థావరముగా నిలుచుటలేదు. ప్రశాంతసమయమున నీయనుభూతిని స్మరించుచు, దీనిని కావ్యజగమున నుపహితము చేయువాడు కవి. ఈ ఉపహిత స్వరూపముద్వారా పూర్వావగతమగు అనుభూతిని భావించగల్గుటచే ప్రాక్తనానుభూతిక స్వరూపమే ఒక ప్రతీకవలె నుండును. ఇట్లు కవినిష్ఠమగు భావము శృంగారాది రససంవలితమై, విశిష్టార్థోల్లేఖియై, కావ్య ప్రతిబింబరూపమున సామాజికులకు సాక్షాత్కరించుచున్నది. ఉదాత్తమగు అర్థము, అర్థవ్యక్తి, స్ఫుట రసము, భావావేశము అనునిద్వారా సామాజికుడు కవియొక్క అనుభూతిని పొందగల్గుచున్నాడు. ఈ అనుభూతిని పొందగల్గునట్లు చేయు భావనావ్యాపారము రసచర్వణకు ప్రాణమువంటిది.

కవిగతమగు భావము సామాజికునకు భావనావశమున అవగతమగుచున్నది. ఈ భావనలో అతీంద్రియార్థ దర్శనముండుటచే విషయనిష్ఠమగు భావము తెలియబడుచున్నది. మంత్రద్రష్టయగు ఋషివలె కవి, సామాజికులు త[illegible]మును దర్శించ గల్గుచున్నారని భావము. ఈ దర్శనలో ప్రాణభూతమైనది భావనయగుటచే నిది కావ్యజగమునకు చెందినది. ఇందు ప్రమేయము తాటస్థ్యవృత్తితో గ్రహించబడుచున్నది. లోకోత్తరవస్తువు స్ఫుటముగా, తటస్థముగా ప్రతీతమగుచున్నదని రుయ్యకుడనినాడు. ఇట్టి ప్రతీతిలో భావన ప్రసృత్వశక్తితో కన్పించుచున్నది.

మహాకావ్యమున కేవలము రసోక్తియే గలదని యెంచరాదు. భావోద్దీపనమున భావన అంగముగా మాత్రమే కలదనికూడ పల్కరాదు. రసోక్తిద్వారా చిత్తవృత్తి సంవాదమే కలుగగలదు. కాని భావనయందు వస్తుసంవాదము కలదని రుయ్యకుడనినాడు సంచారిభావమును సృష్టించుటగాక, భావ[illegible]ను ప్రాణితవిషయమును కవి ఉ[illegible]శించును. ప్రమేయజ్ఞానము, భావోద్దీపనము అను రెండును సమకాలికములుగా భావనావ్యాపారమున కన్పించుచున్నవి. ఈ రెంటితోను ఉచ్చారణ బయలుదేరుచున్నది. ఉచ్చారణవలన భావనకు రూపమాపాదింపబడుచున్నది. సర్వవ్యాపియగు ప్రసాదము, అర్థవ్యక్తి అను ధర్మములచే లక్షితమైనదే రూపము. భావనావశమున ప్రమేయము అర్థవంతములై చైతన్యసంవలితములై భాసించుటచే నీవిధమగు రూపము లభించుచున్నది.

## 10

అన్యోన్యాసంబద్ధములైన అనుభావ వ్యభిచారి భావములను, అలక్షిత సంబంధముగల ప్రమేయములను ఏకత్రపేర్చి, సమన్వయమును కూర్చునది భావన. సంచారిభావ ముద్దీపింపబడునపుడీ స్థితినుండి విముక్తులము కావలెనని నెమ్మదిగా, మనకు తెలిసి తెలియని రీతిగా యత్నించుచున్నాము, ప్రమాతృప్రమేయముల స్వభావములు మనకవగతములగుటచే నీప్రశాంతి ప్రయత్నము బయలుదేరుచున్నదని షోపెనోవర్ అనినాడు. భావనలో ప్రమాత ఉపాధిరహితుడగుచున్నాడని భావము. ప్రమేయములు, అనుభావములు, సంచారిభావములు మొదలగునవన్నియు భావనాను ప్రాణితములై రసమున పర్యవసితము లగుచున్నవని యనవలెను.

భావనావ్యాపారమున హృదయసం[illegible]దము, వస్తుసంవాదము కలవనియంటిమి. సంవాదవశమున సౌందర్యమును మనోనిష్ఠమని భా[illegible] అనినట్లు వచించరాదు. సంవాదబలమున కవి ప్రమేయాంతర్వర్తి కాగల్గుచున్నాడని పల్కినాము. కాని ఈ ప్రమేయాంతర్వర్తిత్వము కావ్యబహిర్భూతములగు ప్రవృత్తులలో గూడ గలదు. ప్రమేయముచే ప్రబుద్ధమై, ప్రమేయముచే నియంత్రితమైన సౌందర్యభానమే భావనలో గలదు. భావనలో గన్పించు సంవాదము దేశకాల ప్రమాతృ నియంత్రితమని, నిరపేక్షమని, సమన్వయకారకమని, సంచారి నిరోధాత్మకమని చెప్పవలెను. ఇచట గల సంచారిభావము ప్రమేయముతో నభిన్నమై, అవ్యభిచారియై ప్రతీతమగును.

కావ్యసృష్టికి ప్రమాత ఎంతఅవసరమో ప్రమేయముకూడ అంత అవసరము. ప్రమాత ఒక్క[illegible] కావ్యమును సృష్టించలేడు. ఈ సృష్టి[illegible] ప్ర[illegible]మునకుగూడ విశిష్టభాగము గలదు. ప్రమాతృప్రమేయములకుగల అభేద ప్రతిపత్తిలోని అర్థము, లేక భావము, లేక చైతన్యము కావ్యరూపమున ప్రతీ[illegible]మగుచున్నది. కావున సంచారిభావముయొక్క వ్యక్తీకరణయే సౌందర్యమని కారిట్ పల్కినపుడు అసమగ్రమగు సత్యమే కన్పించుచున్నది. కావ్యరూపములోనికి పరిణమించు సంచారిభావము ప్రశాంతరూప గలదని మరువరాదు.

## 11

భావనావశమున అవగతమగు భావమును స్ఫుటముగా, దృఢముగా ప్రతీతమగునట్లు చేయుటయందు

కవివ్యాపృతుడగునని భిన్నడ్ చెప్పినాడు. ఈ వ్యాపారమున అస్థానవర్ణన, అవాచ్యవచనము, వాచ్యావచనము మొదలగునవి కన్పించవు. ఇట్టి భావనలో భూతభవిష్యదర్థములు ప్రత్యక్షములుగా కన్పించునని భామహుడు భావికను నిర్వచించినాడు. సమన్వయము ప్రధానముగా జూపు భావనయందు పూర్వాపర విరోధముగాని, అసామంజస్యము గాని కన్పించజాలవు. ప్రతిభయనబడు ఈ భావనను నవనవోన్మేషశాలియగు ప్రజ్ఞ యనినారు. ఈ ప్రజ్ఞవలన రసభావ ముపాధిరహిత మగుచున్నది. కావ్యానుశీలనమున కలుగు వాక్యార్థ ప్రతిపత్తియైన తర్వాత తత్తద్వ్యాక్యోపాత్తము, సాక్షాత్కారాత్మకము నగు ప్రతీతి కల్గుచున్నది. ఏవంవిధమగు ప్రతీతిలో వచ్చు తన్మయీభవనము భావనయొక్క స్వభావమును చూపుచున్నది. ఈ భావనవలన కావ్యజగమున గల భయ, క్రోధ, శోకాదులు లౌకికభయాదులకంటె విలక్షణములుగా పరిణమించుట గలదు. ఈ పరిణామము సాధారణీకరణనిష్ఠము.

రసప్రతీతిలో అభిధా, భావనా, భోగీకరణము అను మూడు శబ్దవ్యాపారములు కలవని భట్టనాయకుడనినాడు. శబ్దములు సామాన్యముగా తెలుపు అర్థములను తెలియజేసిన అభిధాత్మకము లన బడుచున్నవి. ఈ అర్థములు భావనచే అనుప్రాణితములై భావనాభాస్యములగుచు కావ్యజగమును చేరుచున్నవి. కావుననే "కావ్యార్థాన్ భావయంతీతి భావాః" అని భరతుడనినాడు. కావ్యమున ఉపహితి మగు రసము హృదయసంవాద జన్యమగు సాధారణీకరణముద్వారా భావనాత్మకముగా అనుభూతమగుటయే భోగీకరణము. పూర్వావగమగోచరీభూతమగుచు, ఉత్తరభూమికాభాగి, ఆస్వాద్యము, అగురసమునకు స్థాయ్యాదులు భావనావశమున నిష్పాదక హేతువు లగుచున్నవి. ఆస్వాదనాత్మకమగు అనుభూతిలో భావనద్వారా అభివ్యజ్యమగు కావ్యార్థమే రసము గనుక రసప్రతీతిలో భావన అతిముఖ్య మగుచున్నది.

ఆస్వాదనము, చర్వణ అను శబ్దములకు పర్యాయపద మగుభావనను మనోవ్యాపారమని ఉత్తుంగోదయుడు నిర్వచించినాడు. ఇచట గల మనోవ్యాపారమునకు అపరోక్షానుభూతి యని అర్థము చెప్పవలెను. ఈభావన అభిధాభాగమును పరిష్కరించునది, రసాదులను పరిపుష్టము చేయునది. భావన శబ్దములను సంస్కరించగా, కావ్యజగమున ప్రతిశబ్దము వైశిష్ట్యముతో ప్రతీయమానము కాగలదు. కావుననే మహాకవుల శ్లోకములలోని ఒక పదమునకు పర్యాయపదము నుంచుకొని పఠించితి మేని కావ్యానుభూతి దుష్ట మగుచున్నది. ఇట్టి అభిధాభాగమును రసత్వములోనికి చెంచుచు, రసమున గల విభావాదులకు సాధారణత్వము నాపాదించు ధర్మమును భావకత్వమందురు. సముచిత గుణాలంకార పరిగ్రహాత్మకమై ఈ భావకత్వము కావ్యమున కన్పించుచున్నది. కావున భట్టనాయకుడు నిర్వచించిన భావనావ్యాపారమే అభినవుని చేతులలో సాధారణీకరణముగా మారిన దని గ్రహించవలెను. ఇట్టి భావనను ప్రతీతియని, చర్వణయనికూడ పిలువవచ్చును.

## 12

రసప్రతీతిలో ప్రమాతృప్రమేయములు గలవు. అనుభవించువాడు ప్రమాత. అనుభవింపబడునది ప్రమేయము. ప్రమాతద్వారా భావనావాహిని అభివ్యక్తమగుచున్నది. ప్రమేయములపై వ్యాపృతమగుచున్న భావనావ్యాపారము గౌతికమగు ప్రమేయమును రసవిషయకమగు ప్రమేయముగా భాసింప జేయగల్గుచున్నది. బాహ్యేంద్రియములకు భౌతికముగా భాసించు ప్రమేయము వస్తుతః రసబంధి యని భావనద్వారా గ్రహించగల్గుచున్నాము.

లౌకికజగమున స్త్రీమూర్తితో తల్లి, సోదరి, కూతురు మొదలుగాగల సంబంధము లనేకములు గలవు. ఈ సంబంధములు ప్రతియోగి నాశ్రయించుకొని వచ్చునవి. కావ్యజగమున ఇచ్ఛాశక్తిరహితముగా స్త్రీమూర్తి భాసించుటచే ఈ ప్రమేయముతో అనన్యత్వము నందగల్గుచున్నాము. లౌకిక ప్రమేయము దేశకాలోపహితమగుటచే కొంతకాలమునకు నశింపగలదు. బాహ్యపిండము నశించినను, కావ్యజగమున గల మనోమయమగు పిండము నశించజాలదు. భావనాగ్రాహ్యమగు ప్రమేయము దేశకాలముల కతీతమైనది.

ఈ భావనావ్యాపారము మానసికము. మనస్సుద్వారా ఆత్మకు కల్గు స్వాభివ్యక్తినే భావన యనవలెను. పరిదృశ్యమగు విషయ మాత్మవికాసమును తీసికొని రాగల్గినపుడు భావనప్రవృత్త మగుచున్నది. ఈ ఆత్మవికాసమున జ్ఞానసంవలితమగు భావోద్దీపనము గలదు. ఈ జ్ఞానమాత్మను సమగ్రముగా నిర్వృత్తము చేయజాలి, విశ్రాంతినొసగుచున్నది. కాని ఈజ్ఞానము వివిధరూపములతో కావ్యజగమున భాసించుట గలదు. శృంగారాది శబ్దములతో నీరూపములను వ్యాఖ్యానించుచున్నాము.

# రెండుపరిమాణాల లోకపు వింతలు

శ్రీ వసంతరావు వేంకటరావు

ఆనాడు కుంభవృష్టిగా వర్షం పడుతూంది. సాయంకాలం షికారువెళ్ళే అవకాశం లేకపోయింది. ప్రఖ్యాత విజ్ఞానవేత్త జార్జిగేమో రచించిన "వన్, టూ, త్రీ...ఇన్ఫినిటీ" అను పుస్తకం చదువుతున్నాను. చదువుతుంటే అనిర్వచనీయమైన ఆనందం కలుగుతూంది; ఆనందాతిశయం చేత శరీరం పులకరిస్తూంది. ఆ విషయ వివరణ, రచనా విధానం, మధురమైన శైలి నన్నెక్కువగా ఆకర్షించేయి. యథార్థ జగత్తు విషయమై మన సామాన్య భావాలకీ, సూక్ష్మపరిశోధనల మూలంగా కలిగే భావాలకీ ఎంత వ్యత్యాస ముండగలదో ఊహించుకొంటున్నాను. ఆధునిక విజ్ఞానం ఊహాతీతమైన దృగ్విషయాలను ఆవిష్కరిస్తూంది.

మన ప్రాచీన జ్ఞానంపై విశ్వాసాన్ని కోల్పోయిన సామాన్య మానవుడు తెరచాపలేని పడవవడలె జీవనదీ ప్రవాహంలో కొట్టుకొని పోతూన్న కాలమిది. ప్రతి విషయాన్ని విమర్శించగల హక్కు ప్రాథమికమైదన్న విశ్వాసంతో సామాన్యులు ప్రాచీనాభిప్రాయాలను విమర్శిస్తున్నారు. ఆ హక్కు లేకపోలేదు; కాని, విషయవిమర్శకు కొంత జ్ఞానం సంపాదించాలన్న దృష్టి వారికి లేదు. అందు చేత, వారు నియమించుకొన్న కృత్రిమ ప్రమాణాలకు సరియైన సమాధానం రాలేదని గురుతర భావాలను హేళన చేస్తున్నారు.

దీనికి మందు లేకపోలేదు. భౌతికవిజ్ఞానం యొక్క పరిమితత్వాన్ని జనసామాన్యాని కెరిగిస్తే, భౌతికవిజ్ఞాన ప్రమాణాలు ఎంతవరకు ఉపయోగపడతాయో వారు తెలిసికోగలరు. అప్పుడు, వారి విమర్శ సమంజసమైనదో కాదో వారికి బోధపడుతుంది. ఏ క్షేత్రంలోనైనా విశ్వాసంలేనిదే ముందంజవేయలేము. ఇంద్రియాతీతములైన విషయాలున్నాయన్న నమ్మకం లేకపోతే రేడియో, X–కిరణాలు, రేడియో ధార్మికత, టెలివిషన్ మొదలైనవి బయల్పడేవి కావు. మనం సముపార్జించిన జ్ఞానరాశి పెరుగుతూన్న కొద్దీ మన దృష్టి విశాలమౌతుందనీ, మన అభిప్రాయాలను మార్చుకోవలసిన అవసరం కలుగుతుందనీ గ్రహించిన విజ్ఞానులవల్లనే భౌతికవిజ్ఞానం మహావేగంగా పురోగమిస్తూంది. ప్రకృతిని పరిశీలించాలి, పరిశీలన కనువైన యంత్రాలను నిర్మించాలి, ప్రయోగాలు చెయ్యాలి, ఫలితాలను సమీక్షించాలి: అప్పుడు మాత్రమే విజ్ఞానవృక్షం శాఖోపశాఖలుగా పెరుగుతుంది. ఈ సత్యాన్ని భౌతికవిజ్ఞాని గుర్తించినప్పటినుండి—సుమారు 350 క్రిందటినుండి—మానవునికి ప్రకృతి లొంగడం మొదలు పెట్టింది. ఆ విజ్ఞానమే ఇప్పు డెట్టిస్థితిలో నున్నదో సామాన్యులు తెలిసికొంటే వారి అపోహాలు, చాలవరకు పోతాయి.

ఈ విధంగా ఆలోచనలు పెల్లుబుకుతుండగా కాఫీ పట్టుకొని లావణ్య వచ్చింది.

"చిన్నపిల్లల్లాగ కాగితాలు కత్తిరిస్తున్నారేమిటండీ?"

"చిన్నపిల్లలకు సైతం బోధపరచగల మహత్తర విషయాలను ఈ పుస్తకంలో గ్రంథకర్త చర్చించేడు. అందొక విషయం నేనే నమ్మలేకపోయేను. అది నిజంగా చిన్న విషయమే. కాని, ఆ పుస్తకంలో సూచించబడినట్లు ప్రయోగంచేసి, కాగితాన్ని కత్తిరిస్తే కాని సత్యం తేల్చలేకపోయేను. నువ్వూ బోల్తా కొట్టకతప్పదులే. చూడు. 'క గ చ జ' అను పొడుగైన కాగితం పేలికను కత్తిరించేను. దాని వెడల్పు ఒక అంగుళముంటే చాలు. 'చ జ' కొస 'క గ'పై పడేటట్లు కాగితాన్ని వలయంగా చుట్టి ఆ రెండు కొసలు అంటించేను. నీ చేతినున్న బంగారు గాజు లాంటి కంకణం ఏర్పడింది. దాని చుట్టు, మధ్యగా, ఒక గీతగీసేను. గీతనంబడి దానిని కత్తిరించేను. అదే పరిమాణంగల రెండు వలయాలు వచ్చేయి. వాటి వెడల్పు సగమయింది, అంతేనా?"



చిత్రం. 1



"ఇదేనా, మహా గొప్ప ప్రయోగం చేసేరు!"

"చదుకొన్నదానివి, నీవుకూడా అంత తొందర పడితే ఎలాగ? అట్టి కాగితం పేలికనే మరొకటి తీసికొన్నాను. ఈసారి రెండు కొసలు అంటించే ముందు 'చజ' ను ఒక అరమెలి త్రిప్పేను; ఇప్పుడూ రెండు కొసలు అంటించేను. ఇప్పుడుకూడ ఒక వలయంవంటిదే తయారైంది. మధ్యనుండి చుట్టూ గీతగీసి, గీతవెంబడి కత్తిరిస్తున్నాను. ఈసారి ఎన్ని వలయాలొస్తాయో చెప్పగలవా?"

"ఆగండి. ఒక్కసారి యోచించనీయండి... ఇదా సంగతి. ఈసారి రెండు రింగులు వస్తాయి కాని, అవి ఒకదానిలో ఒకటి, గొలుసులాగ ఉంటాయి."

"అనుమానం లేదుకదా?" (చిత్రం 2)

"రవంతైనా లేదు. కత్తిరించండి ... ఇదేమిటి విచిత్రం? ఒక్కరింగే వచ్చింది! మీరు చుట్టూ కత్తిరించేరా?"










చిత్రం. 2: 'కగజ అరమెలి త్రిప్పిన కాగితం. 'కగ' మీద 'చజ' పడేటట్లు అంటించగా ఏర్పడిన వలయం. 2. దాని వెంబడి మధ్యకు గీసిన గీతపై కత్తిరించగా వచ్చిన ది రింగు ఒకేఒకటి—3.

"రెండువస్తాయి"

"జాగ్రత్తగా చూడు. చాలవరకు కత్తిరించేను. ఇంక రెండు ముక్కలౌతుంది; కత్తిరించేదా?"

"నేనేం గారడీ చేసేననుకొన్నావా?......"

"ఒప్పుకొన్నానండీ ... ఇంతకూ ఇదేవిధంగా సాధ్యమైందంటారు కత్తిరించగానే పొడవు

రెండింతలై, రింగు ఒక్కటే ఉండిపోయింది; వెడల్పు మాత్రం సగమయింది."

"ఈ తమాషాకు కారణం మెలి. ఇప్పుడు దీనిని చుట్టూ మధ్యకు కత్తిరిస్తే రెండు రింగులు, ఒకదానిలో నొకటి గొలుసువలె ఉన్నవి వస్తాయి. కత్తిరిస్తున్నాను, చూడు."

"ఈ ప్రయోగాలు చాలా బాగున్నాయండీ. వీటికేదైనా ప్రయోజనముందా?"

"ఉంది; అది చాల గొప్ప ప్రయోజనంకూడ. ఒక్కసారి మన మీ ప్రపంచాన్ని విడిచి రెండు పరిమాణాలే గల లోకంలోనికి పయనం కావాలి."

"అంటే?"

"మన లోకంలో మనకు మూడు పరిమాణాలు తెలుసును. అవి పొడవు, వెడల్పు, ఎత్తు. వీటిలో వెడల్పును కాని ఎత్తును కాని ఒకప్పుడు దళసరిగా భావిస్తాము. నిజానికి మన ప్రపంచంలో నాలుగు పరిమాణాలున్నాయంటారు విజ్ఞులు. పైని చెప్పిన మూడు పరిమాణాలు కాక, మరొక పరిమాణం నాల్గవది ఉంది. అదే కాలం. పుట్టినది మొదలుకొని పొడవుగాను, వెడల్పుగాను దళసరిగాను పెరుగుతూన్నట్లే కాలంలోకూడ పెరుగుతున్నాము. ఆ సత్యం అంత సులభంగా ఊహ కందదు. మనది నాలుగు పరిమాణాలు కలిగిన చతుర్థా విస్తృత (*Four dimensional*) ప్రపంచం. వాటిలో మూడింటినే మనం గుర్తించ కలుగున్నాము. కాలాన్ని తెలిసినప్పటికి దానిని నాలుగవ పరిమాణంగా భావించలేము. కాలగమనంతో మనం పెరుగుతున్నామనీ, వయస్సు ముదురుతూందనీ ఎరుగుదుము. కాని, కాలంలో మన వ్యాప్తిని గుర్తించలేము. ఇప్పుడది అప్రస్తుతం. అయితే, మనం మూడు పరిమాణాల నెరిగినట్లే, కొందరు జీవులు, రెండు పరిమాణాలనే ఎరిగినవారుండవచ్చును. వారి లోకం తమాషాగా ఉంటుంది. వారి చర్యలు మనకు విపరీతంగా కనిపిస్తాయి..."

"ఆ లోకం ఎక్కడుందండీ?"

"ఎక్కడో ఏమిటి, గోడలనిండా ఆలోకాలే! మన ఫొటోగ్రాఫులకు, సినీమా తెరమీది బొమ్మలకు జీవం వచ్చిందనుకో. ఆ బొమ్మలు బల్లపరుపుగానుంటాయి. వాటికి దళసరి లేదు. అవి సంచరించగల ప్రదేశానికి రెండే పరిమాణాలున్నాయి. అవి, తెర యొక్క తలంపై కుడికి ఎడమకి, పైకి క్రిందికి సంచరించగలవే కాని, ముందు వెనుకలకు నడవలేవు. అందుచేత, వాటి ప్రపంచం ద్విధా విస్తృతం. ఎదురుగా గోడని నీ ఫొటో ఉందికదా. ఆ చిత్రానికి జీవం వచ్చిందనుకో. ఆ రెండు పరిమాణాల ప్రపంచంలో నీవు తిరగాలంటే ముందు వెనుకలు నిషేధం. ఫొటో ఉన్న తలాన్ని విడిచి పైకి రాలేవు.

"ఇంకొక విశేషముంది. ఇప్పుడు ఫొటోలో నీవు తూర్పుముఖంగా నున్నావు. తూర్పుగానున్న ముఖాన్ని పడమరకు త్రిప్పగలవా?"

"కష్టమే నండోయి!"

"కష్టమే కాదు; అది అసాధ్యం. ఏమంటే మూడవ పరిమాణజ్ఞానం లేదు; అంటే, ఫొటోకి ప్రాణం వచ్చినా నీకు ఆ జ్ఞానముండదు."

"తలక్రిందుగా తే నా ముఖం పడమరవైపు వస్తుంది కదండీ!"

"నిజమే. ఆ విధంగా జీవించడమో?"

"సాధ్యం కాదు. అయితే, 'ఫొటోలోనున్న నేను ముఖాన్ని త్రిప్పలేనన్న మాట? నాముఖం ఎల్లప్పుడూ తూర్పువైపు ఉండవలసిందేనా? ..చూడండి. ఆ ఫొటోలో మీ ముఖం పడమరవైపుంది. అదికూడ ఎల్లప్పుడూ పడమరవైపుండవలసిందేనా? ఆ రెండు ఫొటోలకి జీవం వస్తే మన కింక ఎడమొగం పెడమొగం తప్పదంటారా?"

"అంత భయపడవలసిన అగత్యం లేదు. ద్విధా విస్తృతలోకవాసులకీ బాధ తప్పదనే చెప్పాలి. మాటకి, ఎవరి ముఖం మొదటిలో ఎటువైపుగానుంటే జీవితాంతంవరకు అట్లే ఉండితీరాలి. దానిని మార్చగలవిధానం ఆ జీవులకి తెలియదు. అది వారు ప్రారబ్ధమనుకొంటారు. కాని, మూడు పరిమాణాల జ్ఞానమున్న మనకు అదొక విషమ ప్రశ్నగా కనిపించదు. మూడవ పరిమాణం జోలికి పోనక్కరలేకుండానే, మన జ్ఞానాన్ని ఉపయోగించి, ఎడమొగాన్ని పెడమొగంగా త్రిప్పగలం. దానికే, ఇందాక చేసిన ప్రయోగం సహాయపడుతుంది. రెండవసారి అంటించిన మెలితిరిగిన రింగుకి గొప్ప సామర్థ్యముంది. తూర్పువైపు మొగమున్న బొమ్మను ఆ రింగుపైని పెట్టి, దాని చుట్టూ ఒకటిన్నరసార్లు త్రిప్పేసరికి మనకు కావలసిన మార్పు ఆ బొమ్మలో కలుగుతుంది. అంటే, మొగం పడమరవైపు తిరుగుతుంది."

"నిజంగానేనా?"

"సందేహమెందుకు? కాగితంతో బొమ్మని కత్తిరిద్దాము. దీనికి మొగం తూర్పువైపు—అంటే కుడివైపు—ఉంది. రింగుపైని బొమ్మని నిలువబెట్టి, మెల్లిగా రింగుతలం వెంబడి త్రిప్పుతాను చూడు... (8) ఒకచుట్టు తిరిగేసరికి ఏమైంది."




చిత్రం. 8: చిత్రం 2 లో రింగు 2 వంటిదే ఇది. కుడివైపు మొగమున్న ఒక బొమ్మ స్థానం 1 వద్ద బయలుదేరి రింగు పైతలంపై తిరుగుతుంది. ఒక సగంచుట్టు తిరిగేసరి స్థానం 2 లోనికి వస్తుంది. రింగు పైతలంపైనే ఉంది. పావు చుట్టుతిరిగేసరికి స్థానం 3 చేరుకొంది. మరొక పావుచుట్టు—మొత్తం ఒక చుట్టు —తిరిగేసరికి రింగు లోపలి తలాన్ని చేరుకొని తలక్రిందులైఉంది. స్థానం 4 లోపల తలం వెంబ( మరొక అరచుట్టు తిరుగగానే స్థానం 5 చేరుకొంది. ఎడమవైపు తిరిగిన మొగంతో నిలువుగా నిలుచుంది.

"తమాషాగా ఉందండీ! బొమ్మ రింగులోనికి పోయి తలక్రిందులైంది."

"ఆ విధంగా అది నిలువలేదు కనుక, దాని నా తలంలోనే మరొక అరచుట్టు త్రిప్పగా, దాని మొగం పడమరవైపు, అంటే ఎడమకు తిరిగింది. మూడవ పరిమాణంలో సంచరించ నక్కరలేకుండా దాని మొగాన్ని ఒకవైపునుండి మరొక వైపునకు మార్చగలిగాము. దానికి ముఖ్యకారణం మన మూడవ పరిమాణ జ్ఞానమని జ్ఞాపకముంచుకో."

"ఇది చాల అద్భుతంగాఉందండీ! కాగితాన్ని అంటించినప్పుడు ఒక్క అరమెలిక త్రిప్పడంచేతనే ఇది సాధ్యమైందంటారా?"

"నిజమంతే. మెలికలేని సామాన్య వలయమైతే బయలుదేరినప్పుడెట్లుందో, ఒకసారి తిరిగివచ్చిన పిదప కూడ బొమ్మ అదేవిధంగా ఉంటుంది. బొమ్మ యొక్క అవస్థలో మార్పురావడానికి ఆ మెలికకంటె వేరొండు కారణం లేదు. ద్విధావిస్తృతలోకవాసులకున్న చిక్కువంటిదే మనకూ ఒకటి లేకపోలేదు. మనకూ కుడి ఎడమ భేదం ఉంది. ఆ భేదాన్ని నిర్మూలించలేము. మాటకు, కుడికాలుజోడును ఏంచేసినప్పటికి ఎడమకాలు జోడుగా మారదు. మనం వాడుకొనే వస్తువు లెన్నెన్నో ఉన్నాయి. వాటిలో చాలవాటికి, ఈ వ్యత్యాసం లేదు. దానికి వేరే కారణాలున్నాయి. అయితే, మనం కుడిని ఎడమగా మార్చలేమా అని ప్రశ్న?"

"అద్దంలో ఈమార్పు కనిపిస్తుంది కదండీ?"

"అవును. అద్దంలో కనిపించేది మిథ్యాబింబం. మన ప్రతిబింబంయొక్క కుడిచేతితో వ్రాయించాలంటే మనం ఎడమచేతితోనే వ్రాయాలని గుర్తించు. అందుచేత, అంతమాత్రాన్న ఈ సహజ వైరుధ్యం మాయంగాదు."

"నిజమేనండీ! రెండు పరిమాణాల లోకంలో జీవించేవారికి కలిగిన చిక్కువంటిది మనకే కలిగింది కదండీ? ఈ వ్యత్యాసాన్ని రూపుమాపగల అవకాశం మనకు లేదుకాబోలు."

"లేదు. కాని, మనకంటె అధికజ్ఞానంగల చతుర్ధావిస్తృతలోకజీవులు ఈ చిక్కును సులభంగా విడదీయగలరని చెప్పడాని కాధారాలున్నాయి. ఇందాకా చేసిన ప్రయోగంలో మెలిగల రింగుపై ప్రయాణంచేస్తూ సూటిగా పోయిన బొమ్మ నిజంగా మెలితిరిగడమే కాక, ఒక వలయాన్ని చుట్టింది. కాని, ఆ బొమ్మమాత్రం సూటిగా సరళరేఖామార్గంలో పోతున్నాననే అనుకొంటుంది."

"అంత వక్రమార్గంలో పోతూంటే సూటిగా పోతున్నట్లు ఎలా భావిస్తుందంటారు?"

"మదరాసునుండి లండనుకు ప్రయాణంచేసిన వారు తిన్నగా పోతూన్నప్పటికి వక్రతలంపై గమించుచుండడంచేత వారు వక్రమార్గాన్ని ఆశ్రయించేరని చెప్పకతప్పదు. బంతిపై నాల్గవభాగం

ప్రయాణంచేస్తే ఎంత వక్రంగా పోవాలో, ఉత్తర ధ్రువంనుండి భూమధ్యరేఖకువస్తే ఎంత వంపు తిరగాలో అంత వంపు తిరుగుతున్నారు మదరాసునుండి లండన్ పోయేవారని గ్రహించాలి. మనభూమి ఒక మహాగోళంకదా! గోళంపై సమతల మెట్లుంటుంది? అంటే, మన భూతలమే వక్రంగానుంది. కాబట్టి, మన మెంత ముక్కుకి సూటిగా ప్రయాణం చేసినప్పటికి సరళరేఖా మార్గాన్న పోలేమన్నది స్పష్టమే. వక్రత్వం భూతలానికి స్వతస్సిద్ధమైనది. అట్లే, ఆకాశంకూడా వక్రంగా నున్నదంటారు విజ్ఞానులు. అది అంగీకరిస్తే, వక్రాకాశంలో నేరుగా పోయినప్పటికి మన మార్గం వక్రం కాకతప్పదు. సూర్యగోళం ప్రక్కనుండివచ్చి భూమిని చేరుకొన్న నక్షత్ర కిరణాలు, సూర్యగోళప్రాంతంలో కొద్దిగా వంగుతాయని ప్రయోగాలవల్ల రుజువు చేయకలిగేరు. కాంతికిరణం వంగడమంటే, అది ప్రయాణంచేస్తున్న ఆకాశంలోనే మార్పు కలిగి, వక్రత్వ మేర్పడినట్లు మనం అన్వయించుకోవాలి."

"ఆకాశానికి వంపు అంటే నే నూహించలేక పోతున్నానండీ. ఆకాశమే కనిపించదు. అదిశూన్యం కదా. శూన్యానికి వంపు ఏవిధంగా కలుగుతుంది?"

"కొంచెం యోచిస్తే నీకే బోధపడుతుంది. ఒక వస్తువుచుట్టూగల క్షేత్రంలో ఆ వస్తు ప్రభావంచేత కొన్ని మార్పులు కలుగుతాయి. అయస్కాంతం చుట్టూ బలరేఖ లుంటాయి. చిన్న అయస్కాంతపు సూచికను ఆ క్షేత్రంలోనుంచినప్పుడది బలరేఖలవెంబడినే గమించడాని కుంకిస్తుంది. అంటే, అయస్కాంతాన్ని ఆవరించిన ఆకాశానికికొన్ని ప్రత్యేకలక్షణాలు సంప్రాప్తమైనాయి. అయస్కాంత మచ్చట ఉన్నంత కాలం పరిసరాకాశానికా లక్షణాలుంటాయి; అయస్కాంతాన్ని తీసివేయగానే ఆకాశంయొక్క ప్రత్యేక లక్షణాలు కూడా మాయమౌతాయి. అదేవిధంగా, ఆకాశంలో ఎక్కడెక్కడ నక్షత్రాలున్నాయో అక్కడల్లా ఆకాశం వక్రించినట్లు తెలియవస్తుంది. శూన్యాకాశంలో సూటిగాపోయే కాంతికిరణాలు వక్రాకాశంలో ప్రయాణం చేస్తున్నంతకాలం వక్రమార్గాన్నే అనుగమిస్తాయి. కాగా, కాంతికిరణాల మార్గలక్షణాలనుబట్టి ఆకాశం వక్రంగా నుందో లేదో చెప్పకోగలం. ఈ భావాన్ని ఆధారంగా చేసికొని, ఆకాశం వక్రించి వక్రించి తుదకు మూసికొనిపోతుం దని విజ్ఞానులు నిర్ణయిస్తున్నారు. నారింజపండుమీద నేరుగా ప్రయాణంచేసిన చీమ, బయలుదేరిన స్థానాన్ని చేరుకొనేటట్లు, భూమిపై ఒక స్థలంనుండి బయలుదేరి సూటిగా పోయినవారు ఆ స్థలాన్నే చేరుకొనేటట్లు, ఒక జ్యోతినుండి బయలుదేరిన కాంతి తిరిగి తన జ్యోతినే చేరుకోగలదని విజ్ఞానులు చెప్తారు.

"ఆకాశం వక్రంగా నున్నప్పుడు, ఆకాశంలో మెలికూడా ఉండవచ్చు. మెలిగల ఆకాశంలో ఒక చుట్టుచుట్టి రాగానే మానవునిలో విపరీతమైన మార్పు కలుగుతుంది. వాని కుడి ఎడమగాను, ఎడమ కుడిగాను మారిపోతాయి. అప్పుడు గుండెకాయ కుడిప్రక్కకు వస్తుందని చమత్కరిస్తాడు విజ్ఞానిగేమో! అట్టి ఆకాశం యొక్క జ్ఞానం మనకు లేదుకాని, చతుర్థావిస్తృత లోక జ్ఞానం గలవారు వక్రాకాశాన్ని ఊహించుకో గలరు."

"రెండుపరిమాణాలలో కొన్ని ఊహించుకొనడమే కష్టంగానుంది; ఆకాశంవంపునుగురించి ఇప్పుడు చెప్పకండి. సినీమా చిత్రాలకి ప్రాణంవస్తే నిజంగా వాటి అవస్థ ఎట్లుంటుందో ఊహించుకొంటూంటేనే చాలా చిత్రంగానుంది. నిజంగా అట్టి జీవు లుంటారా?"

"ఉండవచ్చునని విజ్ఞానులఅభిప్రాయం. కొన్ని మృగాలకు మూడవ పరిమాణజ్ఞానం లేదంటారు."

"ఆ లేకపోవడాన్ని కూడా ఊహించుకోనడం కష్టమే!...భౌతిక విజ్ఞానపథాన్న దూరం పోతూన్న కొద్దీ నేలవిడిచిన సాముగా కనిపిస్తూంది. సామాన్యంగా వ్యాపించియున్న అభిప్రాయాలు తారుమారవుతున్నాయి."

"నిజమే. అందుచేతనే గొప్ప శాస్త్రవేత్తలు భౌతిక రంగాన్ని అతిక్రమించి పోతున్నారు. భగవద్భావాన్ని వారు ఆమోదిస్తున్నారు. ఈ నవీనవిజ్ఞానం విరివిగా ప్రచారంలోనికి వచ్చినప్పుడు విశ్వశక్తులలో మానవునికి విశ్వాస మేర్పడే ఆశలున్నాయి. దానికి సరియైన వాతావరణం భారతీయులే కల్పించాలి."

"ఆ ఛాయలు కన్పించడం లేదండీ."

"ఈమధ్యనే విజ్ఞానుల సంఘాన్ని ఏర్పాటు చేసేరు. వారేమైనా సాధించవచ్చు...పూజకు వేళ కావచ్చింది. పద."



# కళా[illegible]

## ప్రాచీన వ్యోమయానం

జ్ఞానిక యంత్రశాస్త్రమునం దాధునిక పాశ్చాత్య పండిత ప్రకాండు లమితశ్రమ ▪సలిపినను అనుకొనినంత సాఫల్యము బడయ కుండుట లోకవిదితము. ఆదర్శప్రాయమైన, అధ్య యన యోగ్యమైన, అనుకరణీయమైన యున్నత విజ్ఞానము ప్రాచీన భారత మేనాడో బడసి, మానవసముదాయమున కమూల్యపాత్ర మొసగినటుల ప్రాచీన గ్రంథరాజములు వేనోళ్ల చాటుచున్నవి. కాని యన్యదేశీయుల, విజాతీయుల యౌన్నత్యమునే పరమావధిగా శిరసావహించుచు, పాశ్చాత్యుల నడుగులలో మడుగులొత్తుట కలవాటుపడిన భారతీయ విద్వాంసులు సహిత మీ పక్షపాత నిర్ణయముల వల్లెవేయుట మహాఘోరము.

ఒకనాడు యావద్విషయములకు, శాస్త్రీయ రహస్యములకు గురుపీఠ మలంకరించి, దివ్యజ్ఞాన జ్యోతితో నిఖిల ప్రపంచమును ప్రకాశవంత మొనరించి ధన్యజీవియని పొగడ్తగాంచిన భారతదేశ మీనాడు ప్రతివిషయమున కన్యులవైపు దృష్టిని ప్రసరించుచుండుట కాలవైపరీత్యము.

విజాతీయుల దురహంకారములకు, నీచాతినీచ మదమాత్సర్యములకు గురియై విలుప్తమైన ప్రాచీన భారతీయ గ్రంథరాజములందలి శిల్ప, కళా, శాస్త్ర, యంత్ర పరమ రహస్యములు కల్పిత గాథలుగా పరిణమింపజేయుట నిజముగ దౌర్భాగ్యము.

భారతజాతి సంరక్షించుకొ గలిగిన యావశేష ప్రాచీన సంపత్తి—వేదములు, మహాభారతము, రామాయణము, పురాణములు, యంత్ర సర్వస్వము, కథాసరిత్సాగరము మొదలగునవి—ఉత్సాహులకు వలయు యంత్రశాస్త్ర సాధనముల నందించుచున్నది. ప్రాచీన మయాన వివరముల గ్రహించు సదవకాశము యీనాటి మూలాధారములు.

క్రిమికీటకముల భక్ష్యానంతరము శిథిలావస్థ యందైనను భారద్వాజమహర్షి రచిత 'యంత్ర సర్వస్వ'మను నొక మహత్తర గ్రంథరాజ భాగము హస్తగత మగుట భారతీయుల సుకృతము; సౌభాగ్య విషయము.

ఈ గ్రంథమందలి నలుబదవ—యధ్యాయము నందు విమాన నిర్మాణవిధానము, దాని రహస్యము, మహర్షి వివరముగ స్పష్టపరచి యున్నాడు. మహర్షి దీనికి 'వైమానిక ప్రకరణము'ని వ్యవహరించెను. స్థల, జల, నభములందు పక్షులగూడిరి తీవ్రగతితో పరుగిడు యంత్రము 'విమాన' మనబడినది. చూడుడు:

'పృథివ్యప్స్వ న్తరిక్షేషుఖ గవత్ వేగతః స్వయం
యః సమర్థో భవేద్గన్తుం స విమాన ఇతిస్మృతిః'

పాశ్చాత్య వైజ్ఞానికు లతి పరిశ్రమానంతరము గత మహాసంగ్రామ సందర్భమున నభముపై చలించు విమానమును జలాంతర్గామితో సమముగ పరుగిడునటుల సలుపుటలో కృతకృత్యులైరి. ఆ సమయమునం దీ యాధార మే వారికి విదితమైయుండిన, విమానము నే సముద్రయాన సాధనము జేయుటయం దెంతో సాయ పడి యుండెడిది. చూచుట కిది విస్మయాత్మకమై యుండకుండెడిది.

### రామాయణ కాలము

మహర్షి ల్మీకి రచిత శ్రీమద్రామాయణము నందు విమానవర్ణన లనేకములు కానవచ్చును. వాయువు శ[illegible] విమాన గమనానుకూలముగ ప్రయోగింపబడి నటుల 'ఋగ్వేద సంహిత' స్పష్టపరచుచున్నది.

'క[illegible]దేవః శాద్రో మారుత మనర్వాణాం
......కస్య అభిప్రయాగత.'

శ్రీమద్రామాయణమునందు వర్ణితమైయున్న

విమానములో స్ఫటికమణిమయమైన కిటికీలు, స్వర్ణమయమైన జాలీలు నుండుచుండెను.

'జాలవాతాయనైర్యుక్తం కాంచనైః స్ఫటికైరపి' ఇదేగాక 'సుందరకాండము', 'అరణ్యకాండము' లందలి క్రింది శ్లోకములు గమనార్హములు :

'దివంగతేవాయు యథే ప్రతిష్ఠితం
వ్యరాజతాదిత్య యథస్య లక్ష్మవత్
సపుష్పకం యంత్రవిమాన ముత్తమం
దదర్శ తద్వానర వీరసత్తమః'

అనగా నభమునందు చలించునప్పుడు వాయువునందు దినకరపథములో చిహ్న సమానముగ గనబడు 'పుష్పక విమానము'ను గాంచెను. ఇది దీని భావార్థము.

'యస్య తత్పుష్పకం నామ
విమానం కామగం శుభం
వీర్యాద వర్జితం భద్రే
యేనయామి విహాయసం'

అనగా 'విశ్రవణ సంబంధమైన సుందరమగు విమానమును బలముతో, శక్తితో జయించి తీసుకవచ్చితిని. దీనిపై నిప్పుడధిరోహించి యాకాశయాత్ర సలిపెదను' అనుట భావార్థము.

## పురాణముల కాలము

పురాణముల నిర్ణయానుసారము మయదానవుడొక యద్వితీయ పారిశ్రామికుడు. యంత్రశిల్పవిద్యను ఆవిష్కరించిన ప్రప్రథముడు ఈతడే యని శాస్త్రములందు గలదు. అతడు సిద్ధపరచు కర్రబొమ్మలు సజీవ మానవులమాదిరి కార్యముల నెరవేర్చుచుండెడివి. చౌర్యమునందవి యద్వితీయము లనబడుచుండెను. మయదానవుడు నివసించుచుండిన వీథికొకనా డొక విదేశీయు డరుదెంచి రాత్రిపూట విశ్రమించెను. ఉదయమున, నిద్రానంతరము, చూచుసరికి విదేశీయుని సామగ్రియంతయు మటుమాయమై పోయెను. ఈ విచిత్రమును, రహస్యమును కనిపెట్టుటకా విదేశీయుడు రెండవరాత్రి మేలుకొని యుండెను. నిద్దరు మనుష్యులు కిటికీనుండి లోనికి దూరుట గాంచి, విదేశీయుడు వెంటనే యా యిద్దరిని బట్టుకొనెను. వానిని పరిశీలించి చూడ నవి యంత్రములద్వారా చలించు బొమ్మలని తేటపడెను.

ఈ యంత్రవిద్యను, మయరాక్షసుడు, చంద్రప్రభ రాజకుమారుడైన సూర్యప్రభకు నేర్పెను. కేవలము మయుడేగాక యాతని కూతురగు సోమప్రభ సహిత మీ విద్యయందు నిపుణత్వము బడసి యుండెను. ఆమె నిర్మించిన విమానములు చిత్రవిచిత్రముల సలిపిన నిదర్శనములు పురాణములందు గలవు. ఆ కాలమునందు కొన్ని విమానములు మేకుల కదలికవలన చలించినటుల పురాణములందు వర్ణింపబడి యున్నవి.

కళింగదత్తు డను నొకరాజు విమానములగురించి ప్రశ్నించ సోమప్రభ ఇటుల ప్రత్యుత్తర మొసగెను:—

'యథా చేదం జగద్యంత్రం పంచభూతాత్మకం తథా,
తంత్రాణ్యేతాని సర్వాణిశృణుతాని పృథక్పృథక్.
పృథ్వీప్రధానం యంత్రం యద్ద్వారాది విఘ్నాటియత్ ,
పిహితం తేన శక్నోతి నచోద్ఘాట యితుం పరః,
ఆకార స్తోయ యంత్రోద్ధ్యాః(?)సజీవ ఇవదృశ్యతే
తేజోమయన్తు యద్యంత్రం తజ్జ్వాలాః పరివుంజతి,
మయాశ్చైతాన్య వాహ్యాని ఘాతత్వి త్వముతిస్యయత్(?),
రక్షకం చక్రయంత్రం తక్తాతో జానాతి నాపరః'

అనగా యీ యంత్రం జగద్రూపకమైన ప్రాకృతిక యంత్రము మాదిరి పాంచభౌతిక గుణసంపన్నమైనది. వివిధ తత్వములతో సిద్ధమొనర్చబడిన యీ యంత్రము వివిధ కార్యముల నెరవేర్చుచుండును.

పృథ్వీతత్వ ప్రాధాన్యము కలిగింపబడిన యంత్రము ద్వారము తెరచు కార్యము నెరవేర్చును. ద్వారముల తెరచు సామర్థ్యము మరొక సాధనమునందుండ వీలుండదు.

జలతత్వ ప్రాధాన్యము కలిగిన యాకారము సచేతనము మాదిరి దృష్టికి గోచరమగుచుండును.

తేజోమయ సాధనము అగ్నిని ప్రజ్వలింపజేయుట కురిపించుచుండును.

వాయుతత్వము కలిగిన యంత్రము విమానమును చలింపజేయుటకు, నెగిరింపజేయుటకు సాయపడుచుండును.

వచనమును నభివ్యక్త పరచుటకు నాకాశము కలిగిన యంత్రము సాయపడును.

నా తండ్రివలన యీ రహస్యములన్నియు నాకు విదితపరచబడినవి. చక్రయంత్రి రహస్యము మాత్రము నా తండ్రికి తప్ప యన్యుల కెవరికిని తెలియదు.

## అన్యపరికరములు

ప్రాచీన భారతీయులు కేవలము వైమానిక నిర్మాణ విధానమందేగాక, అన్యావసర వస్తువులను విమానములం దమర్చు విధానమునందును నిపుణత్వము బడసియుండిరనుట నిర్వివాదాంశము. ముందు భాగమునుండి వచ్చుచుండు ప్రతి విషయమును చక్కగా గ్రహించుటకు వారా విమానమునకు దూరదర్శిని యంత్రము, విద్యుచ్ఛక్తి దీపము లమర్చుచుండిరి.

'శక్తి తంత్రోక్త రోహిణీ విద్యుత్ప్రసారణేన
విమానాభిముఖ స్థ వస్తూనాం ప్రత్యక్షనిదర్శన క్రియా రహస్యం'

ప్రాచీనకాలమునందు భారతదేశములో వైమానిక సమరములు జరిగిన సజీవ దృష్టాంతములు గ్రంథస్థములై యున్నవి. విమానములద్వారా అస్త్ర శస్త్ర ప్రయోగములు బాహాటముగ సమరములందు జరుగుచుండెడివి. రెండవ విమాన మే దిశనుండి వచ్చుచుండునది కనుగొనుటకు, ముఖకేంద్రమందలి ప్రత్యేక పరికరమును నొక్కిన 'దిశాంపతి' యను నాళమందలి మొలిక స్పష్టపరచుచుండెడిది.

'విమాన ముఖకేంద్రకీలీ చాలనేన
దిశాంపతి యంత్రనాళ పత్రద్వారా
పరయానాగమన దిక్ప్రదర్శన రహస్యం'

రెండవ విమానమందలి సైనికులను, అన్యులను మూర్ఛితుల జేయుటకు విమానమందలి వామభాగపు 'సంధిముఖము'లోని నాళపు ప్రత్యేక ఛిద్రమునుండి వెడలుచుండు ధూమమును ఏకత్రపరచి శత్రువిమానముపై ప్రసరింపజేయబడెడిది.

యుద్ధములందు శత్రుఘాతమునకు వాడబడుచుండు సశస్త్ర విమానములు 'సంగ్రామ విమానము' లనియు,'భైరవయంత్రము' లనియు వ్యవహరింపబడుచుండెను.

'విమానోత్తర పార్శ్వస్థ సంధిముఖనాళా
దపస్మార ధూమ్రం సంగ్రహణ స్తంభనయంత్రద్వారా
తద్ధూమ్ర ప్రకారణతాత్ పర విమానస్థ
సర్వజనానాం స్తబ్ధీకరణ రహస్యం'

విమానములు వాయువు బలముతో చలింపబడెడివి. కీలకమును నొక్కగనే వానికి తీవ్ర గమనశక్తి విజృంభించుచుండెను. విమానమందలి గమన పరికరమును త్రిప్పిన నది రెండు వందల యోజనములనుండి యెనిమిది వందల యోజనములవరకు నిరాటంకముగ వెళ్ళుచుండెను.

'వాతయంత్రవిమానంచ తన్మమాస్తోహ మంత్రయత్
యోజనాష్ట శతం యాతి సకృత్, ప్రహతకీలకం
ఆరూహ్య స్వకృతేహ్యస్మిన్ వాతయంత్ర విమానకే
ద్రుతంతతో గతో౽భూవం యోజనానాంశతద్వయం'

## ప్రయాణసౌకర్యము

ప్రాచీనకాలములో ప్రజలకు వైమానిక ప్రయాణము వ్యయప్రయాసపూరితమై యుండకుండెను. ఈ ప్రయాణసౌకర్యము సర్వసామాన్యుల కందుబాటులోనుండి నటుల ప్రాచీన గ్రంథములు విదితపరచుచున్నవి. వైమానిక ప్రయాణము సర్వసాధారణముగ నుండుటచేతనే యది 1000 మంది ప్రయాణీకులు నిరాయాసముగ ప్రయాణ మొనర్చునటుల నిర్మింపబడుచుండెను. ఇంతకన్న మించియుండు సౌకర్య నిర్మాణ విధానము కేవలమును మయునికి మాత్రమే విదితమై యుండెను.

'వ్యజిజ్ఞ పచ్చసుమహద్విమానం కృతము స్తిమే
యన్మానుష సహస్రాణి వహత్యద్యావ హేలయా'
—కథా సరిత్సాగరం.

శ్రీమద్వాల్మీకి రామాయణమునందు సహితము ప్రయాణీకులను తీసుకువెళ్లుచుండిన ప్రయాణ విమానముల వర్ణనలు విరివిగా గలవు.

'కైలాసపర్వతం గత్వావిజిత్వ నరవాహనం
విమానం పుష్పకంతస్య కామగం వైజహారయః'

అనగ కైలాసపర్వతమున కేగి ప్రయాణీకులను తీసుకువెళ్లు విమానమును తెచ్చితినని భావము.

లంకాధీశుడైన దశకంఠుని కుమారుడగు ఇంద్రజిత్తు వైమానిక కళయం దానా డద్వితీయుడుగా పరిగణింపబడినటుల శ్రీమద్రామాయణమునందు గలదు.

ప్రాచీన భారతీయు లీ కళయం దపారౌన్నత్యము గడించిరనుట నిర్వివాదాంశము. దేశము తిరిగి యా యపూర్వ వైభవము గడించుటకు మహదవకాశము హస్తగతమైనది. భారతజాతి తిరిగి వైజ్ఞానిక విధానమునం దన్య నాగరక జాతులకు గురుపీఠ మలంకరించి మహత్తర రహస్యముల విదితపరచుటకుద్యుక్తము గావలయును.

శ్రీ బి. యన్. శర్మ.

# గ్రంథ విమర్శ

## భారతీయ తత్త్వశాస్త్రము
## ద్వితీయభాగము.

ఆంగ్ల గ్రంథకర్త, డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణపండితుడు. అనువాదకుడు. బులుసు వెంకటేశ్వర్లు. ఎమ్. ఎ. ఆంధ్రోపన్యాసకుడు. పి. ఆర్. కాలేజ్. కాకినాడ. వెల: అయిదురూపాయలు.

ఇది డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ పండితుని *Indian Philosophy* అనే గ్రంథానికి యథామూలానుసరణము. ఈ అనువాద ప్రథమభాగాన్ని గురించి భారతి ఇంతకు పూర్వమే సమీక్షించింది. దాని కిది రెండవభాగము.

దీనిలో బౌద్ధ, జైన, పురాణేతిహాస యుగాలను గురించీ, భగవద్గీత తత్త్వాన్ని గురించీ సమగ్రమైన చర్చ జరిగింది.

అనువాదకులీ గ్రంథపీఠికలో 'బుద్ధుడు పరమసత్యము నెరింగియుండియు, దేశకాల పాత్రముల ననుసరించి, దానినిగూర్చి చెప్పకుండుటే ప్రజల కెక్కుడుగ నుపయోగకరమని భావించినాడని రాధాకృష్ణ పండితునివాదమై యున్నది.' అని ఈ వాదాన్ని ఉద్ఘాటించి ఖండించారు.

నిజానికి బుద్ధుడు పరమసత్యస్వరూప విషయంలో కేవలం మౌనమే అవలంబించాడు గాని అంతకంటె భిన్నమైన దృక్పథం అవలంబించలేదు. తన అనుభూతి ప్రమాణంతోనే అతడు ధర్మప్రవచనాని కుపక్రమించాడు. ఈ విషయంలో శ్రీ వెంకటేశ్వరులుగారు పీఠికలో వ్రాసినదే సముచితంగా ఉన్నది.

వీరీ పీఠిక చివరిభాగంలో బౌద్ధమత పతనానికి శ్రుతివాక్యప్రమాణం అంగీకరించకపోవడమే ప్రధాన కారణమై ఉంటుందని ఊహించారు. ఇది సరియైన హేతువు కాదు.

ఏ మతమైనా కాలక్రమాన్ననుసరించి ప్రాచీన సిద్ధాంతాలకు, ఆదర్శాలకు దూరమై క్రమంగా భ్రష్టమార్గంలో పడిపోవడం నిత్యము జరుగుతున్న విషయమే.

బౌద్ధానికి కూడా కాలక్రమాన్ననుసరించి ఇటాంటి పరిణామమే కలిగింది. క్రమంగా ఆయా బౌద్ధధర్మశాఖల అవలంబకులలో బయలుదేరిన దురాచారాదులవల్ల బౌద్ధం భారతదేశంలో నామమాత్రావశేషంగా నిలిచింది.

శ్రీ వెంకటేశ్వరులుగారి అనువాదం వెనకటి భాగంలోకన్నా దీనిలో బాగా పాకంలో పడింది.

వీరి భాష గ్రాంథికమైనా ఇది ధారాళంగా సాగిపోతూ పాఠకుల కింకా చదవాలనే కుతూహలం కలిగిస్తున్నది.

ఇది క్రౌను సైజులో 550 పుటలుగల పెద్ద గ్రంథం. భారతీయాధ్యాత్మిక భావపరిణతి అవగాహన చేసుకోగోరే వారి కిది అత్యంతోపయుక్తమైనది.

క్రమంగా దీని మిగిలిన భాగాలు గూడా త్వరలోనే వెలువడగలవని ఆశిస్తున్నాము.

### 1. మాలిని
### 2. ప్రకృతి ప్రతీకారము
[నాటికలు]

బెజవాడ గోపాలరెడ్డి. త్రివేణీ పబ్లిషర్సు. మచిలీపట్టణము. మాలిని వెల 12 అణాలు. ప్రకృతి ప్రతీకారము 1 రూపాయి.

ఇవి రెండు రవీంద్రుడు వంగభాషలో రచించిన పద్యనాటికలు.

శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారివి రెండు గ్రాంథిక వచనంలో అనువదించారు.

కేవల పద్యనాటికకు, వచనా నాటికకు స్వరూప స్వభావాలలో చాలా వ్యత్యాసం ఉన్నది. పద్యనాటికలో పరిసరాలు, పాత్రల సంభాషణలు బాగా కవిత్వస్థాయిలోకి వెళ్లిపోతాయి. వచన నాటికలో ఇవి సహజంగా ఉండి, వాస్తవికతకు దగ్గరగా చేరిపోతాయి.

అందుచేత పద్యనాటికలు వచనంలోకి అనువదించేసరికే సహజంగా, వాటిలో ఉండే కవిత, కేవల

గద్యంలో రెక్కలు తెగిన పక్షి ధోరణిలోకి దిగిపోతుంది. తత్రాపి పరిణత భావనోన్మేషంతో సాగిపోయే రవీంద్రుని కవిత వచనంలోకి అనువదించడం మరింత కష్టం.

రవీంద్రుడు తన పద్యనాటికలలో చాలా వాటిలో *Blank verse* వంటి మాత్రాచ్ఛందస్సు ప్రయోగించాడు. ఇంకా కొన్ని నాటికలలో అక్కడక్కడ గేయాలుకూడా వాడాడు.

తెలుగులోకూడా ఈ నాటికలు అలాంటి మాత్రచ్ఛందస్సులలోనికో, గేయ ఛ్ఛందస్సులలోనికో అనువదించుకోవాలి. కేవలం గద్యానువాదాలవల్ల పాఠకులకు మూల కవితానుభూతి కలగడం కష్టం.

మాలినిలో అనువాదమంతా గద్యంలోనే నడిచింది. ప్రతీకారంలో అనువాదకులు కొన్నిచోట్ల గీతికలు కూడా వాడారు.

ఈ గేయాలలో మూల మాధుర్యం అంతగా భాసించడం లేదు. కొన్నికొన్ని చోట్ల వీరి గీతికలు పేలవంగా వినిపిస్తున్నాయి.

ఒక పురుషుని పాట

ప్రేయసి నినుచూచి బ్రతికిపోయాను.
అరుణ చరణాలలో నాదగల్గాను
బాధతో నిన్విడిచి పాటుపడ్డాను
తల బ్రద్దలగునట్లు తాపమందాను
గుసగుసలు చెవియందు గ్రుమ్మరించాను
పసమీరు నీ పరువు పాడుచేశాను.

ఇక వీరి వచనానువాదాలలో గద్యం చాలా చోట్ల, అటు కవితా స్థాయిగాని, ఇటు వచన స్థాయిగాని అందుకోలేకమధ్యేమార్గంలో సతమతమౌతున్నది. కొన్నికొన్ని చోట్ల జాతీయమైన పలుకుబడి సన్నగిల్లి వచనం కృతకంగా వినిపిస్తున్నది. మాలినిలో ఈ క్రింది అనువాదభాగం దీనికి తార్కాణంగా తీసుకోవచ్చును.





## మాలిని

"వినుము తండ్రీ, ఎవరు నా నిర్వాసమును కోరుచున్నారో, వారే నన్ను కోరుచున్నారు. తల్లీ నా మాట విను, నా చిత్తవ్యాకులత నేను తెలుపజాలకున్నాను. ఎట్టి దుఃఖ విచారములు లేకనే నన్ను వదలివేయుడు. శాఖాచ్యుత పత్రముల భంగి సర్వప్రాంతములకు నేను వెడలెదను — బయటి ప్రపంచము రాజద్వారమున నన్ను యాచించుచున్నది. ఎందులకో ఏ కార్యము కొరకో తెలియదు. మహాత్ముఁడు ఏతెంచినది."

రవీంద్రుని ఉత్తమ గద్యపద్య వాఙ్మయం చాలాభాగం ఇంకా తెనుగులోకి రాలేదు. ఇది సరియైన పద్ధతుల్లో తెలుగులోకి అనువదించడం చాలా అవసరం.

అనువాదకులు ముమ్ముందు రచించే అనువాదాలలో పై విషయాలు గమనించగలరనీ, అమూల్యమైన రవీంద్ర సారస్వతం అంతా సరియైన మార్గాలలో ఆంధ్రుల కందించగలరనీ ఆశిస్తున్నాము.

# గ్రంథ స్వీకృతి

## మంజూష

[సంస్కృత మాసపత్రిక]

సంపాదకులు - క్షితీశ చంద్రచట్టోపాధ్యాయులు. సంవత్సర చందా మూడురూపాయలు. ప్రతులకు 81, శ్యామబజార్ స్ట్రీట్. కలకత్తా.

ఇది 7 సంవత్సరాలనించీ నడుస్తున్న సంస్కృత మాసపత్రిక. ప్రస్తుత సంచిక గత అక్టోబరు సంచిక. దీనిలో 'మార్జార చరిత్రము, నామరహస్యము మొదలైన సులభమైన సంస్కృత వచన వ్యాసాలున్నాయి. సంస్కృత విద్యార్థుల భాషాభివృద్ధి కీపత్రిక బాగా ఉపయోగిస్తుంది. ఇంతేగాక ఈ పత్రికలోని గ్రంథ విమర్శనలు, కవిత మొదలయినవి పండితులకుకూడా పరిశీలన యోగ్యంగా ఉన్నాయి.

## తొలకరి చినుకులు

ఎన్నమనూరు చిన్న వెంకటరెడ్డి. ప్రతులకు అజాద్ హింద్ ప్రెస్ కడప. వెల. పన్నెండు అణాలు.

ఇది, ఆవేదన, సంశయడోల, అప్పగింత మొదలైన ఖండకావ్యాల సంపుటి.

రచయిత కీ కవిత ప్రథమ ప్రయత్నమైనా దీనిలో శబ్దసౌష్ఠవము, దానికి సముచితమైన భావ సౌశక్తీ స్ఫురిస్తున్నాయి. ఈ క్రింది రెండు గీతాలు వీరి ధోరణికి ఉదాహరణలుగా తీసుకోవచ్చును.

"నిర్మలాకాశమున మేలి నీలిరంగు
తెరలనడుమ విశాల సాగరముమీద
నవ్యఘణితిని తారకా నాట్యరాజ్ఞి
గజ్జెలు గదల్చియాడుటల్ గాంచుచుంటి
శైల శిఖరాలవంటి భావాలనెల్ల,
సేకరించి రసంబుల పాకమెరిగి
పరుగులెత్తెడి సెలయేటి నురుగులందు
తేలి వెన్నెల వలపులో సోలియుంటి."

## సూర్యదాస శతకము

కొలచల సూర్యనారాయణ. మహోపాధ్యాయుడు. బోర్డు హైస్కూలు. వెల. 4 అణాలు

ఇది చాలా భాగం ఆటవెలదులలోను, తేటగీతుల్లోను వ్రాసిన శతకము. దీనిలోని పద్యాలు సరళంగా సాగిపోతూ విద్యార్థులకు నీతిబోధకంగా ఉన్నాయి.

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

# లక్షలకొలది ప్రజలు నేడు వాడుతున్నారు మెక్లీన్స్-క్లోరోఫిల్ చేరినది



దీనికి కారణము

ఇది ప్రపంచంలో దంతములను ధవళతరమొనర్చునట్టి సర్వోత్తమమైన టూత్‌పేస్టు మరియు దీనిలో ప్రకృతిసిద్ధమైన దుర్గంధనివారిణి చేరియున్నది.

వాడిక ప్రారంభించిననాటినుండి జయప్రదఫలితముల నొసగే క్లోరోఫిల్ చేరిన మెక్లీన్స్ పెర్ఆక్సైడ్ టూత్‌పేస్టు ఇదివరలోకన్న ఇప్పుడు విశేషంగా వాడబడుతున్నది. వెనుకటి టూత్‌పేస్టులోగల కాలపరీక్షకు ఆగినట్టి పదార్థాలేవీ ఇప్పుడు తీసివేయబడలేదు- అది ఇప్పుడు కూడా వెనుకటి ప్రత్యేకపు మిశ్రణ పద్ధతి ప్రకారమే తయారౌతున్నది-కాని, క్లోరోఫిల్ ఒక్కటి మాత్రం అధికం, అయినా, క్లోరోఫిల్ మీ దంతాలను శుభ్రపరచదు. అది శుభ్రపరిచేది మీ శ్వాసనే, కనుక మీరు క్లోరోఫిల్ చేరినట్టి, దంతాలను ధవళతరమొనర్చునట్టి మంచి టూత్‌పేస్టును సంపాదించుట ఎంతముఖ్యమో ఆలోచించండి! అందువలన శుభ్రదంతములను, మధురశ్వాసను ఒసగునట్టి, క్లోరోఫిల్ చేరియున్న మెక్లీన్స్ పెర్ఆక్సైడ్ టూత్‌పేస్టునే మీరు ముఖ్యంగా కోరితెచ్చుకొవాలి.




## క్లోరోఫిల్ చేరిన
# మెక్లీన్స్
## పెరాక్సైడ్ టూత్‌పేస్టు

మెక్లీన్స్ వాడెడి వారికివిజ్ఞప్తి: వెనుకటి మెక్లీన్స్ పెర్ఆక్సైడ్ టూత్‌పేస్టుకూడా ఇప్పుడు ఎల్లచోట్లా లభిస్తున్నది.

CMI.5 TEL

Bharathi, 7th. January 1954 Regd. No. 1856

# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాదకుండ తెల్లగా [illegible] మరియు [illegible] ఉతుకును



నేను అదృష్టవంతుడను. ఎందుకనగా నా భార్య సన్‌లైట్ సబ్బుతో నా బట్టలను ఉతికి రక్షించును. సన్‌లైట్ యొక్క చాల ఎక్కువైనటువంటియు, త్వరగా పనిచేయు నటువంటియునైన నురగ మలినమునంతటిని బట్టలను బాదకుండ పోగొట్టును. ఈ విధముగా నా బట్టలు చాల కాలముండును. అందువలన నా ఖర్చు తగ్గును.



మీరు సన్‌లైట్ సబ్బుతో బట్టలను సులభముగా ఉతుకుటచే మీకు ఎక్కువ తీరిక ఉంటుంది. సన్‌లైట్ యొక్క చురుకైన నురగ మలినమును బయటికి తరిమివేసి రంగు బట్టలను మిక్కిలి ప్రకాశవంతముగా జేయును.

## సన్‌లైట్ సబ్బు

బట్టలను కాపాడును • శ్రమను తగ్గించును • ఖర్చును తగ్గించును




S. 220-X52 TL.